ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్

Like us to follow
@mohanpublications




- డా॥ సంధ్యావందనం గోదావరిచాయ్

# భారతము రాజనీతి విశేషాలు

# భారతము-
# రాజనీతి విశేషాలు



రచయిత్రి :

డా॥ సంధ్యావందనం గోదావరిబాయి

# ముందుమాట

మహాభారతము కొన్ని శతాబ్దముల క్రిందటి రచన.

కాలము మారినది. సంఘ వ్యవస్థ మారినది. రాజకీయ వ్యవస్థ రూపు వేత్తినవి. అయినను భారతదేశమున అప్పటికి - ఇప్పటికి మారక నిలిచిపోయినవి – మౌలిక నీతిస్తంభములు. ఆ స్తంభములపై నూతన రాజనీతి భవన నిర్మాణములు జరుగుచున్నవి. ఆ మూల భూతములగు మారని నీతి సూత్రములను "వ్యాస భారతము" నుండి, "కవిత్రయ భారతమునుండి వెదకి చూపించుటయే యీ నా ప్రయత్నము.

భారత రాజనీతిని ఈ నాటికిని హిందువులు గౌరవించుచునే యున్నారు. ఈ నాటి న్యాయస్థానములకు మను ధర్మశాస్త్రము మార్గము చూపుచున్నది. దాయ భాగ నిర్ణయమున ఈ నాటికి న్యాయశాస్త్రవేత్తలు యాజ్ఞవల్క్యస్మృతిని పరిశీలించు చున్నారు. కౌటిల్యుని అర్థశాస్త్రము రాజనీతికి మఱొక మూలస్తంభము. కనుక రాజకీయ వ్యవస్థ మార వచ్చును. కాని భారతీయులు మన్నించు రాజనీతి సూత్రములు మార లేదు. విజ్ఞానము విస్తృతి గాంచినది. విదేశ రాజకీయ ప్రభావము ఇందు చోటు చేసుకొన్నది. అయినను మానవతా దృక్పథముతో నిండిన సనాతన శాస్త్రములకు విలువ తగ్గలేదు. లోక కళ్యాణము దాని ధ్యేయము. ప్రజా శ్రేయస్సు దానికి గమ్యము. విశ్వశాంతి దానికి ఆశయము.

భారత రాజనీతి విశేషములను చూపుటకై నాఁగావించిన శ్రమ అత్యల్పము. ఈ భారత భారతీ సముద్రమున నాకు లభించిన రత్నము లత్యల్పములు. వీని నాధారముగా గొని - ఈ ప్రకాశమున నా అల్ప మేధస్సుతో రాజనీతి దృక్పథముతో పరిశీలించితిని. ఇందు లభించిన రాజనీతి విశేషములు - పాఠకులకే కొంత మనో వికాసము కలిగించినను ఉపకరించినను-సత్యమనిపించినను నా కృషి ధన్యమని తలంతును.

ఈ గ్రంథమును ముద్రించుటకు ఆర్థిక సహాయము నందఁజేసిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథమును ముద్రించునపుడు-యంత్ర దోషమువలన కలిగిన శతాధిక దోషములకు "తప్పొప్పుల పట్టిక"ను చేసి సవరణలు గావించితిని. ఇందలి దోషములను క్షమించి గుణములను గ్రహింపవలసినదిగా పాఠక లోకమునకు మనవి చేయుచు, నమస్సులతో

గోదావరీబాయి

రాజ్య వృక్షస్య నృపతి ర్మూలం
స్కంధాశ్చ మంత్రిణః
శాఖాః సేనాధిపాః
పల్లవాః కుసుమానిచ

(శుక్రనీతిసారము)





This Book is Published with the Financial Assistance of Tirumala Tirupathi Devasthanams under their Scheme – 'Aid to Publish Religious Books'

## వి ష య సూ చి క


పేజీలు

1) ముందుమాట

2) నిర్వచనము 1

3) మహాభారతము—రాజనీతి 2 – 6

4) రాజ్యము—నిర్వచనము 6 – 18

ఎ) రాజ్యము బి) ప్రభుత్వము సి) రాజ్యము పుట్టుక డి) రాజ్యము అవశ్యకత ఇ) రాజ్యము - పాశ్చాత్యుల అభిప్రాయము యఫ్) భారత కాలమున రాజ్య విస్తీర్ణత

5) రాజు 19 – 55

ఎ) రాజు-పుట్టుక బి) రాజు-కర్తవ్యము సి) రాజా కాలస్య కారణమ్ డి) రాజు తీసుకొనవలసిన జాగ్రత్తలు ఇ) రాజు - వారసత్వము-యయాతి చరిత్ర-శంతనుని చరిత్ర

6) అమాత్యులు – మంత్రము—మంత్రాలోచన 56 – 63

7) పురోహితుడు 63 – 66

8) భారతములో హితులు - విదురుడు 66 – 90

9) ప్రజలు – రాచరికములో వారి పాత్ర 91 – 114

10) వేగులు 115 – 121

11) రాజు – ప్రజా సంక్షేమము 121 – 141

12) యజ్ఞయాగములు 141 – 151

13) రాయబారము 151 – 201

పురోహితుని రాయబారము, సంజయ రాయ బారము, శ్రీ కృష్ణరాయబారము, కూట నీతి, కుటిల నీతి 201 – 258

14) దండనీతి

దండనీతి -అవశ్యకత, దండనీతి ప్రయోగము, కురుక్షేత్ర యుద్ధము, యుద్ధములు - వైవిధ్యము వ్యూహ రచనలు-ప్రయోజనములు 258 – 269

15) రాజధర్మము—నాడు-నేడు

16) ఉపసంహారము 270–71

17) ఉపయుక్త గ్రంథ సూచిక

# నిర్వచనము

రాజనీతి :— రాజులకు తెలుపవలసిన నీతి రాజనీతి. రాజులకు సంబంధించిన నీతి రాజనీతి.

పాశ్చాత్య దేశములందు - రాజనీతి విశారదుఁడని వాసిగాంచిన 'Aristotle' అను నతఁడు తన రాజనీతి (Politics) అను గ్రంథమునందు - రాజ్యము, పౌరుఁడు, ప్రభుత్వము, రాజకీయాదర్శములు మొదలగు విషయములను గుఱించి విశదముగా వివరించినాడు. కనుక రాజనీతి ఈ పై యంశములకు సంబంధించిన విషయ వివరణయే యని తెలియుచున్నది.

Garner అను నతని రాజనీతి శాస్త్రమున ప్రాథమికమగు కొన్ని మౌలిక సమస్యల గుఱించి చర్చింపఁబడినది. ఇందు రాజ్యము-పుట్టుక' స్వభావము - రాజకీయ సంస్థల వివిధ రూపములు పరిశీలింపబడినవి. 'Gettel'' అను నతఁడు

'Political-Science is a historical investigation of what the State has been an analytical study of what the state is; and a Politico ethical discussion of what the state should be' అని నిర్వచించినాడు.

దీనిననుసరించి ఇదివరకు రాజ్యమెట్లుండినది? నేఁడు రాజ్యమెట్లున్నది? అను విశ్లేషణాత్మక అధ్యయనము తద్వారా రాజ్యమెట్లుండవలెననెడి రాజకీయ నైతిక చింతన వీని సమాహార స్వరూపమే రాజనీతి శాస్త్రమని తెలియుచున్నది. ఇప్పటి అంశము "భారతము—రాజనీతి" అదియు "కవిత్రయ భారతము. రాజనీతి కనుక నేటి ప్రభుత్వ వివరణ అవసరములేదు. అభ్యుదయ ప్రభుత్వ సూచనలు భవిష్యత్తునందుండ వలసినవి అనవసరము. భారతమునందు చిత్రింపబడిన రాజనీతి విధానమును పరిశీలించిన చాలును.

అనంతకాలమునుండి మానవునకుత్థాన పతనములందు జీవిత యాత్ర నడచుచున్నది. సంఘాత విఘాతముల స్వరూపమే అతని జీవితము.

మానవుఁడు వేదనా యంత్రమునకొకప్పుడు నలిగి పోవుచుండును. ఒకప్పుడు హర్షాంబుధియందు మునిగి పోవుచుండును. జీవితమున అడుగడుగున జరుగు ఈ మానసిక క్షోభను తొలఁగించి సహకారము ద్వారా జీవిత ప్రగతిని సాధింపవలెను. ఈ మానవ సంఘమున సహకారమున కెంత తావున్నదో సంఘర్షణకును అంతే తావున్నది. సంఘర్షణను తొలగించి సహకారముతో మెలగవలెను. అందులకై కొన్ని నియమములను పాటింపవలెను. అట్లు నియమములను సంఘటితపఱచి అమలు జరుపుటకు అధికారముండవలెను.

ఆ అధికారమే ప్రభుత్వము. ఆ ప్రభుత్వమునకు సంఘమును శాసించు సార్వభౌమాధికారమున్న అది రాజ్యమగుచున్నది. అట్టి రాజ్యాంగము — రాజ్యాంగవ్యవస్థ — వీనిని గురించి తెలుపు శాస్త్రము "రాజనీతి శాస్త్రము".



మహా భారతము—రాజనీతి:—

ప్రాచీన భారతీయ సంస్కృతి అవిచ్ఛిన్నముగా సాగిపోవు జీవనది. దీని నవగతము చేసికొనుటకాధారములు-భారత రామాయణాది యుద్ధగ్రంథములు. భారతమున భారతీయుల సంప్రదాయములు, రాజనీతి సాంఘిక స్థితిగతులు సజీవముగా ప్రతిబింబించుచున్నది.

ఒక ఉన్నతజాతి—ఆత్మాభిమానముగల జాతి వివిధవ్యక్తిత్వములతో నిండినజాతి—సజీవ చైతన్యముగల జాతి—ఆ జాతి జీవనము. ఆ జాతి రాజకీయ చైతన్యము—పొయిన పలు పోకలును ఈ భారతమున దర్శింపవచ్చును.

ఆంధ్రీకృతములగు రామాయణ భారతములలో భారతమాంధ్ర ప్రజా హృదయములలో పొందిన స్థాయిని రామాయణమందు కొనలేదు. ఇందులకు కారణము ఆంధ్రీకృత భారతమా! భారతమునను వడించిన కవులా! పఠించు ప్రజలా! అని యరయ వలసి యున్నది.

ఆంధ్రుల మనస్తత్వము, సంప్రదాయములు, జీవితానుభూతులు భారతమున ప్రతిబింబించినంతగా – రామాయణమున ప్రతిబింబింప లేదనిన రామాయణమును కించపఱచినట్లు భావింపరాదు. రామాయణ మాదర్శవంతమగు జీవితమును ప్రోత్సహించిన-భారతము మానవుని నిత్య జీవితమునందలి రాగద్వేషాది ద్వంద్వములను, అందుండి మానవుని అంతరంగముపొందు సంఘర్షణలను, జయాపజయములను ఉన్నదున్నట్లుగ చిత్రించుచున్నది. కనుక ప్రజల జీవితమునకు భారతము సన్నిహితమైనంతగా రామాయణము కాలేక పోయినది.

నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడల కవిత్వమునందలి ఉదాత్తత భారతము నున్నత స్థానమున చేర్చుటకు కొంతవఱకు కారణములే యని చెప్పిన నతిశయోక్తి కాదు.

కనుక, కవిత్వము, కవులు, ప్రజలు–భారతమునున్నత స్థానము నకు గొనిపోవుటకు కారణములు.

ధర్మశాస్త్రమిదం శ్రేష్ఠం అర్థశాస్త్రమిదం పరమ్
కామశాస్త్రమిదం భాగ్యం మోక్షశాస్త్రమిదం పరమ్
భారతము ఆదిపర్వము॥

"ఈ భారతము శ్రేష్ఠమగు ధర్మశాస్త్రము. ఉత్కృష్టమగు అర్థ శాస్త్రము. అగ్రశ్రేణికి చెందిన కామశాస్త్రము – ఉత్తమమగు మోక్ష శాస్త్రము".

దాయాదులు రాజ్యకాంక్షచేత గావించిన యుద్ధము నిందు చూడఁ గలము. క్షత్రియ కులమునకు చెందిన ఇరువురు అన్నదమ్ముల కుమా

రుల వైరగాథ ఇందలి ఇతి వృత్తము. ఆ వైరము శృతిమించి కురు క్షేత్ర సంగ్రామముగా పరిణమించినది. ఆ సంగ్రామాగ్ని గుండమున ప్రఖ్యాతములగు రాజవంశములన్నియు నెట్లు ఆహుతియై పోయినవో చూడవచ్చును.

ఈ భారతమున క్షత్రియేతరుల కథలును అచ్చటచ్చట గలవు, కాని అవి గౌణములు.

ఒక ప్రత్యేక కుటుంబ చరిత్రనాధారముగా గొని ఆకాలమునందలి సమగ్ర జీవిత విధానమును చిత్రీకరించుచున్నది ఈ ఇతిహాసము, భరత వంశమహారాజుల చరిత్ర ఇది. ధర్మాధర్మములకు, సత్యాసత్యము లకు జరుగు సంఘర్షణయే ఈ ఇతి వృత్తము. కురు పాండవ వంశ మునకు జరిగిన పోరాటమిది.

ఈ భారతము పురాణము, పురాణమేకాదు కావ్యము, కావ్యమే కాదు శాస్త్రము—శాస్త్రమే కాదు సమగ్ర రాజనీతి శాస్త్రము.

వ్యవహార ధర్మమున కిది పేటిక-ఆపద్ధర్మమున కిది నిలయము. మోక్ష ధర్మమును తెలుపు తత్త్వగ్రంథము. మహా భారతమునకున్న రక్తి దేశ కాలాతీతమైనది.

"యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్ క్వచిత్" అని ఇందు లేనిది మరెందును లేదు,—అని వ్యాస వాక్కు

ఆనాటి ఆర్యుల మేధాశక్తి అపారము, ఆ మేధాశక్తిని విభిన్న దృష్టి కోణములలో ప్రతిబింబింపజేయుచున్నది—భారతగాథ.

నేటి భారతీయ ప్రజాస్వామ్య రాజ్యమునకును ఆదర్శప్రాయము లగు అంశము లిందు పెక్కులు గలవు.

నామ రూపములు మారినను, దేశ కాలములు మారినను, ఆ నాటి రాజనీతి విధానము ఈ నాటికిని బహుభంగిమల అనుసరింప, బడుచునే యున్నది.

"యథా రాజన్ హస్తి పదే పదాని
సంక్షీయంతే సర్వసత్త్వోద్భవాని
సర్వే ధర్మా రాజ ధర్మేషు యుక్తాః
సర్వేలోకాః రాజధర్మే ప్రవిష్టాః"

భార. శాంతి. 63 అధ్యాయం

"ఏనుఁగు యొక్క అడుగునందు తక్కిన జంతువుల పాదము లన్నియును ఇమిడి పోవునట్లు—రాజ ధర్మమునందు సమస్త ధర్మములు ఒదిగి పోవుచున్నవి".

తక్కిన ధర్మములు అల్పాశ్రయములు, అల్ప ఫలదములు, రాజ ధర్మము విశాలాశ్రయము, మహత్తర ఫలము గలది,

11-3-22

విష్ణు పురాణమున
"అత్రాపి భారతం శ్రేష్ఠం జంబూద్వీపే మహామునే
యతోహి కర్మభూరేషాహ్యతోన్యా భోగ భూమయః" అని గలదు.

భారతము కర్మభూమి. తక్కిన భూములు భోగ భూములు-కనుక భరతభూమి శ్రేష్ఠ మైనది. ఇందలి రాజుల చరిత్ర కర్మప్రధాన మైనది.

శాంతి పర్వమున భీష్ముఁడు పట్టాభిషిక్తుఁడగు ధర్మజునితో పలికిన పలుకులు. రాజైన ప్రతివాఁడును స్వర్ణాక్షరములతో లిఖించి నిత్యమును పాటింపఁదగిన అమూల్య సూత్రములు.

అందలి సారాంశమిది:—

"రాజు ప్రజారంజకుడు గావలెను. నిక్కము, చక్కటియును గలిగి జనుల చిత్తములను నొప్పింపక వర్తింపవలె. పెట్టవలయు తఱిని పెట్ట

వలయునట్టిది పెట్టవలె, సైరణగలిగి వర్తింపవలె" అప్పుడే భూవల్లభుం డభివృద్ధిపొంది అతిశయించును.

తన ఆపదలను వైదిక మార్గమున అణంచుట అతనికి శ్రేయస్సు. చతుర్వర్గ పరత అతనికి హితము. సకలవర్ణ ధర్మసంకరము కానుండ రక్షించుట అతని విధి. సంధి విగ్రహాది షడ్గుణముల నలయక అర యుట అతని కర్తవ్యము అర్థమును సమ్యగుపార్జన గావించుట అతని నేర్పు. దుర్వినీతుల దండించి ధనము గ్రహించుట అతని సదా దాయము. సుజనులకిగి నృపతికి ధర్మము. ఎవ్వరిని అతిగా నమ్మక, ఎక్కువగా నమ్మకయు నుండక" కార్యమును గొనుట అతనికి నీతి.

తన బుద్ధితో పరీక్షించి 'తగవు', 'తగమి'-ని చక్కగా కనుగొనుట అతనికి విచక్షణ. రాజులుబుండై ధనము నపహరించుట యేతన పనీ యని బ్రదుకుట తగదు."

ఇట్టియే ఆనాటి రాజులు నడచుకొనవలసిన నీతి. Aristotle అను రాజనీతి వేత్త "మానవుడు రాజకీయ జంతువు" అనెను. Plato-Socrates శిష్యుడు. ఇతడు "Epology" "Crito" అను రెండు గ్రంథములలో-రాజ్యమనగా వ్యక్తుల సమూహమని, "వ్యక్తి" యనిన "రాజ్యాంశమ"ని నిర్వచించెను.

ఈ యభిప్రాయమును "Republic" అను మరొక గ్రంథమున్ద నపులీకరించెను. కనుక వ్యక్తుల సమూహమగు "రాజ్యము"ను గురించి తెలిసికొందము గాక!



రాజ్యము:- "రాజ్యమను"నది యొక ప్రత్యేక భూభాగమునకు పరి మితమైనది. అందు ప్రజలు స్థిరముగ నివసించువారై యుండవలెను. ఆ ప్రజలను దండనాధికారమున పాలించుటకు ప్రభుత్వమొకటి యుండ వలె, ఆ ప్రజాసముదాయము సర్వ స్వామ్యముగల సంఘమై యుండ

వలె. అదే రాజ్యము. అందేది లోపించినను ఆ భూభాగము రాజ్య మనిపించుకొన జాలదు. భూభాగము లేకున్న ప్రజలు స్థిరముగ నిలువ, జాలరు. ప్రజలు లేకున్న, పరిపాలనావకాశముండదు. ప్రజలపై ప్రభుత్వము లేకున్న శాంత్యభ్యుదయములుండవు. అరాజకత ప్రబ లును. కనుక రాజ్యమెంత అవసరమైనదో తెలియుచున్నది.

మానవుడు సంఘజీవి, స్వేచ్ఛాప్రియుడు. సంఘజీవికి సంపూర్ణ స్వేచ్ఛ సాధ్యము కాదు. స్వేచ్ఛాప్రియుడు కనుక—అతడు హద్దు మీరి ప్రవర్తింపవచ్చును. అప్పుడతని స్వేచ్ఛ మఱొకనికి బాధ కలిగింప వచ్చును. అప్పుడు అరాజకత ప్రబలును-అట్టి అరాజకతను తొల గించుటకు ప్రభుత్వమవసరము. ఇట్లు ప్రభుత్వ మేర్పడినపుడు— 'సంఘము' 'రాజ్యము'గా మారుచున్నది. ఆ రాజ్యము హద్దుమీరిన స్వేచ్ఛను అదుపులో పెట్టును. అట్లు అదుపులో నుంచుటకు "అధి కారము" అవసరము.

"అధికారమ"నునదొక శక్తి. ఇతరుల కిష్టమున్నను, లేకున్నను వారి ప్రవర్తనను బలవంతముగా మార్చి వారిచేత పనులు చేయింపగల సామర్థ్యమునకు 'శక్తి' యని పేరు. అట్టి "శక్తి"ని వినియోగించుటకు నైతికమగు "అర్హత" అవసరము. అప్పుడే "అధికారము" చెల్లును. సంఘజీవికి సంపూర్ణ స్వేచ్ఛ సాధ్యముకాదు అతని స్వేచ్ఛ హద్దుమీరి నపుడు—'అధికారము' అనగా "రాజ్యశక్తి" అంకుశమై అణచును. బల వంతుడు బలహీనుని అణచుటకు ప్రయత్నించునపుడు—'రాజ్యశక్తి' ఆ బలవంతునణచుటకు ప్రయత్నించును.

కనుక—ప్రతివ్యక్తి యొక్క స్వేచ్ఛ కొన్ని నియమములకు కట్టు బడి యుండవలెను. ఒక అధికారమునకు లోబడి యుండవలెను. ప్రతి ఇతర వ్యక్తికి బాధ కలిగింపరాదు. అప్పుడే అట్టి వ్యక్తులతో గూడిన జాతి సర్వతో ముఖవికాసమును పొందగలదు. ఆ వ్యక్తి వికా సము రాజ్యవికాసమునకు, ఆ రాజ్య వికాసము విశ్వ వికాసమునకు సాధన భూతములై వెలయగలవు.

## Man is a Political Animal—

మానవుఁడు రాజకీయ జంతువు.

**'Plato' — Republic'** అను గ్రంథమున ఆదర్శప్రాయమగు సర్వోత్తమ రాజ్యమును నిర్వచించినాఁడు. న్యాయమును గుఱించి పరామర్శించినాడు. **Plato** శిష్యుఁడు **Aristotle.** ఇతడు గురువునకు భిన్నముగ వ్యక్తి కంటెను రాజ్యమే ప్రధానమని విశ్వసించెను. రాజ్యమున్నప్పుఁడే—మానవుఁడు సుఖముగా జీవింపఁగలఁడని నైతిక లక్ష్యములను సిద్ధింపఁజేసి కొనఁగలఁడని వాదించెను. శాసన విధేయతలోనే నిజమైన స్వాతంత్ర్యమిమిడి యున్నదని నిర్ణయించెను. ఈయన రాజకీయ వాస్తవికతా వాదమునకు, రాజనీతి శాస్త్రమునకు పితామహుఁడు. ఒకరిది ఆదర్శప్రాయమైన భావనా పూర్వక రాజ్యమైన మఱొకరిది వాస్తవికతా వాదముతోఁగూడిన రాజ్యము.

Woodrow Wilson – "నిర్వచనము—

"ఒక నిర్ణీత ప్రదేశములో శాసన బద్ధులై నివసించు ప్రజలు రాజ్యము"

**Holland** నిర్వచనము ప్రకారము రాజ్యమనగా ప్రజానీకము నివసించు నిర్ణీత ప్రదేశము

**Garner** ప్రకారము' రకరకాల మానవ సమాజములు ఒక నిర్ణీత భూభాగంలో స్థిరపడి బాహ్యాధి పత్యమునకు లోనైయుండక క్రమబద్ధమైన ప్రభుత్వానికి విధేయులై ఉండిన రాజ్యమని చెప్పట జరుగును."

కనుక సారాంశముగా— పాశ్చాత్య ప్రతీచి రాజనీతి శాస్త్రములు రెండును - ఒక శాసనమునకు నిబద్ధమైన నిర్ణీత భూభాగము' రాజ్యమని తెలుపుచున్నవి.

ప్రభుత్వము;- రాజ్యవిధులను అమలు జరుపు సంస్థ ప్రభుత్వము ఇది రాజ్యమునకు ముఖ్య సాధనము దీనివలన అవసరమగు శాసనముల నిర్మాణమగును.చట్టములు నిర్మింపబడును. న్యాయము చేకూర్చ బడును. న్యాయా, న్యాయ విమర్శ జరుగఁగలదు. దుర్మార్గులు సంఘ విద్రోహులు దండింపఁ బడుదురు. రాజ్య సుస్థిరత రక్షింప బడును.

ప్రజల సమైక్యత కిది సాధనము. ఆర్థికాభివృద్ధికిది మూలము. ప్రభుత్వము లేని రాజ్యము జీవము లేని దేహము

'రాజ్యము' శాశ్వతమగు రాజకీయ సంస్థ. ప్రభుత్వ స్థిరత పరిమితము. రాజ్యమున సంభవించు పరిణామములకులోనై ప్రభుత్వము మార్పు చెందుచుండును.

బ్రిటిష్ రాజ్యాంగములో రాజుగాని, రాణీగాని మరణించిన వెంటనే ఒక ప్రకటన చేయబడుచున్నది. The King is Dead, Long live the King'-'రాజు మరణించినాఁడు. రాజు దీర్ఘకాలము జీవించు గాక"- అని,

ఇందు మొదటి 'రాజు' అను పదము మరణించిన రాజున కన్వయించును రెండవ 'రాజు' అనుపదము రాజ్యమున కన్వయించును కనుక "ప్రభువు" అశాశ్వతుఁడు కావచ్చును. "ప్రభుత్వము" మాత్రం శాశ్వతము. రాజ్యమునందు మార్పు రాకపోవచ్చును. "ప్రభుత్వము" నందు మార్పు సంభవించుట తథ్యము.

మత ప్రాధాన్యమున్న రాజ్యములన్నింటిలోను ప్రభువుల "అధికారము"ను దైవ దత్తమని భావించినారు.

"ప్రభువులు భగవంతుని ప్రతినిధులు. ప్రభువులేని ప్రజానీకము తలలేని మొండెము. ప్రభువు శాసనము భగవంతుని శాసనము. ప్రభువు నాదేశములను శిరసావహించి తీరవలెను. ప్రభువుల కార్యనిర్వహణను

ప్రజలు విమర్శింపగూడదు. ప్రభువు భగవంతునికే బాధ్యుఁడు కాని మానవులకు కాదు" అని యీ సిద్ధాంత సారము.

1946 వఱకు జపానులో చక్రవర్తులు సూర్యభగవానుని సంతతి వారని వాడుక. రోమను ప్రజలును చక్రవర్తులను దైవ సమానులనుగా పూజించెడివారు.

రాజ్యము జరుగవలయునున్న ప్రభువును విశ్వసింపవలసినదే! అతనిని గౌరవింప వలసినదే! మానవుఁడు తనంతట అధికారములను నిర్వహించుకొనఁజాలడు. కనుక ప్రభుత్వము నెడల విధేయత చూపించవలసినదే! అట్టి విశ్వాసమును పెంపొందించుటకీ సిద్ధాంతము తోడ్పడినది.



రాజ్యము—పుట్టుక :— జీవ కోటిలో ఎల్లప్పుడును పరస్పర సంఘర్షణము గలదు. ఏది బలవత్తరమైనదో అదే సృష్టిలో నిలుచునని జీవ శాస్త్రమునందొక సిద్ధాంతము గలదు. (Survival of the fittest.)

'Spencer' అను పండితుడు మానవ సంఘమును "సాంఘిక జీవనమ"ని నిర్వచించినాఁడు. మానవ కోటిలోను నిరంతర సంఘర్షణ చేత ఉత్తమ గుణములేర్పడునని తెలిపినాఁడు. అదియే రాజ్యములకు "బునాది" యని సమర్థించెను.

కాని, మానవుఁడు సజీవ జంతు మాత్రుఁడే కాదు. అతనికి "బుద్ధి" గలదు, 'ఆత్మ' గలదు. "ఆత్మసాక్షి" అతని యందు పని చేయును. పరిణామమును తాను సృష్టించు కొనఁగలడు. బుద్ధి వికాసముతో శాంత జీవనమును గడపుటకై ఆదర్శమును చేరవలెనని పాటుపడఁగలడు. అట్టి మహత్తరమగు సంస్థ మానవ సంఘము.

కనుక రాజనీతికి జీవశాస్త్రము ఆధారముకాదని ఒక మతము.

భారత దేశమున–రాజ్య వ్యవస్థ వేదకాలము నుండి ఏర్పడినది, గ్రీకు నాగరకత కంటెను వేద కాలపు నాగరకత ప్రాచీన తరమని చారిత్రకుల మతము. 'రాజ్యం' అను శబ్దము ఐతరేయ బ్రాహ్మణ మునందున్నది. శతపథ బ్రాహ్మణమునందున్నది. తైత్తరీయము నందు, శతపథ బ్రాహ్మణము నందు "సమ్రాట్"–"సామ్రాజ్య" పద ములు కనిపించుచున్నవి.

పడమట రోమను సామ్రాజ్యము న్యాయ శాస్త్ర సూత్రములను తన రాజకీయానుభవము చేత నిర్వచించుటకు పూర్వమే భరతభూమిలో మన ఋషులు ధర్మ శాస్త్రములను రచించిరి. సమ్రాట్టులకు అంకుశ మును ఏర్పఱచిరి. ఆత్మానాత్మ వివేచన గావించిరి. సృష్టిని పర మాత్మ స్వరూపముగా భావించిరి వ్యష్టిసౌఖ్యమును–సమిష్టి సౌఖ్య మునకు, సమిష్టి సౌఖ్యమును–రాజ్య సౌఖ్యమునకు బలిగావింప వచ్చు ననిరి. రాజుల సౌఖ్యమునకు ప్రాధాన్యమీయక సంఘ సౌఖ్యమునకు ప్రాధాన్యమొసంగిన రాజనీతి యది. కనుక "నా విష్ణుః పృధివీపతిః" అను భావన రాజును విశృంఖల నియంతగా చేయఁజాలక పోయినది.

భారతీయ రాజ్యసంస్థ – బలముపై నాధారపడి యుండలేదు. 'Might is right - అనునది వారి భావనలోనే లేకుండినది. రాజ్య సంస్థ ధర్మ సంరక్షణకై జన్మించినది. రాజులు శత్రు రాజులపై దండెత్తుచుండిరి. విక్రమము ప్రదర్శించి వారిని జయించు చుండిరి. వారి రాజ్యములలో జయస్తంభములను నాటుచుండిరి. కాని, ఈ జయించుట తమ అద్వితీయ పరాక్రమమును ప్రదర్శించుటకు మాత్రమే!.

విజితులైన వారి రాజ్యములను వశపఱచుకొనలేదు. కొంత కప్పము చెల్లించి పరాజితులు స్వతంత్రముగా పరిపాలింపవచ్చును.

ఇక ఆ రాష్ట్ర వ్యవస్థలో రాజు కల్పించుకొనఁడు. అతనికి అవసరమైనపుడు మాత్రము వీరిసేనను పంపి సహాయ పడవలసియుండెడిది, అంతియే! ఇట్లు విక్రయమున అద్వితీయుఁడై సర్వ లక్షణ లక్షితుఁడైన వానిని రాజులందరు కలసి సామ్రాజ్య అధిపతిగా ఎన్నుకొనుచుండిరి. అట్లు సామ్రాజ్య పదవి నంది పరిపాలించిన వారి వంశములను – ఏ సూర్య చంద్రులకో కలుపుచుండిరి.

సంస్కృత భారతములో రాజుల వంశ నామములుగాని వారి పేర్లుగాని తఱచుఁగా పేర్కొనఁబడవు. ప్రజా నామములే వినబడుచుండును.

కురువులు, పాంచాలురు, మాగధులు, యదు. వృష్ణి బోజులు. వంగ కళింగ కాశ్మీర కాంభోజ గౌడాంధ్రులు–అని వారి రాజ్యములపేర్లు ప్రజా నామములతో కలిసి పోయినవి.

దేశములు సుభిక్షములు. జనాకర్షములునైయుండెడివని యూహింపవచ్చును, నివాస యోగ్యములై వెలసినవని నిర్ణయింపవచ్చును.



రాజ్యము–ఆవశ్యకత:—

రాజ్యము, పౌరుల అభివృద్ధి సాధనము మాత్రమే! ప్రజాక్షేమమే రాజ్యమునకు పరమావధి, ఇతరములు ముఖ్యములు. "పౌరుడు–రాజ్యము" రెండును పరస్పరాశ్రయములు. పౌరుఁడు లేని రాజ్యము లేదు. రాజ్యము లేని పౌరుడు లేఁడు. పౌరుని వ్యక్తిత్వ వికాసమునకు రాజ్యమువంటి సాధనము మఱొకటి లేదు. వ్యక్తి రాజ్యమునందొక అంశము. "రాష్ట్రము లోపలను వెలుపలను శాంతిభద్రతలను కాపాడుటయే రాజ్యోద్దేశ్యము" అని కౌటిల్యుడు పలికెను.

వ్యక్తుల సుఖ సాధనమే రాజ్యోద్దేశ్యమని కొందఱు–రాజ్య సమిష్టి సుఖమే రాజ్యోద్దేశ్యమని కొందఱు–రాజ్యము అందఱి కల్యాణమునకు సాధనమని మరి కొందఱు సిద్ధాంతీకరించిరి.

రాజ్యము–పాశ్చాత్యుల అభిప్రాయము:—

కొందఱు దౌర్జన్య కారణముగా రాజ్యమను సంస్థ ఏర్పడినదనిరి. మఱి కొందఱు రాజ్యము దైవ దత్తమనిరి. "మానవులు పరస్పరము ఒప్పందము చేసికొన్నందున రాజ్యము జన్మించినదని" కొందఱు—" చారిత్రకముగా పరిణతి పొందినదె రాజ్యము'ని మరి కొందఱు పాశ్చాత్యులు–తమ విభిన్నాభిప్రాయములను పేర్కొనిరి.

Hobbes, Bentham, Trechtk— పశుబల ప్రయోగమే రాజ్యాధికారమున కవసరమనిరి. Hobbesఅను రాజనీతి దురంధరుఁడు బలాత్కారమే మానవుని సంఘమునకు లొంగదీయుననెను.

"రాజ్యపు పశుబలమే" రాజ్య శాసనములన్నింటికిని పునాది" యని Bentham పలుకులు, కాని–కేవలము పశుబలము మాత్రముచే మానవులను లొంగదీయుట అసాధ్యము.

మానవుఁడు అధిపత్యము కోరుట జాతి సహజ గుణము. అంతే సహజముగ విధేయ ప్రవృత్తి కలిగియుండుటయు గలదు. ఈ వినయ ప్రవృత్తియే – తల్లి దండ్రులు. పెద్దలు, గురువులు–వీరిమొడ గౌరవము కలుగ జేసినది. అదే విధముగ నాయకత్వము వహించుటకే పుట్టిన వారు ఏ కొందరో జన్మించియుందురు.

మానవుల సంఘము కుటుంబములుగా పరిణతి చెందినది. గోత్రములుగా ప్రబలినవి. రాష్ట్రములుగా, రాజ్యములుగా విస్తరించినవి ఆ రాజ్యములు సుఖ శాంతులతో నుండవలయుననిన-కొన్ని నియమములకు అందరి ప్రజలు కట్టుబడియుండవలెను. అట్టి నియమోల్లంఘనము గావించు వారిని శిక్షించుటకు ధైర్య సాహసములు కల వారు రాజులగుచుండిరి, వారిలో ప్రజలకు విశ్వాసమేర్పడవలెను. వారిని భక్తితో సేవింపవలె, వారి యాజ్ఞలను నమ్రులై శిరసావహించవలె, అందులకై యట్టిరాజులను విష్ణ్వంశ సంభూతులుగ, లోకపాలాంశముతో జన్మించినవారినిగ చిత్రించుచుండిరి.

అప్పుడు వారియందు గౌరవ విశ్వాసము లేర్పడెడివి. కనుకనే "నా విష్ణు విష్ణుః పృథివీ పతిః" అని పలుకవలసి వచ్చినది.

కాని, ఈ భావనను — కొందఱు - రాజును నిరంకుశుని గావింప గలట్టి దనిరి. నాస్తిక వాదము ప్రబలిన కాలమునందును, హేతు వాదము ప్రబలినకాలము నందును ఇటువంటి యుక్తులు పని చేయవు.

భారత కాలము నాఁటి రాజరికము ప్రజా రాజ్యము కాదు. విశృంఖలమగు నియంతృత్వమును కాదు. కొన్ని శాస్త్రములకు ఆచారములకు కట్టుబడిన కేంద్రీకృత ప్రభుత్వమది.

భారత కాలమున రాజ్య విస్తీర్ణత :— (భీష్మ పర్వమాధారముగా)

ఈ సమస్త ప్రపంచము సప్త ద్వీప సమావిష్టము, ఆ సప్త ద్వీపములలో జంబూ ద్వీపయొకటి, తక్కినవి-శక ద్వీపము, కుశ ద్వీపము, శ్యామల ద్వీపము, క్రౌంచ ద్వీపము; గోమేధ ద్వీపము మరియు పుష్కర ద్వీపము, అందు జంబూద్వీపమే-భరత వర్షము.

"జంబూ ద్వీపమే భారత వర్షము" — అనుట కుపపత్తులంతగా లేవని చారిత్రక పరిశోధకులందురు.

జంబూ ద్వీపము నందేడు వర్షములున్నవి:—

(1) ఇలా వర్త వర్షము. (2) రమణక వర్షము (3) శ్వేత వర్షము (4) ఉత్తర కురువర్షము. (5) భారత వర్షము. (6) కింపు రుష వర్షము. (7) హరి వర్షము.

ఈ ఏడింటికిని తరువాత భద్రాశ్వ వర్షము, గంధమాదన వర్షము- అని మఱి రెండు కలుపఁబడినవి. మత్స్య, బ్రహ్మాండ పురాణము లందు ఈ పైన చెప్పఁబడినపేర్లు భిన్న నామములతో నున్నవి. భారత దేశమునకు "కూర్మ" చక్రమని కూడ పేరు.

ఈ నాఁటికిని భారతీయులు–జంబూ ద్వీపమును, భరత వర్షమును, భరత ఖండమును మేరువునకు దక్షిణ దిగ్భాగము నందుండుటను— సంధ్యా వందనమునందు పేర్కొనుచున్నారు. "సప్తద్వీపా వసుంధరా" యను మాట ప్రసిద్ధము,

ఆంధ్ర భారతము భీష్మప, 1 అ. 18 పను.

" హేమ పర్వత దక్షిణ దిగ్భాగమున జంబూ తరువు గలదు. అది ప్రభూత విస్తారమై రెండు వేల ఏనూఱు యోజనముల పాదవుగలిగి సరస మధుర ఫల సమేతముగా నుండును. దాని పండ్లు మహీస్థలి యందు మహారవముగా పొంగి వాహినీమూర్తియై అన్నగమునకు ప్రదక్షిణముగా నొరని కొనుచు నుత్తర కురుభూము లందు" జొచ్చి, అంబుధికడకు పాఱును.

జంబూనది యనంబరగిన యా తరంగిణి నీరు సోకినచోటెల్లను సువర్ణంబగుటంజేసి–కనకంబునకు జాంబూనదంబను నామము కలిగి నది. తదీయ జలపానము చేసిన మానవులకు ముదిమియు–తెవులును దప్పియును లేవని చెప్పుదురు. ఆ యేటి పడమటి పెఱఁగి పఱపు గలిగి శరనిధి చందంబున జంబూషండంబు కాఱుకొను చుండును.

ఇంతటికి కారణమగు ఆ జంబూ వృక్షము పేర నీ ద్వీపము జంబూ ద్వీపంబు—సుదర్శన ద్వీపంబు అన నెగడి లవణ సముద్ర ముద్రితంబయి పొలుచు"

ఆ దీవియందు నడుపున, తూర్పును, పడమరను రెండు గడలు అంబోనిధి గదిసి యుండు హిమాచలమును గలదు. ఇది యానాఁటి భరత భూమి వైశాల్యము.

ఆ ద్వీప విషయమునంతగా నిర్ణయించుటకు వీలగు నాధారములు లేవేమో కాని, ఆ యేటిని—గంగానదిగా గ్రహింప వచ్చును. అందలి నీటికి—ఇప్పటికిని అప్పటికిని పవిత్రమను భావనయే గలదు. తూర్పు పడమరలందు అంబోనిధి ఇప్పటికిని గలదు. హిమ వత్పర్వతమును ఇప్పటికిని గలదు.

అందుగల పర్వతములు—మలయము. శుక్తిమంతము. వింధ్యము, పారియాత్రము, మహేంద్రము, ఋక్షవంతము, సహ్యము ఈ ఏడు కుల నగంబులు పొలుచుచుండును. ఇందు వింధ్యాదులిప్పటికిని అదే నామములతో విలసిల్లుచున్నవి.

నదులు ;— గంగ, తుంగభద్ర, వేత్రవతి, కృష్ణ, పెన్న, యమున తమస, శిలావతి. కావేరి, గోదావరి, నర్మద, బాహుద, సరయు, శతద్రుమ వితస్త, విపాశ, తామ్రపర్ణి „అను మహానదులు మఱియు అనేక సరిద్విశేషంబులు గలవు.

అందలి దేశములు—అనఁగా రాష్ట్రములు విభిన్న నామములతో విలసిల్లును.

పాంచాల, పాండ్య, బర్బర, వత్స, మత్స్య, మగధ, మళయాళ కళింగ, కుళింగ, కుకుర, కొంకణ, పెంకణ, త్రిగర్త, సాముద్ర, సాళ్వ, శూరసేన, సుదేష్ణ, సుహ్మ, కురు, కరూశ, కాశ, కోసల, యవన.

యుగంధర, ఆంధ్ర, సింధు, చేది, చోళ, పుళింద, పుండ్రక పాండ్య ఆభీర, సావీర, సౌరాష్ట్ర, మహారాష్ట్ర, విదేహ, విదర్భ, ద్రావిళ, దశార్ణ, కర్ణాట, గౌళాంగ, వంగ, మరాట, లాట, బాహ్లిక, బహుదాన, కిరాత, కేకయ, అశ్మంత, కాశ్మీర, గాంధార, కాంభోజ, కేరళ, మాళవ, నేపాళ, ఘూర్జర, కుంతల, ఆవంతిక, అనూపాది జన పదంబులు సమస్త వస్తు సంపత్సంపాదనంబులయిన గుణ విశేషంబుల వెలసి పురుషార్థంబులగు ధర్మార్ధ కామంబులకు కారణంబులై కమ నీయంబులగు చుండు.

దశార్ణ దేశమున కుత్తరమున—పాంచాల జనపదము, యామ్య దిగ్భాగమున—సాళ్వ, శూరసేన విషయములుండినవి కాళిందికి దక్షిణ తీరము నొరసి కొనీ పశ్చిమాభి ముఖముగా పట్టణములు వెలసినవి.

"రాజ్య వృక్షస్య నృపతి ర్మూలం
స్కంధాశ్చ మంత్రిణః
శాఖాః సేనాధిపాః సేనాః
పల్లవాః కుసుమాని చ" (శుక్రనీతి సారము)

V 12

రాజ్యము నొక వృక్షముగా, నృపతిని ఆ వృక్షమునకు మూల ముగా మంత్రులను స్కంధములుగా, సేనాధిపతు శాఖలుగా సేనలను పల్లవములుగా కుసుమములుగా పోల్చి చెప్పిరి.

"ప్రజాః ఫలాని" అందలి ప్రజలే ఫలములు.

"బీజమ్ భూమికి ప్రకల్పితా"— ఆ ఫలములకు బీజము భూమిగా చిత్రీకరింపబడినది.

భారత కాలమున రాజ్య వృక్షమునకు బీజ భూతమగు భూ భాగమును గురించి ఇంతవరకు పరిశీలించితిమి. అందలి జీవనదులను,

పర్వతములను, గమనించితిమి. కాలగర్భమున నదులు ఇసుక తిన్నెలు కావచ్చును. ప్రవాహములు క్రొత్తమలుపులు తిరగవచ్చును. రాజ్యముల పరిధులు మారవచ్చును. పేర్లు మారవచ్చును. మారక అప్పటికీ ఇప్పటికి నిలిచి గల గల పారు జీవనదిగా దిగంతములకు విస్తరించి పారుచున్నది ఇందలి సంస్కృతి. ఇట్లు సంస్కృతిని శాశ్వత ముగా నిలుపఁగలిగినది—రాజ్యము-అందలి ప్రభుత్వములు.

రాజ్య విస్తీర్ణతలో మార్పులు రావచ్చును. ప్రభుత్వ విధానములో మార్పులు రావచ్చును. రాజరికము పోయి ప్రజాస్వామ్య మేర్పడ వచ్చును. అయినను – అప్పటికి ఇప్పటికి-మాఱక నిలిచిపోయిన మౌలిక సూత్రములు గలవు. విశ్వమానవకళ్యాణమునకై పాటుపడు సంస్కృతి గలదు. అది ఎప్పటికని–భారతీయులను–భారతీయులుగనే యుంచునట్టిది.

అట్టి సంస్కృతిలో వెలసిన రాజనీతి ఎట్టిదో పరిశీలింతముగాక! భారతమునాధారముగా గొని గ్రహింతము గాక!



రాజు—పుట్టుక ;—

రాజైవ చ కర్తా భూతానాం
రాజైవ చ వినాశకః
ధర్మాత్మా యస్య కర్తా స్యా
ద ధర్మాత్మా వినాశకః

భార—శాంతి
9—1

రాజే సర్వభూతములకు కల్యాణము చేకూర్చువాఁడు, వారి స్థితిని నిలుపువాఁడు. రాజే సర్వప్రాణులను నాశము గావింప సమర్థుఁడు. కనుక రాజు ధర్మాత్ముఁడైన లోకములకు కల్యాణము చెకూరును. అతఁడధర్మ పరుఁడైన లోకవినాశము తప్పదు.

"రాజు" అను పదవిని ధరించిన వానికెంతటి గురుతర బాధ్యత గలదో మనము గుర్తింపఁగలము.

"రాజ్య వృక్షస్య నృపతి ర్మూలం" అని శుక్రనీతి ఘోషించుచున్నది. "రాజా ప్రకృతి రంజనాత్" అని రాజ శబ్దమునకు వ్యుత్పత్తి. ప్రజలను రంజింపఁజేయుట చేతనే రాజు అన్వర్థ నామధేయుఁడగు చున్నాఁడు.

"ఏష ఏవ పరో ధర్మో యద్రాజ రక్షతి ప్రజాః॥
ప్రజలను రక్షించుటయే రాజుయొక్క ముఖ్యధర్మము—ఈనాటికిని ప్రతి రాజును భారతరాజ ధర్మము ననుసరించి-సింహాసనము నధిష్టించుటకు ముందు ప్రజలను ధర్మముగా పాలింతున"ని ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు.

కనుక—రాజ్యాధి కారమును హస్తగతమొనర్చు కొనవలసినవాడు.

"వ్యక్తిగత మనో వికారములను నిర్జించి ప్రాణి మాత్రుని సమ భావముతో చూడవలెను."

కామ క్రోధాదులను జయించి, ప్రజారక్షణయే తన జీవిత ధ్యేయముగా కర్తవ్య మార్గము నందుపక్రమింప వలెను.

శాశ్వత ధర్మ పరిరక్షణకై తను, మన, ధనములనర్పింపవలెను. ఇట్టి వానికే రాజను నామము చెల్లును. అని తెలియయున్నది. అట్టి రాజును విష్ణ్వంశ సంభూతుఁడనుటలో దోషము లేదు.

ఆ నాఁటి రాజన్యులు యశోమండితులు, కృతజ్ఞులు. వినుత పరాక్రమ సంపన్నులు, శరణాగతాను కంపనులు, అతుల భోగము అంచిత త్యాగము రెండును ఆ నాఁటి రాజుల కభ్యస్తములు.

"క్షతాత్ త్రాయత ఇతి క్షత్రియః" అని వ్యుత్పత్తి.

క్షతినుండి—బాధనుండి—ప్రజాసమూహమును రక్షింపఁగలమఁడు క్షత్రియుఁడు.

"ప్రజానాం రక్షణం దానం ఇజ్యాధ్యయనమేవచ
విషయేష్వప్రసక్తిశ్చ క్షత్రి యస్య సమాసతః"
మనుస్మృతి 1 అధ్యా 89 శ్లో.

ప్రజా పాలనము, దానము, యజ్ఞము, వేదాధ్యయనము, విషయములైన గీత నృత్య స్త్రీ భోగాదులు—వీనియందు ఆసక్తి లేకుండుట—ఇవి క్షత్రియులకు ధర్మములని మనుస్మృతికారుఁడు సంకేతించెను.

ఈ నాఁడు భారతీయుల దృష్టిలో రాచరికము ప్రజా తంత్రము. రాజును సింహాసనమెక్కించుటకును, దింపుటకును అధికారము గల వారు ప్రజలే! భారత కాలమునాఁడును ప్రజా ప్రాముఖ్యముండినదా! అను విషయమును గురించి ముప్ముందు చర్చింపఁబడును.

రాజరికము (Monarchy) అనునదే భారత దేశమునందు భారత కాలపు వ్యవస్థ.

రాజు నిరంకుశుఁడు కారాదు. చండ శాసనుఁడై రాజ్యమేలనిదే సమస్త ప్రజలు అతని శాసనమునకు కట్టుబడరు. కనుక రాజునకు నిరంకుశత్వమవసరమే! కాని అది అనుకంపాసహితమగు నిరంకుశత్వమై యుండవలెను. (benevolent despotisn) నృపుఁడు పరిపాలనా భారమును—తానొక్కఁడు పూనఁజాలడు. కావున ఉత్తములైన అమాత్యుల నియమించి—వారి అభిప్రాయములను గ్రహించి రాజ్యపాలన గావింపవలెను. కనుకనే కౌటిల్యుడు "రాజత్వము సహాయ సాధ్యమని" పేర్కొనినాడు. ఒక చక్రమెన్నడును నడువ నేరదుకదా! యని తెలిపినాఁడు. కావున రాజు సచివుల విడుకొని—వారి మతము ననుసరించి ప్రవర్తింపవలెను." అని నుడివినాడు.

"The King infact was the root of the State"
(Great political Thintors)

కృతయుగము మొట్ట మొదటి నాఁటి మాట:—
(భారతము శాంతి పర్వము)

ఆ నాఁడు ధర్మము నాలుఁగు పాదముల నడచుచుండినది. జనులను శాసించు వారులేరు. రాజు లేఁడు. ప్రజలందఱును అన్యోన్య రక్ష గావించు కొనుచుండిరి. నిర్మత్సరులైయుండిరి.

క్రమ క్రమముగా వారియందు రాగ ద్వేషములు ప్రబలినవి. విశృంఖలత హెచ్చినది. లోభము పెరిగినది ధర్మము సన్నగిల్లినది, ప్రజలు వేద విధ్వంసకులై విచ్చలవిడిగా విమార్గమున సంచరించిరి. వేద కర్మలు నశించినవి.

అప్పుఁడు—ప్రజలను వారి వారి నియత మార్గములందు నడుప వలసిన ఆవశ్యకత ఏర్పడినది. బ్రహ్మ దండనీతిని వివరించుచు బృహద్గ్రంథము నావిష్కరించినాఁడు, ఆ బృహద్గ్రంథమున "సామ్యా మాత్యసుహృత్ కోశ రాష్ట్ర దుర్గ బలమును, అన్వీక్షకీత్రయీ వార్తా దండ నీతులును-అరిమిత్ర ఉదాసీనాది ద్వాదశరాజ మండలంబులును- సంధి, విగ్రహ, యాన. ఆసన, ద్వైధీ భావ సమాశ్రయంబులును— మొదలుగా వలయువానికి ప్రబోధకంబులగు నానావయువంబులు గలిగి ధర్మార్ధ కామ మోక్షములకు సాధకంబులయి యుండునట్లుగా నూఱు వేల అధ్యాయంబులను అఖిలలోక హితంబగు నీతి శాస్త్రంబు రచియించి ఇది లోక చరిత్ర నిర్మలీ కరణంబునకు కారణంబగును"ని అను గ్రహించెను.

ఆ లోక పితామహుని లలాటమునుండి అనాది నిధనుండు, విశ్వ జగత్కర్త, "విశాలాక్షుడు"— అను పేర ఆవిర్భవించినాఁడు. ఆ గ్రంథమును పరిశీలించినాఁడు. దాని నభ్యసించుటకు మర్త్యుల కాయుర్బుద్ధులు చాలవని నిర్ణయించినాడు. ఆ మహనీయ తంత్రమును సంక్షేప రూపమున "వైశాలాక్షము"ను పేరిట నిర్మించినాడు.

ఇంద్రుఁడా గ్రంథమును అయిదువేలధ్యాయములు గావించినాడు, అసురగురుఁడద్దానిని త్రిసహస్రాధ్యాయ సమ్మితముగ నొనరించినాఁడు. శుక్రుఁడు దానిని సహస్రాధ్యాయ పరిమితము గావించెను.

ఇది రాజనీతి శాస్త్రము యొక్క ఆవిర్భావకథ! భారత శాంతి పర్వము నందలిది.

ఈ శాస్త్రము ననుసరించి;—

"రాజు విష్ణుని యంశమున అవతరించెను. కనుక దైవనిభుఁడగు రాజు ఎల్లవారిచేతను మ్రొక్కులు గొనంజాలును"

12-2-216

పాశ్చాత్య చింతకులును రాజ్యావతరణమును గుఱించి ఇంచు మించుగా ఇట్లే భగవదవతారమని. భావించుచున్నారు.

"రాజ్యము నందన్ని హక్కులు పౌరునివి. సువ్యవస్థకై అరాచ కము కాకూడదు. అందులకై అతడు తన హక్కులలో కొన్నింటిని "రాజ"ను నామము ధరించిన వ్యక్తికి అర్పణ చేసినాడు.

పరిశిష్టములగు స్వత్వములన్నియును పౌరునివే" అని రూసో మొదలగు వారి భావన.

అతఁడు రాజరికమును 'Social contract' అని భావించున్న. పాశ్చాత్యులందును "The divine right of king" అనువాదము మధ్యయుగాంతము వఱకును ప్రచారములో నుండినది,

"రాజు" పుట్టుకను గుఱించి,-శాంతి పర్వమునందు ఇట్లుగలదు- "ఒకప్పుఁడు కృత యుగమున జనులకు రక్షకుఁడు లేఁడు. రాజు లేఁడు. క్రమముగా శాంతి ధర్మములు రూపు మాసినవి. క్రూరత పెచ్చు పెరిగినది అంతును, ప్రముచ్చిమి-అధికమైనది. ప్రజలు దురపిల్లిరి. అట్టి దుర్జనులను శాసించుటకై తమకొక రక్షకునిమ్మని బ్రహ్మను ప్రార్థించిరి. తమకొక ఉత్తముఁడగు నృపునిమ్మని వేడిరి. ఆయన ఈ కార్యమునకై మనువును నియోగించెను. మనువు దాని కంగీకరింపలేదు. అప్పుఁడు మనువునందఱును ప్రార్థించిరి- తమ పశువులందు, పసిడియందు ఏబదవ భాగమును, ధాన్యము నందు దశమ భాగమును బండారమున కిత్తుమనిరి శస్త్రోపజీవులందఱును అతనివశమై యుండురని తామందఱును అతని ననుసరించి నడతుమని వాగ్దానమొనర్చిరి. "అధర్మవర్తనులు నీచేత చెడుదురు. ధర్మ వర్తనులు గావించిన ధర్మమువలన ఆఱవ పాలు నిన్ను చేరగలద"ని యభ్యర్థించిరి.

అతఁడతి బలవంతుఁడై నీతితో భూమిని పరిపాలించెను. అశేష జనము అతని పాలనచేత సుఖముగా నుండిరి

ఇదొక ఉపాఖ్యానము. శాంతి పర్వము నందలిది. ఈ యుపాఖ్యానము దండధారియగు నృపుఁడు లేకున్న ఎంతటి అనర్థమో విదితమగు చున్నది. రాజును ప్రజలు ఎన్నుకొనుచుండిరో లేక రాజత్వము వంశానుగతమో తెలుపలేదు.

రాజునకు శరీరము ప్రజయని, రాజప్రజల కాత్మయని చక్కగా తెలిపెను.

పాశ్చాత్యులలోను-మత ప్రాధాన్యమున్న రాజ్యములన్నింటిలోను ప్రభువుల అధికారమును దైవ దత్తమని భావించినారు.

"ప్రభువులు భగవంతుని ప్రతినిధులు. ప్రభువులేని ప్రజానీకము తలలేని మొండము. ప్రభువు శాసనము భగవంతుని శాసనము. ప్రభువు నా దేశములను శిరసావహించి తీరవలెను. ప్రభువుల కార్య నిర్వహణను ప్రజలు విమర్శింపఁగూడదు. ప్రభువు భగవంతునికే బాధ్యుఁడు కాని మానవులకు గాదు, ఇది వారి సిద్ధాంతసారము.

రాజ్యము జరుగ వలయునన్న, ప్రభువును విశ్వసింప వలసినదే! అతనిని గౌరవింప వలసినదే! మానవుఁడు తనంతట అధికారములను నిర్వహించు కొనఁజాలఁడు. కనుక ప్రభుత్వము నెడల విధేయత చూపించ వలసినదే!

కనుక, అట్టి విశ్వాసమును పెంపొందించుటకీ సిద్ధాంతము తోడ్పడినది.



రాజు-కర్తవ్యము

రాజు సప్తాంగముల నెల్లప్పుడును అరయుచుండ వలయును. సంతతము ధర్మసేవ చేయుట ఉత్తమము. దుర్మంత్రుల కుటిల వాక్యములకు లోను గారాదు.

శాంతిపర్వమున– కాలవృక్షీయ క్షేమదర్శి సంవాదము వలన అధములగు కపటోద్యోగులు రాజ్య ప్రజలను పీడింపకుండా చూడవలెనని ధర్మజునకు భీష్ముడు తెలియఁజేయు చున్నాడు.

ప్రజాహితమే రాజునకు పరమ లక్ష్యమని; ఆత్మనిగ్రహము ప్రధానమగు అవశ్యకత యని అప్పుడే రాజూత్తముఁడుగా రాణింపఁ గలఁడని బోధించు చున్నాడు.

రాజు దూరదృష్టి గలవాఁడై రానున్న యాపదలను ముందే గుర్తెఱింగి రక్షాతత్పరుఁడు కావలెను. ఈ నీతిని తెలుపుటకై శాంతనవుఁడు దీర్ఘదర్శి, ప్రాప్త కాలజ్ఞుఁడు, దీర్ఘ సూత్రుఁడు అను మత్స్యముల వృత్తాంతమును వినిపించెను.

"రాజు" మొదట తన్ను తాను జయించి, ఇంద్రియ నిగ్రహము సాధించి ప్రజారక్షణకు పూనుకొనవలెను.

రాజు– ఆరామశాది నిజ సంచార స్థలములకు, దేశ సంధులకు నగరమునకు రక్ష యొనర్పవలెను. పర రాజుల కడ వేగులను పంప వలెను. స్వరాజ్యము నందు చారులనుంచవలెను. బాంధవుల, అమాత్యుల ప్రవర్తనలను పరిశీలింపను వేగులను వినియోగింపవలెను.

తన రాజ్యము నందలి కోటలనేమ్మఱక–అఖిల యంత్రములతోను ఆప్తవీరులతోను, వస్తు సామాగ్రితోను నింపి యుంచవలెను.

రాజు సమ భావముతో ప్రజలను పాలింపవలెనని తెలిపినాఁడు. కృతజ్ఞత, జితేంద్రియత్వము కలిగి ప్రవర్తింపవలెను. లోకములు, లోక ధర్మములు రాజ మూలములు. రాజ విరహితులగు పుడమి జనులు–ఇంకిన మడుగులోని జల చరములట్లు భంగపడుదురు. రాజు పితృసముఁడై భూమిని పాలింపవలెను. విరోధి జనభీషణుఁడై

యుండవలెను. రాజులేనిచో ప్రజలకు తమ ధనము నెడ స్వాయత్తతా భావము లేకుండును. విభుఁడు లేని ప్రజలు భీతి చిత్తులై హాహా కారమున తల్లడిల్లుదురు.

నరపతి రక్షించుచుండగా — ప్రజలకు యాగములు, భోగములు, త్యాగములు, బహువిధ ధర్మములు చెల్లును.

రాజు-చార చక్షువై ప్రజలను పాలించునప్పుడు అతనిని సూర్యుఁడందురు. అకార్య కరులను దునుమునప్పుడు అతఁడు యముఁడు. అతడు ప్రజలపై ధనమును వర్షించును, ఉపకార పరులకు ప్రత్యుపకృతి యొనర్చును. అపకారుల సంపదల హరించి కోశమును నింపును, అప్పుడాతఁడు కుబేరుడు.

ఈ కర్తవ్యముల సాధింపనినాఁడు అతడు నృపుఁడుకాఁడు తస్కరుఁడు. రాజ రూపమున నున్న కలి.

"ఆత్మాజ్ఞేయస్సదా రాజ్ఞా తతో జ్ఞేయాశ్చ శత్రవః
అజితాత్మా నరపతి ర్విజయేత్ స కథం రిపూన్"

భారతము (శాం. 69)

రాజు మొదట తన్నుతాను జయించవలెను. అనంతరము శత్రువులను జయింపవలెను. తన్ను తాను జయింపలేని రాజు శత్రువుల నెట్లు జయింపఁగలడు?

ఇట్లు తన్ను తాను గెలుపగోరు రాజు — కర్మేంద్రియములను జయింపవలెను. జ్ఞానేంద్రియముల జయింపవలెను. మనస్సును జయింపవలెను. కామజములగు—అక్ష, మృగయా, స్త్రీ, పానములందు తగులు కొనరాదు. క్రోధజంబులగు వాక్పారుష్య, దండ పారుష్యములును త్యజింపవలెను. సప్త వ్యసనములందు తగులు కొనక యుజ్ఞ,

అధ్యయన. దాన, తత్పరుఁడు కావలెను. దుర్మంత్రుల కుటిల వాక్యంబులకు లోనుకారాదు. నయ, విక్రమ కర్మజ్ఞులైన అమాత్యులతో దైవమానుష చింతనము సేయుచు దేవబ్రాహ్మణ ప్రణామమొనర్చుచు తర్పణలు సేయుచు, రక్షణలు గావించుచు అశుభ నిరాసన మొనర్ప వలెను. ఇట్లు శుభములొనర్చుచు ప్రజల పాలించు రాజు భయ లోకములందు సిద్ధి పొందును.

"రాజా కాలస్య కారణమ్ :—

"రాజే కాలమునకు కారణము" అని ధర్మజునకు శాంతిపర్వమున భీష్ముఁడు రాజును గుఱించి చెప్పునప్పుఁడు తెలిపినాఁడు. అతని వివరణమిది—

భూరమణుఁడే కాలమునకు కారణము, కాలమనఁగా యుగ ములు, యుగములకు సంబంధించిన ధర్మములు.

కృత యుగారంభమున రాజు సంపూర్ణగతిని ధర్మమును నడుపు చుండెను. "దండనీతి" నిష్పక్షపాతముగ నుండెడిది. కనుక ప్రజలు సుఖ శాంతులతో మెలగుఁచుండిరి. ధర్మము నాలుఁగు పాదముల నడచుచుండెను. వైదిక కర్మలు సక్రమముగా నిర్వర్తింపఁబడెడివి. ఆ యుగమున ప్రజల కాయువధికముగా నుండినది. పృథివి దున్నకయే పండినది.

త్రేతాయుగమున — రాజు ధర్మమును మూఁడు భాగములు నడుపును. అదే విధముగా ప్రజల సౌఖ్యముపకై పాటుః పడును.

ద్వాపరమున ధర్మము రెండు భాగములు మాత్రము నడుపును. ప్రజలకంత మాత్రమే సౌఖ్యము చేకూఱును.

కలియుగము నందలి నరపతి ధర్మోపేక్షాపరుఁడగును. ధర్మాస్తురణము బాయును. ఎందును అధర్మము ప్రబలును. వర్ణాశ్రమములు పథము దప్పును. కాల ప్రభావ మట్టిది.

ఇట్లు రాజు గావించు ధర్మము ననుసరించియే యుగములు. యుగ ధర్మములు మారును. కనుక రాజు కాలమునకు కారణము, ఇందెంతవఱకు సత్యము కలదని పరిశీలింపవలసి యున్నది. రాజు అతి తీక్ష్ణముగా దండనీతిని చేపట్టి—నిష్పక్షపాతముగా ప్రజలను పాలించెనను కొందము. అప్పుడు ప్రజలు తప్పక 'న్యాయము" నకు భయపడుదురు. ప్రజలలోని దుష్ప్రవర్తన తప్పక కొంతవఱకు తగ్గును. 'యథారాజ తథాప్రజాః" అని ప్రజలు రాజుత్రొక్కిన మార్గమునే అనుసరింతురు, కనుక రాజు ధర్మాత్ముడై, ధర్మనిష్ట గలిగి ప్రజలను పాలించెనేని ప్రజలును కొంతవఱకైనను రాజుననుసరించి సన్మార్గవర్తులగుదురు. కనుక రాజే కాలమునకు కారణము.

"కాలో వా కారణం రాజ్ఞః రాజా వా కాలకారణమ్
ఇతితే సంశయో మాభూత్ రాజా కాలస్య కారణమ్"

మనుస్మృతి
భారతము శాంతి పర్వ—2

రాజు :— తీసికొనవలసిన జాగ్రత్తలు —

రాజైనవాడు—ఆత్మరంధ్రము లించుకైనను ఒరులకు నెఱుఁగ రాకుండ మఱువు పేయవలెను. అన్య రంధ్రముల నరసి కనుగొనవలెను.

శత్రువుల కడ – బుద్ధి, బలము కలుగువారి నెఱుంగవలెను. ఒక్కమైఁ—ఈగిన్ని, మన్ననను నెఱపి—వారి మనస్సులు ఆర్ద్రములగునట్లు గావింపవలెను.

-షమీపమునందలి నృపులతో వైరబంధము గాకుండునట్లు జాగ్రత్త పడవలెను. ఆ సమీపస్థుఁడు రాజు శత్రువైనచో-వానికవతల నుండు వారు మిత్రులగుదురు. అచ్చటికి సమీపవర్తులగు విభులు ఉదాసీన వర్తులు.

వీరల సప్తాంగములను - ఎల్లప్పుడును అరయుచుండవలెను. సమానబలుఁడైనచో, ఆ నృపునితో సంధి చేసికొనవలెను.

శత్రువునకెప్పుఁడు దైవ మానుష బలములు తఱిగి యుండునో- అప్పుడే వైరమును పాటింపవలెను. యుద్ధమును ప్రకటింపవలెను. చెఱచుటయో, అప్పనము గొనుటయో అర్హత్వమరసి నడుపవలెను. సౌకర్యములను భిన్నముగావించి, హస్తగతము గావించు కొనవలెనని భేదనీతిని తెలుపుచున్నాఁడు.

శత్రు రాజ్యమునందలి పెద్దల మనస్సులు భిన్నములగునట్లు నడుపవలెను.

ధృతరాష్ట్రుడు ధర్మజునితో శత్రురాజుల జయించు తెఱఁగు చెప్పిన తీరు—

శత్రురాజులకు కుడవనిచ్చు అవసరము, కక్కించు అవసరము తెలిసి-ధరవృత్తితో-నిడు ద్రాట పోనివ్వవలెను.

ఉత్సాహ శక్తియందు, మంత్రశక్తి యందు, ప్రభు శక్తియందు తనకు శత్రువునకు గల తారతమ్యమును ఉపాయముతో గుర్తించి వైర మెత్తవలెను. ఉపాయముతో-పలుక కుండుటయు తగును.

మూల బలము లొఱంటిని అఱయవలెను- మూల బలము, మొత్తాలవారు, మిత్రబలము, శత్రు బలము, కానన బలము. కైజీత గ్రాండు-వీరి కొలఁదులెఱింగి ఉచిత, కాలదేశ యుక్తముగ యుద్ధమునకు ప్రయత్నింపవలెను.

బలములను-సంపదలందు, ఆపదలందు ఒకేరీతిగా చూడవలెను. అయినను హితకారియగు బలమును ఎక్కువగా పోషింపవలెను. వినికి గలిగి రక్షింపవలెను. దయతో అనువుగా ఆ యతులను గొనవలెను. న్యాయముగా గొనవలెను. ఇట్లు పొగడొందిన రాజునకు ఉర్వి కామధేనువగు చున్నది.

ధర్మమార్గమున ధరణిని పరిపాలించిన—ఐహిక సుఖము, అగ్గలపు పొగడ్త, పరలోకమున భూరి సౌఖ్యము సిద్ధించును.

విపుల దక్షిణలు పెట్టి—అశ్వమేధ ప్రముఖములగు అధ్వరములు పెక్కులాచరించుట కంటెను—మేదినీ ప్రజలను అత్యాదరమున కరుణాతిశయమున బిడ్డలనరసినట్లుగా నిష్పక్షపాత బుద్ధితో రక్షణ మొనరించుటయే అధిక పుణ్య ఫలదము.

భారతము
(శాంతి పర్వమాధారముగా)



"సామ్యమాత్య జనపద దుర్గకోశ దండ మిత్రాణి ప్రకృతయః ॥

రాజు–మంత్రులు–జనపదములు–దుర్గము–కోశము–దండము – మిత్రులు–వీనిని ప్రకృతులందురు.

ఇందు రాజైన వానికుండవలసిన లక్షణముల నిట్లు కౌటిల్యుఁడు తెలుపు చున్నాడు.

రాజునకు గుణత్రయ ముండవలెను.

ఈ గుణములు:- 1) అభిగామిక గుణములు 2) ప్రజ్ఞాగుణములు 3) ఉత్సాహ గుణములు.

మహాకులీనత – దైవబుద్ధి – సత్త్వ సంపన్నత – వృద్ధ దర్శిత– ధార్మికత–సత్య వాక్కు–కృతజ్ఞత–ఉన్నతాభిలాష–మహోత్సాహము– అదీర్ఘ సూత్రత–దృఢ బుద్ధి–వశీకరణ శీలము–అక్షుద్ర పరిషత్‌యుక్త వినయము–ఇవి అ గామిక గుణములు.

ప్రజ్ఞా గుణములు – శాస్త్ర చర్చ – శాస్త్ర జ్ఞానము – ప్రత్యేక విషయమును గ్రహించుట – గ్రహించిన విషయమును జ్ఞాపకము నందుంచుకొనుట – విశేష జ్ఞానము – తర్క వితర్కముల ద్వారా విషయతలమును గ్రహించుట – చెడు పక్షమును వదలుట – గుణ వంతుల పక్షమును గ్రహించుట – ఇవి రాజునకుండవలసిన ప్రజ్ఞా గుణములు.

శౌర్యము – అమర్షము – శీఘ్ర కారిత – దక్షత – ఈ నాలుగు ఉత్సాహ గుణములు.

శక్తి మూఁడు విధములు – జ్ఞానబలము – కోశదండ బలములు– విక్రయ బలము.

జ్ఞాన బలమును – మంత్రశక్తియందెను. కోశసేనా బలములు - ప్రభుశక్తి – విక్రమ బలము – ఉత్సాహశక్తి.

ఈ శక్తులతో సంపన్నుఁడగు రాజు శ్రేష్ఠుఁడు. ఇందు – రాజునకు గల జ్ఞానశక్తిలో – మంత్రులు – పురోహితులు – ఆదేశమును చక్కగా ఇయ్యగఁల విప్రులు ఉందురు.

బ్రాహ్మణులయందు తపోబలము-మంత్రబలము మహత్తరములు క్షత్రియుల యందు – అస్త్రబలము – శస్త్రబలము అధికము.

ఈ రెండును కలసినపుఁడే పరిపాలన సవ్యముగా సాగుచున్నది. శాసనములనఁగా యాజ్ఞవల్క్యస్మృతి—

"శ్రుతిః స్మృతిః సదాచారః స్వస్యచ ప్రియమాత్మనః
సమ్యక్సంకల్పజః కామో ధర్మమూల మిదం స్మృతమ్"
యాజ్ఞవల్క్యస్య ఉపో, 3 శ్లో.

"శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రం తువైస్మృతిః"
సదాచారః – సతాం శిష్టానాం ఆచారః – అనుష్ఠానమ్.
ఆత్మనః ప్రియం – సమ్యక్సంకల్పాజ్జాతః – కామః
ఏతే ధర్మస్య ప్రమాణమ్– అని చెప్పుచున్నది.

వేదశాస్త్రమున చెప్పఁబడినట్లు నడచుట శాసనమనిపించుకొనును. స్మృతులందు చెప్పిన విధమున ప్రవర్తించుట శాసన విధేయతయే. మూఁడవది – సదాచారము. అనఁగా సత్పురుషులు నడచిన మార్గము.

నాలుగవది – అంతః కరణ ప్రమాణము.
"వేదః స్మృతి సదాచారః స్వస్య చప్రియ మాత్మనః
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్"
మను: I-12

వేదములు ప్రమాణములు. స్మృతి విధానము ప్రమాణము సత్పురుషుల ప్రవర్తన ఆదర్శము. ఆత్మకు మనస్సాక్షికి ప్రియమైనవది ప్రమాణము. ఇదే ధర్మ స్వరూపము. ధర్మమార్గమున నడచుకొనుట- శాసనము ననుసరించి నడచుకొనుట.

వేద కాలమునందలి ధర్మము – కొంత మారవచ్చును. దేశ కాలములననుసరించి స్మృతులను ధిక్కరించి నడచుకొనవచ్చును. కాని కొన్ని మూలసూత్రములకు మూల ధర్మములకు మార్పు జరగదు. జరుగఁబోదు. వీనినే మౌలికశాసనములనవచ్చును.

ప్రభుత్వమును మూఁడు ప్రత్యేక శాఖలుగా విభజింప వచ్చును. (1) శాసన నిర్మాణము (2) శాసన నిర్వహణము (3) శాసన వివరణము.

ఈ మూఁడును ప్రభుత్వమునందిమిడిన మూఁడు శక్తులు.

ఋషులు – మహాత్ములు – వ్రాసి పెట్టిన ధర్మ శాస్త్రములను అనుకరణీయములని అంగీకరించు కొనిన సంఘములలో రాజుల చేతులలో ఈ మూఁడు శక్తులు ఉండునవి కావు.

ఈ శక్తిత్రయ సమ్మేళనము నిరంకుశులను చేయునట్టిది. కనుక – ఈ శక్తిని – విభజించి ప్రత్యేకము విభాగములుగా చేయుట మంచిది.

రాజ్యము సుస్థిరముగా నుండవలెననిన – ఈ శక్తిత్రయము పటిష్ఠముగా నుండవలెను.

శాసన నిర్మాణము గావించు విభాగమొకటి – ఆది పూర్వము – ఋషులు – తపస్వులు – గావించుచుండిది.

రాజ్యము—కొన్ని శాసనములను చేయును. ఈ శాసనములన్నియు ప్రజా సంక్షేమము కొఱకే. ఈ శాసనములను ఉల్లంఘించిన వారికి శిక్షలు విధించుట కలదు.

శరీరమునకు బాధలు కలిగించుట—కారాగారమున బంధించుట—కఠిన శిక్షలకు గుఱి చేయుట — దేశమునుండి వెడల నడచుట వంటివి శిక్షలు! ఈ శిక్షలకు హద్దు గలదు. శాస్త్రము గలదు. భారతకాలమున ఈ శాస్త్రములే శాసనములు. శాసనములు — శాస్త్రములు సమానార్థములు గలవి.

రాజ్య పరిపాలనపై — తపస్విజనులు, బ్రాహ్మణులు—అంకుశము వంటివారు. వీరి యభిప్రాయములు—స్మృతుల రూపమున వెలసినవి. మనుస్మృతి — యాజ్ఞవల్క్య స్మృతివంటివి. కౌటిల్యుని అర్ధశాస్త్రము వంటిది. ఇవి తర్వాత రాజులకు అనుసరింపఁదగిన శాసనములు.

ఈ తపస్వులు రాగ, ద్వేష విదూరులు. కనుక వీరి ఆదేశములు—అను శాసనములు — పక్షపాత రహితములై యుండెడివి. శుచులైన విద్వాంసులను తోడుగొని — వ్యవహారముల తీర్పుపలయును. దుష్ట జనుల దండించునపుడు వారి తప్పుల కొలదులు మదిని తూచి తూచి తన్మాత్ర దండమునే విధింపవలెను.

రాజైన వాఁడు — ఆయ వ్యయములను అనుదినము సంక్షేప రూపమున వినుచుండవలెను. దానికి ముందు దేవతా పూజనము చేయవలెను. భూసురార్చన చేయవలెను.

దేశమునందు క్రొత్తగా ఏమి పుట్టినను అలసుఁడు కాక అరసి తీర్చవలెను. న్యాయముతో వివిధోపాయముల అర్థార్జన గావింపవలెను. రాజ్య విఘాతము చేయు జనుల నెఱుంగవలెను వారిని చంపుట — చెఱపుట — చేయవలెను.

రాజైన వాఁడు సభ యందు
"పనుల యెడ మేలు గాంచిన
మనుగడ యగ్గలముసేసి మన్నింపవలెను"

పేరు పేరున క్రుచ్చి కుచ్చి – కొలువునందా భృత్యులను కొని యాడవలెను. వారు గావించిన ఘన కార్యముల పొగడవలె.

ఈ నాఁటికి రాజ్యము కొఱకై విశిష్ట సేవచేసిన వ్యక్తులకు ప్రత్యేక బిరుదములు, సన్మానములు, కానుకలు ఇచ్చుచున్నారు. అర్జున, భారతరత్న, వంటి బిరుదములు – ధనరూపమున కానుకలు – తామ్ర పత్రములు – ఇచ్చుచున్నారు.

అప్పుఁడే అవిశిష్ట వ్యక్తులానందింతురు మఱుఁగున పడిన అట్టి ధీమంతులు ముందుఁబడి – కాయశక్తుల గౌరవమునకో, బిరుదమునకో, కానుకకో – ఆశపడి రాజ్యసేవ చేయగఁలరు. సోమరులు–అనాసక్తులు ముందుపడి ఆసక్తితో పని చేయఁగలరు.

ఆశ్రమ వాస పర్వమున ధృతరాష్ట్రుడు ధర్మజునితో "నీవు నిచ్చలు విద్యా వృద్ధ జనముల నుపాసింపుము. వారిని అర్థములతో ప్రీతులఁగావింపుము. వారు నీతినుపదేశింప వానిని మనమున స్థిరముగా నుంచి వర్తింపుము" అని బోధించినాఁడు."

మంత్రులు రాజ్యమునకు మస్తిష్కము వంటివారు, ధర్మజుఁడు పట్టాభిషిక్తుఁడైనాఁడు. వృద్ధులగు గాంధారీ ధృతరాష్ట్రుల యోగక్షేమ విషయమై ప్రత్యేకశ్రద్ధ వహించెను భీముని యువరాజును గావించెను. అయవ్యయము లెఱుంగుటకు సంజయుని నియోగించెను. సేనల కొలందు లెఱుంగు – భృత్యుల జీతముల నిర్ణయించుట – నకులుని

వంతు. సహదేవుని, జూచి "నీవు మదీయ గోపనపరుండవై సర్వావస్థల యందును మత్సమీపమునందు నిలుచునది" అని పలికెను.

ప్రజాహిత తత్పరుండై – ఎన్నియో ప్రతిష్ఠలు గావించెను. చలి పందిరులు – సత్రంబులు – తటాకములు – దేవ గృహములు కల్పించెను.

బ్రాహ్మణ కార్యంబులకు శ్రౌత స్మార్త కృత్యసమనుష్ఠానంబునకు ధౌమ్యుని చాలించెను.

యుయుత్సుని, విదుర సంజయుల నాలోకించి – "మీరలను దినము అవధానము గలిగి రాచవారి యోగక్షేమంబులు నేనెట్లో అట్లే నిర్వహింపవలయున"ని పలికినాండు.

పురజనముల – భూజనముల– కార్యములు రాచవారి కెఱింగించి పంపినట్ల నడుపంగలవారలు" అని అప్పగించెను.

ధర్మజుండు భవ్యమార్గమున ప్రజలను పాలించినాండు. అన్ని విధముల – వారు సంప్రీతులగునట్లు గావించెను.

భర్తృవిహీనలగు భార్యలను ప్రీతలగునట్లు కల్పించెను. కరుణతో సంరక్షించెను. కృపుడు - యుయుత్సుండు - సంజయుండు మొదలగువారిని గౌరవామాత్యులకును మన్ననలను గావించెను.

దైవ పూజనము – పితృ పూజనము – అతిథి తర్పణము - దీన అనాథ పోషణము – గావించి సమస్త పౌరజనపద కోటుల మనముల అహ్లాదమొందునట్లుగా పరిపాలించెను.

ఇది - యానాటి రాజుల పరిపాలనా ప్రణాళిక యొక్క స్థూల స్వరూపము.



రాజు-వారసత్వము :—

రాజానో బహు వల్లభాః అని రాజులు బహుపత్నీకులైయుండిరి. కుటుంబ నియంత్రణ లేని కాలమది. ఒక్కొక్క భార్యయందు పదికి మించియు కుమారులను పొందువారు. ధృతరాష్ట్రునికి కుమారులు నూర్వురు! బహు భార్యలు,-బహు పుత్రులునైన-ఏ భార్య పుత్రులకు ఎంత భాగము చెందవలెను? అను సమస్య ఉదయించును.

ఎంతమంది పుత్రులున్న-అందరికిని సమానమగు భాగములు రావలసియున్నది. అనులోమ, విలోమ వివాహములు చేసికొనుచుండువారు. అందరికి పుత్రులున్న అందరు పుత్రులకు తండ్రి ఆస్తిలో భాగములు లేవా! ఇట్టి సమస్యలు ఎదురగుచుండినవి.

ఒక తండ్రికి రాజ్యమున్న దనుకొందము. అతనికి పదిమంది రాణులుందురు. అందరు రాణులకు పంచాధికముగ, దశాధికముగ పుత్రులు జనించినరను కొందము. తండ్రి రాజ్యమని సమభాగములుగా పంచుచు పోయిన ఆ రాజ్యము నలుపది ఖండములగునే! ఆ నలుపది మందికీ పంచాధిక పుత్రులు, బహు భార్యలందు కలిగిన-ఆ నలువది

ఖండములు మఱికొంత తునాతునకలుగా మాఱి రాజ్యమును పేరైన లేక పోవునే. నామ రూపములు లేని చిన్న చిన్న ముక్కలుగా మాఱిపోవు అవకాశమున్నదే!

ఇట్టి పరిస్థితులనూహించి, దేశకాల పరిస్థితులను గమనించి మను, యాజ్ఞవల్క్య, బృహస్పతి, శుక్రాచార్యుల వంటివారు, కౌటిల్యుని వంటి అర్థ శాస్త్ర వేత్తలు – రాజ్య భవిష్యత్తును ఛిన్నా భిన్నము కాకుండునట్లూహించి కొన్ని కట్టుబాట్లు గావించిరి.

అవి శాస్త్ర రూపమున బహిర్గతములైనవి. భారతదేశమున ఆస్తుల చట్టములుగా శాశ్వతముగా నిలిచిపోయినవి.

ఆ నాఁటి కుటుంబములు అవిభక్తములు దేశము అవిభక్తముగా నుండుటకై – మను, యాజ్ఞవల్క్యాదులు దాయ భాగమును గుఱించి శాస్త్రముల నేర్పఱచిరి.

రాజునకు ప్రథమ పుత్రుఁడే రాజుననుంతరము రాజ్యము నేలవలసిన వాఁడు అతడే తక్కిన సోదరుల యోగక్షేమముల నరయుచుండును. అతఁడే కారణము చేతనైన అయోగ్యుఁడైనచో రాజ్యార్హత కోల్పోవును. వాఁడనర్హుఁడే యగును గాక!

వానికి కలిగిన ప్రథమ సంతానము కూడ రాజ్యవంచితుడు కావలసినదేనా! ఆ ప్రథముఁడు సర్వవిధముల రాజ్యమున కర్హత గలిగి యుండియు రాజ్యమును కోల్పోవలసినదేనా!

అట్టి పరిస్థితులందు – పూర్వము రాజ్యమునసుభవించిన వారికి. అనంతరము అయోగ్యుఁడగు మొదటి పుత్రుని సంతానమునకు కక్షలు అసూయలు పెరిగు చుండెడివి. దాయాదులు ద్వేషము పెంచుకొని ఆ ద్వేషాగ్నిలో భస్మీభూతులయ్యెడువారు.

'Might is right' – అను నదచ్చుట వర్తించెడిది యుద్ధములు సంభవించెడివి. జయించిన వారు రాజ్యము నాక్రమించువారు.

అట్లు – రాజ్య భాగమునకై కక్షలు పెంచుకొని దాయాదులు గావించిన మహాయుద్ధమే భారత గాథ!

ఆస్తి హక్కులను గురించి – యాజ్ఞవల్క్య స్మృతి మితాక్షర సంహితలో

క్లీబోఽథ పతి తస్తజ్జః
పంగు రున్మత్తకో జడః
అంధోఽ చికిత్స్య రోగాద్యాః
భర్తవ్యాః స్యుః నిరంశకాః అని గలదు.

యాజ్ఞవల్క్య దాయ భాగ. 140 శ్లో

క్లీబుఁడు, పతితుఁడు, పతిత పుత్రుడు, కుంటి, ఉన్మత్తుఁడు జడుఁడు, అంధుఁడు, చికిత్సలేని రోగము గలవాఁడు – భాగమునకు అర్హులు కారు. కాని కేవలము భరింపఁదగినవారు.

మనుస్మృతి యందును-

అనంశౌ క్లీబ పతితౌ
జాత్యంధ బధిరౌ తథా
ఉన్మత్త జడమూకాశ్చ
యేచ కేచిన్నిరింద్రియాః అని గలదు.

క్లీబ పతితులు, జాత్యంధ బధిరులు, ఉన్మత్త, జడ, మూకులు, నిరింద్రియులు. అంశ భాక్కులు కారు.

"క్లీబాదీనాం అనంశిత్వే తత్పుత్రాణామపి అనంశిత్వే ప్రాప్తే ప్రాహ-"

ఔరసాః క్షేత్రజాస్తేషాం
నిర్దోషాః భాగ హారిణః

యాజ్ఞవల్క్య; దాయ 147

ఆ క్లీబాదులకు అంశము లేదు, కాని వారి పుత్రులు - ఔరసులు క్షేత్రజులు అయినచో భాగమునకర్హులు.

ఇఁక కౌటిల్యుని అర్థ శాస్త్రమునీ విషయమునకై పరిశీలింతము గాక!

61 ప్రకరణము - 5 అధ్యా. దాయ విభాగము

పితృద్రవ్యాద విభక్తోప గతానాం
పుత్రాః పౌత్రాః వా ఆచతుర్థాదిత్యంశః

భాజః తావద విచ్ఛిన్న పిండో భవతి, విచ్ఛిన్న పిండాః
సర్వే సమమ్ భజేరన్.

పితృద్రవ్యమును అవిభక్తముగా పొందిన పుత్రులుగాని పౌత్రులు గాని నాలుగు తరముల వఱకు సమాన భాగముల కర్హులు. కాని వంశ పరంపర అవిచ్ఛిన్నముగా నుండవలెను. విచ్ఛిన్నమైనచో సర్వులు సోదరులు సమముగా విభజించి గ్రహింప వలెను.

అపితృ ద్రవ్యా విభక్త పితృ ద్రవ్యా వా సహ జీవంతః
పునః విభజేరన్, యతశ్చోత్తిష్ఠేత సద్వంశం లభేత.

కౌ. అర్థశాస్త్ర 6 ప్రకరణ అధ్యా. 3 శ్లో

ఏ సోదరులకు పిత్రార్జితము సంక్రమింపలేదో, ఎవరు పితృ ద్రవ్యమును విభజించుకొన్నను తిరిగి కలిసి జీవించుచుందురో వారు తిరిగి విభజించుకొని గ్రహింప వచ్చును.

అందులో ఏ సోదరుఁడైననుఆ సంపత్తిని మిక్కిలి అభివృద్ధి పఱచియుండినచో అతఁడు విభజించు కొను కాలమున రెండు భాగములను గ్రహింప వలెను.

పతితః పతితాజ్జాతః క్లీబాశ్చా నంశః జడోన్మత్తాంధ
కుష్ఠనశ్చ సతి భార్యార్థే తేషామ పత్యమ్ అతద్విధం
భాగం హరేత్ గ్రాసాచ్ఛా ధనమితరే పతిత వర్జాః.

కౌ. అర్థశాస్త్ర. 6 ప్రకారణ అధ్యా. 2 శ్లో

పతితుఁడు, పతితుని వలన జన్మించినవాఁడు, నపుంసకుఁడు జడుఁడు, ఉన్మత్తుఁడు, అంధుఁడు, కుష్ఠురోగి—వీరు దాయ భాగమున కధికారులు కారు.

వారి సంతతి – మంచి వారైనచో—తమ తల్లి ఆస్తులకు ఉత్తరాధి కారులు కావచ్చును.

పతితులు తప్ప – తక్కిన వారందఱికి ఆ సంపనుండి భోజన మియ్యవలెను,

తేషాంచ కృత దారాణాం లుప్తే ప్రజననే సతి
సృజేయుర్బాంధవాః పుత్రాంస్తేషామంశాన్
ప్రకల్పయేత్.

కౌటిల్య అర్ధశాస్త్ర 6 ప్రకరణ అధ్యా.5 3 శ్లో

పై చెప్పిన పతితులు మొదలగువారు భార్యలున్నను అశక్తులయి నందున వారు సంతానము పొందకున్న వారి బంధు బాంధవులు వారి భార్యలవలన సంతానమును పొందుదురు గాక!

ఆ సంతానమును తమ పరంపరాగత సంపత్తికి ఉత్తరాధి కారులనగా తలంపవలెను.

భారతమునందు మొదటినుండియు ఈ వారసత్వమెట్లు సంక్రమించుచు పోయినదో ఇంచుక పరిశీలించెదము గాక!



యయాతి చరిత్ర:— చేత రాజులు తమ కిష్టమైనచో ప్రథమ పుత్రుని కాక కనిష్ఠ పుత్రుని గుండా రాజ్యాభిషిక్తుని చేసిరని తెలియుచున్నది.

యయాతి శుక్రుని శాపమునకు గురియైనాఁడు. ముదిమిని పొందినాఁడు. యయాతి భార్య దేవయాని శుక్రుని కూతురు. ఆమెను వంచించి శర్మిష్ఠను పొందుటచే క్రుద్ధుఁడైన శుక్రుఁడు శాపమొసంగినాడు.

యయాతి శుక్రుని "విషయోప భోగతృప్తుఁడను కాలేదు. జరా భారమును ధరింపనోపను" అని ప్రార్థించినాడు. అందులకు శుక్రుఁడు కరుణించి" నీముదిమిని నీకొడుకులయందొకరి కిచ్చి—వాని జవ్వనమును గ్రహింప వచ్చును. విషయోపభోగ తృప్తుఁడవైన అనంతరము నీ ముదిమిని నీవ గ్రహించి వాని జవ్వనమును వానిక ఇచ్చునది" అని సవరించినాఁడు.

యయాతి ప్రథమ పుత్రుఁడు యదువు, యదు, తుర్వసు, ద్రుహ్యు, అనులను నలుగురు వరుసగా జనించినవారు, వారిని తన ముదిమిని గ్రహింపుఁడని యడిగెను. వారందుల కంగీకరింపరైరి. యయాతి కోపించి—ప్రథముఁడైనను యదువును రాజ్యమున కయోగ్యుఁడని శపించెను.

పూరుఁడు — శర్మిష్ఠ తనయుఁడు. కనిష్ఠుఁడు. ఇతఁడు తండ్రి కోరిక నెరవేర్చి తన యౌవనమున తని కొసంగినాఁడు. యయాతి సహస్ర

వర్షములా యౌవనమునందుండి యభిమత సౌఖ్యముల ననుభవించెను. సంతృప్తినొంది తన జరాభారమును తాన గ్రహించి, పూరుని యౌవనమును వానిక ఇచ్చినాఁడు.

నిజాజ్ఞా విధేయులగు చతురంత మహీతలము నందలి బ్రహ్మక్షత్రాది వర్ణముఖ్యుల నెల్ల రావించినాఁడు. మంత్రి పురోహిత సామంత జనుల సమక్షమున—సకల సామ్రాజ్యమునకు పూరునభిషిక్తుఁ గావించినాఁడు.

అతనికి వారసత్వపు చట్టము అడ్డపడలేదు. ప్రజలు మాత్ర మతనికి తమ అభిప్రాయములనిట్లు తెలుపుకొనిరి— "అవిచారంబని పల్కనోడెదము" "నీ యగ్రసంభవుడు అత్యున్నత శక్తియుక్తుడు, మహీభార ప్రగల్భుఁడు. భార్గవ దౌహిత్రుఁడు, పాత్రుఁడు, లోక ఖ్యాతుఁడు. ఇతఁడుండగా పూరుని భువనేశుని గావించుచుంటివేల" అని ప్రశ్నించినారు. అప్పుఁడు యయాతి వారితో "యదువు అగ్రతనూజుఁడే అయినను నా వాక్యములను సరకు గొనలేదు.

> "తనయుండు తల్లి దండ్రుల
> పనిచిన పని చేయఁడేని పలుకెడలోఁజే
> కొనఁడేని వాఁడు తనయుం
> డనఁబడునే పితృ ధనంబున కర్హుండగునే"—

భార ఆది. 3 ఆ. 119 ప

పూరుడుఁ పిన్నవాఁడయ్యును గుణ గరిష్ఠుఁడు. అతఁడు కోరిన కార్యమును తీర్చినాడు. నాజరాభారమును దాల్చిన పుత్రుఁడ రాజ్యమున కర్హుఁడు. అతఁడే వంశకర్త. శుక్రుని పలుకులు ఇట్టిద" అని ప్రజల నొడంబఱచినాఁడు. పూరునీ నిఖిల భూభార ధురంధరుని గావించెను.

ఇచ్చట - సమస్త రాజ లక్షణములు కలవాఁడైనను యదువు. తండ్రి ముదిమిని గ్రహింపనందున రాజ్యము కోల్పోయెను. "యదు" ప్రభృతులు ప్రత్యంత భూములకు మాత్రము రాజులు గావింపఁబడిరి.



శంతనుని చరిత్ర :— శంతనునకు గంగయందు జనించిన పుత్రుఁడు దేవవ్రతుఁడు. అతఁడు ప్రథమ పుత్రుఁడు కాకున్నను బ్రతికినవారిలో ప్రథముఁడు.

శంతనుఁడొకసారి దాశరజ పుత్రిక - సత్యవతిని గాంచినాఁడు. ప్రేమించినాడు. ఆమెను తనకిమ్మని దాశరాజును కోరినాఁడు. అందులకు దాశరాజు- "నీ వంటి వరున కిచ్చుట నాకు సంతోషమే! అయినను నీకు నా పుత్రిక యందు కలిగిన సుతుఁడే నీ యనంతరము రాజు కావలెను. అట్లయిననే నా కుమార్తె నిత్తును"- అనినాఁడు.

గాంగేయుఁడప్పటికి యువరాజు, ఆతనిని తలంచి - శంతనుఁడు అంగీకారమును తెలుపఁడాయెను. అది యువరాజగు పుత్రునకు రాజాధ్యికారము లేకుండ చేయఁజాలనను బాధ కావచ్చును. రాజ నీతి సూత్రములు అడ్డు తగిలి యుండవచ్చును. ప్రథమ పుత్రుఁడు రాజు కావలె ననునది — ఆ నాటికి మిక్కిలిగా అనుసరింపబడు చుండవచ్చును.

దేవవ్రతునికీవిషయము తెలిసినది. సత్యవతి తండ్రి కడకేఁగి నాడు. సత్యవతిని తన తండ్రికై యాచించినాఁడు. తనకు రాజ్యము వలదని అంగీకరించినాఁడు. అప్పుడు దాశరాజు- నీవు వలదని విముఖుఁడవు కావచ్చును. కాని, నీకు పుట్టఁబోవు పుత్రుఁడు తన వారసత్వపు అధికారమును మానునా!" అని అడిగినాఁడు.

అందులకై దేవవ్రతుఁడు వివాహమే వలదని "ఆమరణ బ్రహ్మచారిగా నుందునని" భీష్మమగు ప్రతిజ్ఞచేసి భీష్ముఁడాయెను.

ఇచ్చట మనమొక విషయమును గుర్తింపవలసి యున్నది.

యయాతిదొక సమయము, ఆ సమయమున తన జరాభారమును పరిగ్రహింప లేదని – సంపూర్ణ రాజలక్షణోపేతుని, ప్రథమ పుత్రుని – కాదని కనిష్ఠుని పూరుని రాజ్యాభిషిక్తుని గావించినాడు. తండ్రి మాట కాదన్నవానికి రాజ్యాధికారము నీఁజాలన"ని తన నిర్ణయమును కార్య రూపమున చూపించినాఁడు.

ఇచ్చట – శంతనుడు – యువరాజగు దేవవ్రతుని కాదనలేక పోయెను. తానై యాచింపలేక పోయెను. ధైర్యము వహించి . సత్యవతికి జనింపఁబోవు వానినే రాజును చేయుగలనని తెలుప లేక పోయెను. నిరుత్తరుఁడై పట్టణమున ప్రవేశించి – శయనాగారము చేరి విలపించు చుండెను.

వెనుతిరుగు నప్పుఁడు దాశరాజుతో "ఈ కోరిక దప్ప మఱొక్కటి వేడుమ"ని నాఁడు.

దేవవ్రతుఁడు – తండ్రిని వ్యథకు కారణము నడిగినప్పుఁడు – "ఏక పుత్త్రుడు అనపత్యుఁడును ఒక్కరూపే! అందును నీవు అస్త్ర శస్త్ర విద్యా కోవిదుఁడవు, రణమున ప్రచండముగ సంచరించువాఁడవు. ఆపై విద్రావణ సాహసికుఁడవు. కావున నీ జీవితమును నమ్మఁజాలన"ని డొంకతిరుగు మాటలతో తాను పునర్వివాహ మాడఁదలచిన కారణమును తెలిపినాడు.

దేవవ్రతుడు – తండ్రి యభిలాషను గుర్తించి అనేక రాజన్య పరి వృతుఁడై దాశరాజు కడకేగి తండ్రి కొఱకు సత్యవతిని ప్రార్థించి, ప్రసిద్ధులగు పృథివీ పతులందఱును వినుచుండ నిజ రాజ్యత్యాగమును,

బ్రహ్మ చర్యవ్రత పరిగ్రహమున పరిగ్రహించినాడు. సమస్తులాతనిని "భీష్ముఁడ"ని పొగడిరి.

ఒక తండ్రి తన యౌవనసమునకై ఒక కుమారునికి రాజ్యాధికారమునుండి వంచించినాడు. మఱొక తండ్రి తన వివాహమునకై వ్యంగ్యమార్గమున కుమారుని అధికారము నుండి వంచించినాఁడు. ఒకనిది ప్రత్యక్ష మార్గము. మఱొకనిది పరోక్షమార్గము. ఈ రాజులనే శాస్త్రములు అడ్డుపెట్టఁగలిగినవి! ఏ న్యాయము పాలింపఁగలిగినది?

సత్యవతికి–శంతనునకు–చిత్రాంగద, విచిత్రవీర్యులు జన్మించిరి. చిత్రాంగదుఁడొక గంధర్వునిచే నిహతుఁడైనాఁడు. భీష్ముఁడు విచిత్రవీర్యుని రాజు గావించెను. అంబికను, అంబాలికను తెచ్చి విచిత్రవీర్యుని వివాహము గావించెను. విచిత్రవీర్యుఁడు కామలోలుఁడై అకాలమరణమును పొందినాడు ఇప్పుఁడా వంశమునకు వారసుఁడు లేఁడు. రాజ్యమునకు రాజు లేఁడు. అరాజకమైనది. సత్యవతి పతివిహీన, పుత్త్రవిహీన, మిగిలిన ఒక్క రాజకుమారుఁడు భీష్ముఁడు వ్రతదీక్షాపరాయణుఁడు. అప్పుఁడు సత్యవతి భీష్ముని–వివాహితుఁడవు కమ్మని అర్థించినది. రాజ్యమును నిలుపుకొనుటకైన సంతానమును, బడయుమన్నది. బ్రహ్మ మొదలుగ వరుసగావచ్చిన వంశమును విచ్ఛిత్తి కాకుండ రక్షింపుమనినది.

కాని, భీష్ముఁడు తన ప్రతిజ్ఞ నుండి మరలుటకు సిద్ధపడలేదు.

ఇదొక విషమ సమయము.

ఒక ఉన్నత్త రాజవంశము — రాజ సంతతిలేక, భావి రాజ్యాధికారి లేక — నశించిపోవు సమయమాసన్నమైనది. పరంపరా గతమగు వంశమునకు అధికార మంతమగు సమయమాసన్నమైనది.

ఒక వేళ రాజ–ప్రతినిధిగా భీష్ముఁడు కొంతకాలము పాలింపవచ్చును. కాని — ఆ రాజ్యమునకు నిజమైన వారసుఁడెవరు? అట్టి

పరిస్థితి యందు – భీష్ముఁడు శంతనుని సంతతి శాశ్వతమగునట్టి క్షాత్ర ధర్మము నుపదేశించినాఁడు.

అర్థానిని – ధర్మార్థ కోవిదులు, లోక యాత్రా నిపుణులును అంగీకరింతురని నాఁడు.

పురోహిత ప్రముఖులు, బ్రాహ్మణ వరులును ఆమోదముద్ర వేయఁగలరని యాశ్వాసించి నాఁడు అదే దేవర న్యాయము. దీనిని కథా పూర్వముగ స్థాపించినాడు.

నియతాత్ముఁడు, జగత్పావనుఁడు, ధర్మ సరూపుఁడు అగు బ్రాహ్మణుని పొందవలెను. అతఁడు విచిత్ర వీర్యక్షేత్రమున సంతతి గావించును" అని భీష్ముఁడు పలికినాఁడు

అఖిల ధర్మమూర్తి, నిత్య తపోధన దగ్ధ పాపేంధనుడు, నిత్య సత్య వచనుఁడు వ్యాసుఁడే ఇందులకు తగినవాఁడని సత్యవతి తెలిపి కురువంశోద్ధరణార్థము పారాశర్యుని తలఁచినది.

ధర్మమూర్తి, నియతాత్ముఁడును – అగు పారాశర్యుఁడును - ఈ కార్యమును ధర్మవిరుద్ధమని తలంపక అంగీకరించినాడు, కనుక – భారతమునాఁటికి ఇది ధర్మముగా పరిగ్రహింపఁబడుచుండినది.

ధర్మస్థితిని తలంచి వ్యాసుఁడు పుత్రోత్పత్తి కంగీకరించినాడు. ధృతరాష్ట్ర, విదుర, పాండురాజులు జన్మించిరి. అంబకు జనించిన వాఁడు ధృతరాష్ట్రుఁడు. ఇతడు ప్రథముఁడు. జాత్యంధుఁడు. అంబాలికకు జన్మించిన వాఁడు పాండురాజు, విదురుఁడు దాసీ పుత్రుఁడు.

ధృతరాష్ట్రుఁడు జ్యేష్ఠుఁడు. కనుక రాజ్యమునకు వారసుఁడితఁడే! కాని పుట్టుగ్రుడ్డి, శాస్త్రమితనిని రాజ్యార్హుఁడు కాఁడని తెలుపుచున్నది.

"ధృతరాష్ట్రస్తచక్షుష్ట్వాత్ రాజ్యం నప్రత్య పద్యత
పారసవత్వాద్విదురో రాజా పాండుర్బభూవహ"

భార. ఆప.

"ధృతరాష్ట్రుఁడంధుడు, కనుక రాజ్యమును పొందఁజాలక పోయెను. విదురుఁడు దాసీ పుత్త్రుడు. కనుక అతనికిని రాజ్యాధికారము లేదు. కడకు పాండుభూపతి మహారాజైనాఁడు. కాని ఇది వ్యాస భారతము.

ధతరాష్ట్రుఁడు రాజుకాలేదని, పాండురాజే రాజైనాఁడని వ్యాస భారతము నుండి మఱికొన్ని యుదాహరణములను చూపవచ్చును. ఉద్యోగ పర్వమున భీష్ముఁడు పలికిన పలుకులు—"

అంధః కరుణహీనతత్వాత్ నవైరాజా పితా తవ
రాజా తు పాండు రభవన్మహాత్మా లోక విశ్రుతః

వ్యాసభార, ఉద్యోగ కర్ణోపని వాద సర్వ 36 శ్లో॥

దుర్యోధనా! మీ తండ్రి పుట్టు గ్రుడ్డి, కనుక ఏ కార్యమును చేయఁజాలడు. కనుక రాజ్యాధికారము లేదు. అందుచే లోక విశ్రుతుఁడగు పాండురాజే సింహాసనము నెక్కినాడు.

"తాను సింహాసనమునధిష్ఠించియు పాండురాజు ధృతరాష్ట్రుని ఎంతయో గౌరవించెను. అతని యాజ్ఞలను వినయముతో పరిపాలించెను. ధృతరాష్ట్రుఁడు తమ్ముని పరాక్రమార్జిత ధనముతో అనేక యజ్ఞ యాగముల నొనరించెను. సర్వ సౌఖ్యములను అనుభవించెను."

ఇది సంస్కృత భారతము.

కాని కవిత్రయు భారతమున ఇందులకు భిన్నముగానున్నది

ధృతరాష్ట్రుడు పుట్టుగ్రుడ్డి, అంగవైకల్యము గలవారికి రాజ్యార్హత లేదు. కనుక రాజనీతి శాస్త్రము ననుసరించి, వ్యాస భారతము

ప్రకారము ధృతరాష్ట్రుఁడు రాజు కాలేదని పాండురాజే రాజయ్యెనని తెలియుచున్నది.

ఆంధ్ర భారతమున భీష్ముఁడు — ధృతరాష్ట్రుని రాజును గావించి నాఁడు- పుట్టు గ్రుడ్డి — అనుక్షణము ఇతరుల సహాయ్యము లేనిది, విశ్వాస పాత్రులైనవారు రాజ్యాభివృద్ధికై పాటుపడనిచో సింహాసనముపై నిలువఁజాలఁడు.

పాండురాజు — భ్రాతృ వినయుఁడు. ధృతరాష్ట్రునకు అభిమత కార్యకరణ దక్షుఁడు, బాంధవుల కనుకూలుఁడు. అనాథుల కభయంకరుఁడు.

ఈ పాండురాజు — ధృతరాష్ట్రుఁడు సింహాసనముపై నుండ దిగ్విజయ యాత్రలు గావించెను. ప్రాగ్, దక్షిణ, ఉత్తర, అప' దిగ్వ్యాపతులను వశము గావించుకొనెను. అతని కీర్తి ప్రతిష్ఠలు వెలి పోవుచుండినవి. నానా రాజులు ఇతని సేనా ప్రపీడితులై యుపాం నముల గొనివచ్చిరి సౌహార్దమును వాంఛించిరి. మహేంద్రసముఁడగు ప్రభుని నిఖిల మహీపాలురు కానగా వచ్చిరి. పాండుభూవరునకు కింకరులైరి. హయ ద్వీపములను, అజావి గోమహిష వర్గమును, మణి రౌప్య కాంచనావళులను, బహు భూషణములను కప్పములుగా నొసంగిరి. ఆ పాండు నరపాలుఁడు దిగ్విజయమొనర్చి తెచ్చి యిచ్చిన మహా ధనరాసులతో ధృతరాష్ట్రుడు శతాశ్వమేధముల గావించెను. భూసురులకు దక్షిణ లొసంగెను.

వ్యాస భారతమున ధృతరాష్ట్రుఁడు రాజ్యమున కనర్హుఁడు. రాజ్యమునధిష్ఠింప లేఁడు. కనుక వారసత్వమును కోల్పోయినాఁడు. అతని భ్రాత పాండురాజు రాజ్యాధికారమును పొందఁగలిగినాఁడు. కనుక, — పాండురాజు అనంతరము అతని జ్యేష్ఠ పుత్రునకే రాజనీతి శాస్త్రము ప్రకారము రాజ్యము రావలసియున్నది.

కాని – ఆంధ్ర భారతమున – భీష్ముఁడు ధృతరాష్ట్రునే రాజు గావించినాడు. భాతృ వినయుఁడగు పాండుభూపతి సర్వవిధముల రాజ్యాభివృద్ధికై పాటు పడినాఁడు.

అట్లు – పరిశీలించినప్పుడు – సింహాసనముపై కూర్చొని కర్తవ్య శూన్యుఁడై రాజను నామధేయము ధరించిన పరాధీన జీవియొకఁడు. రాజు కాకున్నను – రాజ్యమునందు సర్వాభివృద్ధికై పాటుపడు రాజకార్య నిర్వాహకుఁడొకఁడు,

కనుక – ఇద్దఱి సంతానమునకు సరిసగము రావలసియున్నది. న్యాయమైన విభజన.

పాండుభూపతి ఎన్ని సద్గుణములు కలవాఁడైనను మృగయా వ్యసని ఆ వ్యసనమున ధర్మము నతిక్రమించి – మనసిజ రాగమున పెనఁగుచున్న లేడిని త్రెళ్ల వేసినాఁడు. శాపగ్రస్తుఁడైనాడు. రాజ్య భోగముల త్యజించి పాండురాజు శతశృంగమున తపోవృత్తి నుండినాఁడు. కుంతీ మాద్రులతని నను గమించిరి.

పాండురాజు – సంతానమునకై తపించినాడు. దాయాదులకై తపించినాడు. దాయ భాగమును పొందఁగలుగు కుమారులకై చింతించినాఁడు.

ఔరస, క్షేత్రజ, దత్తక, కృత్రిమ, గూఢోత్పన్న, అపవిద్ధులను ఆఱ్వురు పుత్రులు – ఈ ఆఱుగురిలోను క్షేత్రజుఁడుత్కృష్టుడు. అందును దేవర న్యాయమున ప్రతిష్ఠ పొందుత్తముఁడు.

అందుచే – ధర్మమార్గమున క్షేత్రజులను పొందవలెనని, పుణ్య లోకమును, బడయుదునని కుంతి నర్థించినాఁడు.

దేవతల అంశచే ఐదుగురు పుత్రులు జనించిరి, ఐదుగురును మహా పరాక్రమవంతులు. రాజలక్షణ లక్షితులు. ధృతరాష్ట్రునకు నూర్గురు పుత్రులు కలిగిరి. ప్రథముఁడు దుర్యోధనుఁడు. రాజకీయ ధురంధరుఁడు. ప్రజాపాలన సమర్థుఁడు. ఇప్పుఁడు యువరాజు కావలసిన వారెవరు?

పుట్టు గ్రుడ్డియై. రాజ్యమున కనర్హుఁడైనను ధృతరాష్ట్రుని కాదనక పాండురాజు అతనినే సింహాసనముపై గౌరవమునెఱపినాఁడు. ఇట్టి భ్రాతృ శీలి పాండురాజు.

పాండురాజు మరణించినాడు. పాండవులు ధృతరాష్ట్రునికడనే పెరిగిరి యోగ్యులుగా రూపొందిరి.

వ్యాస భారతముననుసరించి :—

"రాజ్యమునకు వారసుఁడు ధర్మరాజు, ధృతరాష్ట్రునియనంతరం రాజ్యము ధర్మజునికే ప్రజల నిశ్చయము.

భీష్ముఁడు ఉద్యోగ పర్వమున—చెప్పుట:—

"రాజా తు పాండురభవన్మహాత్మా లోకవిశ్రుతః
స రాజా తస్యతే పుత్రాః పితుర్దాయాద్యహారిణః॥

వ్యాస బా. ఉద్యోగ కర్ణోపనివాద పర్వ. 36-37 శ్లో

లోక విశ్రుతుఁడగు పాండుమహారాజే సింహాసనమున కర్హుఁడు. కనుక అతని యనంతరము ధర్మరాజు రాజ్యమునకు వారసుఁడు. ఇది నిర్వివాదమైన విషయము.

ఇట్లు మూల భారతమున అంధత్వము వలన ధృతరాష్ట్రుఁడు వారసత్వమును కోల్పోగా అతని తనయునకు సంక్రమించిన రాజ్యమును ప్రజలకు భయపడి ధృతరాష్ట్రుఁడు ధర్మజునకే ఇచ్చినట్లు గలదు.

ప్రజలకు వెఱచిన ధృతరాష్ట్రుఁడు—

పాండురాజు యొక్క ప్రజారంజకత్వమును మఱువని ప్రజ తమకెట్టి యపాయమును కలిగించునో యని భయపడి యుధిష్ఠిరునకు యౌవరాజ్యమొసంగెను.

యౌవరాజ్య ప్రాప్తి చేతను, తమ్ముల బలదర్పముచేతను శోభించు ధర్మరాజును జూచి, దుర్యోధనుఁడు మత్సరగస్తుఁడైనాఁడని నన్నయ రచన.

ధర్మరాజున కర్ధ రాజ్యమియ్యవలసి యున్నది. ధర్మజుని ఖాండవ ప్రస్థమునకు పంపినాడు. ధర్మరాజు స్వతంత్రుఁడు, అరణ్య ప్రాయమగు ఖాండవ ప్రస్థమును సస్యశ్యామలవ మొనర్చినాఁడు. సోదరుల సాయమున-దిగ్విజయమొనర్చిరి పాండవుల కీర్తి ప్రతిష్ఠలిను మడించినది. ధృతరాష్ట్రుఁడు చూచు చుండగనే యువరాజగు ధర్మరాజు ప్రభారంజకుఁడైనాఁడు. దుర్యోధనుని కిక ధర్మజుని జయించుట అసాధ్యమనిపించినది ఒక రాజునన౦తరము వాని జ్యేష్ఠపుత్రుఁడు రాజార్హుఁడు. ఇది అనాఁటి సామాన్య న్యాయము, ఏ కారణముచేతనైనను మొదటివాడు సింహాసన యోగ్యుఁడు కాక పోయినచో రెండవ వానికి ప్రాప్తించును. ఇక రాజ్యమావంశపువారిదే" అనునదొకటి.

తండ్రి హీనాంగుఁడైన దోషమునకు తానెందుకు శిక్షననుభవింప వలెనని దుర్యోధనుని వాదము. దుర్యోధనున కర్ధ రాజ్యము సంక్రమించినది.

దుర్యోధనుఁడు తండ్రితో నిట్లనుచున్నాడు—

"పాండురాజు సర్వవిధముల సమర్థుడు. నీవు హీనాంగుఁడవు, అందుచే రాజ్యాధికారమతనిది. అతని పిదప యుధిష్ఠిరుఁడు రాజగును, మఱి మా గతి యేమి? నీ సుతుడగు దుర్యోధనునకు రాజ్యము లేదు.

దేవతల అంశచే ఐదుగురు పుత్రులు జనించిరి, ఐదుగురును మహా పరాక్రమవంతులు. రాజలక్షణ లక్షితులు. ధృతరాష్ట్రునకు నూర్గురు పుత్రులు కలిగిరి. ప్రథముఁడు దుర్యోధనుఁడు. రాజకీయ ధురంధరుఁడు. ప్రజాపాలన సమర్థుఁడు. ఇప్పుఁడు యువరాజు కావలసిన వారెవరు?

పుట్టు గ్రుడ్డియై. రాజ్యమున కనర్హుఁడైనను ధృతరాష్ట్రుని కాదనక పాండురాజు అతనినే సింహాసనముపై గౌరవమునెఱపినాఁడు. ఇట్టి భ్రాతృ శీలి పాండురాజు.

పాండురాజు మరణించినాడు. పాండవులు ధృతరాష్ట్రునికడనే పెరిగిరి యోగ్యులుగా రూపొందిరి.

వ్యాస భారతమునను సరించి :–

"రాజ్యమునకు వారసుఁడు ధర్మరాజు, ధృతరాష్ట్రునియనంతరం రాజ్యము ధర్మజునికే ప్రజల నిశ్చయము.

భీష్ముఁడు ఉద్యోగ పర్వమున—చెప్పుట:–

"రాజా తు పాండురభవన్మహాత్మా లోకవిశ్రుతః
స రాజా తస్యతే పుత్రాః పితుర్దాయాద్యహారిణః॥

వ్యాస భా. ఉద్యోగ కర్ణోపనివాద పర్వ. 36-37 శ్లో

లోక విశ్రుతుఁడగు పాండుమహారాజే సింహాసనమున కర్హుఁడు. కనుక అతని యనంతరము ధర్మరాజు రాజ్యమునకు వారసుఁడు. ఇది నిర్వివాదమైన విషయము.

ఇట్లు మూల భారతమున అంధత్వము వలన ధృతరాష్ట్రుఁడు వారసత్వమును కోల్పోగా అతని తనయునకు సంక్రమించిన రాజ్యమును ప్రజలకు భయపడి ధృతరాష్ట్రుఁడు ధర్మజునకే ఇచ్చినట్లు గలదు.

ఘనలతా పాశ నిబద్ధునిఁగావించెను. గంగమడుగున త్రోచినాఁడు. ఆతఁడనంత సత్త్వుఁడు గావున తద్బంధములెల్ల తెగనిల్లి మీఁదికెగసెను.

మఱియొకనాఁడు – అతివ్యాయామ ఖేదమున సుప్తుఁడైన వాని సర్వాంగములందు కృష్ణ సర్పములనుఁబట్టి కఱపించెను. అతఁడు వజ్రమయ దేహుఁడు కావున ఆ విషదంష్ట్రలు నాటవయ్యెనవి. మఱొక్క నాఁడు భోజన సమయమున విషముపెట్టెను. అతఁడు దివ్యపురుషుఁడు గావున తద్విషము అన్నముతోఁబాటు జీర్ణమయినది. మఱియు వారి కపాయముసేయు సమకట్టి – లక్కయింట కాల్పఁబంచెను.

విదురుని సాహాయ్యమున వారికి ఆ గండము తప్పినది. ఏక చక్రపురమున విప్రవేషమున నుండి ద్రౌపదీ స్వయంవరమున కేఁగిరి. ద్రౌపదిని పరిగ్రహించిరి. (మత్స్యయంత్రమును భేదించుటచే) ధృత రాష్ట్రునకు పాండవులు మరణింపలేదని తెలిసినది. ధృతరాష్ట్రుఁడు లోకమునకు వెఱచెను. తాను ధర్మము తప్పని వాఁడని ప్రజలను మెప్పించుటకై ధర్మజాదులను పిలిపించి సగము రాజ్యము నొసంగినాఁడు.

పాండవుల సంపదలను, గుణ సంపదనుఁగాంచిన దుర్యోధనుఁడు సహింప నోపక శకుని కైతవమున మాయా ద్యూతమున ధర్మజుని పరాజితుఁజేసెను. పన్రెండేండ్లు వనవాసము, ఒకయేడజ్ఞాతవాసము సమయముగా నిశ్చయమైనది. వారాసమయమును నెరవేర్చివచ్చినను దుర్యోధనుడు "సూది మొన మోపిన యంత, మాత్రము భూమిని పాండు కుమారుల కొసఁగ" ననినాఁడు.

ఇచ్చట అన్యాయమార్గము ననుసరించిన వాఁడు దుర్యోధనుడు, కవిత్రయభారతము ప్రకారము జాత్యంధుఁడు-రాజ్యమున కనర్హుఁడునగు ధృతరాష్ట్రునే – కురువృద్ధుఁడు – ప్రజలు – పాండురాజు–రాజ్యమున

కధిగారిగా మన్నించిరే! అతని యనంతరము — ఈ లోపము లేని అతని కుమారుని — దుర్యోధనుని రాజును చేయనెందుల కంగీకరింపరు? అను ప్రశ్న యుదయించుచున్నది.

ఇట్లు తుల్యబలవిరోధము కలిగినపుడు మధ్యేమార్గమునవలంబింప వలసియున్నది

ఇరువురును దాయాదుల పుత్రులు. వీరి తండ్రులు మిక్కిలి ఒకరినొకరు అనుసరించుకొని రాజ్యపాలన గావించిరి. పుట్టు గ్రుడ్డి యగు ధృతరాష్ట్రుఁ డొక వేళ రాజ్యమునధిష్ఠించినను — అందులకు పెద్దలంగీకరించినను — పాండురాజు — వ్యతిరేకియై యతదనర్హుఁడని ప్రకటించి యుండిన — ధృతరాష్ట్రుఁడతనికి లొంగిపోవలసియుండినది. కనుక పాండురాజు రాజ్యమున కర్హుఁడై—యతని పుత్రులకేతదనంతరము సంభవించెడిది.

ఇట్టి విషమ సమస్య సంభవించినఁడు — శ్రుతిస్మృతులు — కాదనినపుడు — సదాచారము — "స్వస్య ఆత్మనః ప్రియమ్" అనఁగా అంతఃకరణము — వీనితో ఆలోచించి — ఇరువురు భాగములు గావించు కొనవలసి యుండెడిది. సమభాగములుగా విభజించి ఏలవలసి యుండి నది. వారి వారి పాలనా సామర్థ్యముల ననుసరించి ప్రజామన్ననల బడసియుండువారు.

ధర్మజుఁడు సగము రాజ్యమునకు - దుర్యోధనుఁడు సగము రాజ్యమునకు పాలకులైయుండిన - భారతకథ అంతవిస్తృతినందెడిది కాదేమో! విభిన్న రాజనీతులనింత విశదముగ మనమును - (వ్యాస మహర్షి లేఖినినుండి జాలువారిన - శ్లోకపంక్తిని) విని-చదివి యానందించు వారము కామేమో! అట్టి రాజనీతిని కూలంకషముగా నెఱింగి-ధర్మమార్గమున పోవువాఁడు గనుకనే ధర్మజుడుఁను "మా తండ్రిపాలు మా కొసఁగు" మను మాటనే పలుకుచు అర్థించుచు వచ్చినాఁడు.

---

అమాత్యులు :— రాజ్యాంగ విధానమున నృపుని తరువాత అమాత్యునిదే ముఖ్య స్థానము.

"మౌలాన్శాస్త్ర విదశ్శూరాన్ లబ్ధలక్షాన్ కులోద్భవాన్
సచివాన్ సప్త చాష్టౌవా ప్రకుర్వీత పరీక్షితాన్"మ న. 7-54

మౌలులనగా — పితృ పితామహ కుల క్రమాగతులై యుండ వలయునని యర్థము.

మంత్రులైన వారు — పితృ పితామహ కులక్రమాగతులై యుండ వలెనని మనుస్మృతి కారుఁడు. అప్పుఁడే ఆ వంశమునందలి రాజుల పేరు ప్రతిష్టలు — మహత్కార్యములు — గుణ గణములు—ఆ వంశము వారి నీతి నియమములు — ధర్మనిష్ట — పట్టుదలలు — పట్టు విడుపులు చక్కఁగా క్షుణ్ణముగా తెలిసినవాఁరై యుండును.

రాజుల పరమార్గమున నడచిన దండించు చనువు కలిగి యుండును కాని కొందఱీ వాదమునంగీకరింపరు. అట్లు కులక్రమా గతముగ వచ్చిన మంత్రులకు చనువు మితిమీఱి గౌరవము తగ్గిపోవును గనుక రాజు నాజ్ఞను పరిపాలింపఁజాలరని వారి వాదము. ఇందును కొంత సత్యము గలదు

ఆ మంత్రులు — శాస్త్రవేత్తలైయుండవలెను. శూరులై యుండ వలెను. లబ్ధలక్షులు — అనఁగా ఆయుధ వేత్తలు — గుఱి తప్పనివారునై యుండవలెను. చక్కఁగా వారి ప్రవర్తనను పరీక్షింపవలెను. అట్టి వారిని — ఏడుగురను గాని, ఎనిమిది మందినిగాని-నియమింపవలెను.

తైస్సార్థం చింతయేన్నిత్యం
సామాన్యం సంధి విగ్రహం
స్థానం సముద్రయం గుప్తం
లబ్ధప్రశమనానిచ మను. 7-56

ఆ మంత్రులతోఁ గూడి రాజు రాజ్యమునకు సంబంధించిన విషయములనుఁగుఱించి నిత్యము ఆలోచింపవలెను. సామాన్యాదుల గుఱించి ఆలోచింపవలెను. ఇచ్చట – సామాన్యమనఁగా – సంధి విగ్రహాదులు – మంత్రములందు దాచనవసరములేనివి. స్థానమనఁగా- దండ, కోశ, పుర, రాష్ట్రాత్మకము – వీని పోషణమునకు సంబంధించి నది. సముదయమనగా – ధాన్య హిరణ్యాద్యుత్పత్తి స్థానమునకు సంబంధించినది. గుప్తం – అనఁగా పరీక్షించి అన్నాదికమును భక్షించుట – పరీక్షిత స్త్రీలను భోగించుట మొదలగునవి.

యాజ్ఞవల్క్య స్మృతియందు– (మితాక్షర రాజధర్మ-) మంత్రులనుఁగుఱించి ఇట్లు తెలుపఁబడినది—

సమంత్రిణః ప్రకుర్వీత
ప్రాజ్ఞాన్ మౌలాన్ స్థిరాన్ శుచీన్
తైః సార్థం చింతయేద్రాజ్యం
విప్రేణాథ తతః పరం. అని

యాజ్ఞ మితాక్షరి 13 అ. 31 శ్లో॥

ప్రాజ్ఞులనగా – హితాహిత వివేక కుశలురు. రాజునకు, రాజ్యమునకు హితమేదో అహితమేదో చక్కఁగా తెలిసికొనె సమర్థులు. అట్టి మంత్రుల మంత్రాలోచనలతో నిర్వహింపఁబడిన రాజ్యము తప్పక అభివృద్ధి పొందఁగలదు.

మౌలురనగా – స్వవంశ పరంపరగా వచ్చిన వారు. ఇది మనుస్మృతి యందును గలదు.

స్థిరులు– అనఁగా హర్ష విషాద స్థానములధికముగానున్నప్పటికిని వికార రహితులు.

కౌటిల్యుఁడు తన అర్థశాస్త్రమున అమాత్యులు వేఱని మంత్రులు వేఱనిపరిగణించెను ఇతని దృష్టియందు ఎక్కువబాధ్యతలు గలవారు మంత్రులు సామాన్య బాధ్యతలు గలవారు అమాత్యులు. మంత్రులు ముగ్గురు నలుగురే యుండఁదగును. అమాత్యులు పెక్కండ్రు కావచ్చును అని ఇతని మతము.

ఆశ్రమ వాసపర్వమున – భారతమున – ధృతరాష్ట్రుఁడు ధర్మజునితో – సచివులు–భావశుద్ధిధామములు – పితృ పితామహక్రమ సమాగతులు – విశదమతులును గావలయునని చెప్పినాడు.

ఎల్లి కార్యములను మంత్రి జనములతో విచారించి చేయుమనె నాఁడు, ఇట్లు రాజ్యాంగమున మంత్రులొక భాగము.

మంత్రి యెట్టి వాఁడుగా నుండవలెనని యడిగిన ధర్మజునితో భీష్ముఁడు—

జ్ఞాన పరుఁడు, పౌర జానపదల కాప్తుఁడు, కార్యజ్ఞుఁడు, ధైర్య శౌర్యఘనుఁడు, అక్రూరుఁడు, విశుద్ధాత్ముఁడు, పతియెడ భక్తను రాగములుగలఁవాడు, సమ దుఃఖసఖుఁడునై యుండవలయుననినాఁడు చెమట నెత్తురుగాఁగ. దలఁచువాఁడు. ఆరయక తప్పుమీఁద బెట్టినను కలఁత చెందరాదు. అలుకయై తిట్టినను బాధపడరాదు. పొందు చెడక మెలగవలెను నిజ రంధ్రములను మాటు సేయుటకు సమర్థుఁడైయుండవలె, పర రంధ్రములనుగని చిక్కు పఱచుటకు సమర్థుడైయుండవలె. విశాల బుద్ధి గలవాఁడై యుండవలెను. అట్టి వాఁడె మంత్రిత్వమున కర్హుఁడు.

ఇట్టివారిని మంత్రులు గావించుకొని వారితో కార్యముఁగొని వారి యాదేశములనుఁగొని పరిపాలించు రాజు రాజ్యము స్వర్గతుల్యమౌను. అటు విమల జ్ఞానము – జ్ఞానమునకు తోడు నిగర్వభావము – ఆ

భావముతో పౌర జానపదుల యోగక్షేమములరయుచు వారి కాప్తుఁడై యుండుట — వారి కార్యములను నెరవేర్చుటలో సమర్థుఁడై రాజునకు నచ్చు చెప్పుటకును తగినవాఁడైయుండుట — ఆపదలనెదుర్కొన వలసి వచ్చునప్పుఁడు ధైర్య సాహసములతో నొప్పుట — క్రౌర్యము లేక శాంతముతో కార్యముల నాలోచించుట — విశుద్ధ తత్త్వము — రాజునెడ భక్త్యనురాగములు — సుఖము లందు దుఃఖము లందు సఖుఁడై యుండుట — చెమట రక్తమగునట్లు రాజ్యమునకై పాటుపడుట — దోషిని చేసినను కలఁత చెందకుండుట — తిట్టిన బాధపడకుండుట — ఇట్టి సుగుణములకు నిలయుఁడు మంత్రిగా నుండవలయునట!

విదురుఁడు బ్రాహ్మణుఁడు కాఁడు. వ్యాసుని వలన దాసికి జన్మించిన వాఁడు. అయినను మంత్రులకుండవలసిన సమస్త లక్షణములు కలవాఁడు. రాజునకు సర్వాధికారమును పరిమితము గావింపవలెనన్న మంత్రి యుండవలసినదే! రాజకీయమున మంత్రి స్థానము గొప్పది.



మంత్రము — మంత్రాలోచన:

"మంత్రమూలం యతో రాజ్యమ్
అతో మంత్రం సురక్షితమ్
కుర్యాద్యథాస్య నవిదుః
కర్మణా మా ఫలోదయాత్"

యాజ్ఞవల్క్య రాజధర్మ 13-34 శ్లో

ఫలము తెలియు నంతవఱకును మంత్రమును గుప్తముగా నుంచవలెను. మంత్రమనఁగా రహస్యాలోచనము. రాజు ప్రజాభి వృద్ధి కార్యక్రమము, శత్రు నిర్మూలనము, మిత్రరక్షణము మొదలగు

విషయములపై రహస్యాలోచనము గావించును. ఈ రహస్యాలోచనము-ఫలరూపమును గాంచు వఱకును ఎవ్వరికిని తెలుపరాదు. అప్పుడే వారు రూపొందించిన కార్యము ఫలవంతమగును.

సభా పర్వమున నారదుఁడు ధర్మజుని ప్రశ్నించిన విధానము. "రాజునకు ప్రసిద్ధమగు మంత్రమే విజయమునకు మూలము. సుస్థిరమగు ఆ రహస్యమును రక్షించుచుంటివా" అని – రాజుల విజయమునకు మంత్ర రక్షణయే మూలమని తెలుపుచున్నాఁడు.

మంత్రులు ఎనిమిది లేక ఏడు సంఖ్యలో నుందురు కదా! వారిలో॥

సర్వేషాంతు విశిష్టేన బ్రాహ్మణేన విపశ్చితా
మంత్రయేత్పరమం మంత్రం రాజా షాడ్గుణ్యసంయుతః
మ. 7-58

అని మనుస్మృతి కారుఁడు–మంత్రులందఱిలోను రాజైనవాఁడు ఒక్కనినే సంపూర్ణముగ విశ్వసింపవలెనని తెలుపుచున్నాఁడు. అట్టి రాజు విశ్వాసమునకు పాత్రుఁడు కాఁదగినవాఁడు–

గొప్ప పండితుఁడు, జ్ఞాని, బ్రాహ్మణుఁడు అయియుండఁదగును. ఆనాటి బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానము గలవారు. తపస్వులు, శాంతి ప్రియులు. అట్టి వారిని నమ్మి సర్వ విషయములను తెలిపి చర్చ జరిపిన – తప్పక రాజునకు హితమును మాత్రమే కోరి తమ అభిప్రాయములను తెలుపఁగలఁడు. నచ్చజెప్పగలఁడు. అట్లు కానిచో ఈ నాఁడున్నత పదవులయందుండి – ఆవేశకులను చేరదీసి, వారి మాటలువిని – చెడిన అధికారులెందఱు లేరు?

జడమూకాంధ బధిరాన్ తైర్యగ్యోన్యాన్ వయోతిగాన్
స్త్రీ మ్లేచ్ఛ వ్యాధితవ్యంగాన్ మంత్రకాలే ప్రసారయేత్ మను. 7

జడులను. మూగవారిని, అంధులను, బధిరులను, వారితో కలిసిన వయోవృద్ధ, స్త్రీ, మ్లేచ్ఛ, వ్యాధిగ్రస్తులను మంత్రకాలమున దూరము నందుంచవలెను

జడులు, మూగవారు, బధిరులు, అంధులు – ఏమిచేయఁగలరను ప్రశ్న రావచ్చును వీరు నిజముగా అంధ మూకాదులో, అట్లు నటించువారో, శత్రుపక్షమునుండి వచ్చిన చారులా వేషముల ధరించిరో చెప్పఁజాలము. కనుక దూరమునందుంచుట మంచిది ఇఁక వారితో కలిసిన-వయోవృద్ధ, స్త్రీ, మ్లేచ్ఛాదులేమి చేయఁగలరు? అని యడుగ వచ్చును.

వయోవృద్ధులకు మతి బలహీనముగా నుండవచ్చును. "స్త్రీల నోట మాట నిలువ రాద"ను ధర్మజుని శాపము. మ్లేచ్ఛుల మనస్సు కలుషితమై. నియమములకు కట్టుబడకపోవచ్చును. మ్లేచ్ఛులనఁగా నిచట – "స్వజాతివారు కానివార"ని గ్రహింపవలెను. జాతి వేరైనపుడు మైత్రియు తగ్గవచ్చును.

ఇన్నింటికి – ఆలవాలములగు విషయములకు దూరము–నందుండుటయే శ్రేయోదాయకమని చెప్పుచున్నాఁడు.

వ్యాధిగ్రస్తులు – శారీరకముగా దుర్బలులైయుందురు కదా! అప్పుడు మనస్సుకూడ దుర్బలమైవారు కొన్ని ప్రలోభములకు లోనై రహస్యములను బయట పెట్ట వచ్చునేమోయని సందేహము! కనుక వారిని దూరముంచవలెను.

మంత్రము–గుప్తమైనపుఁడే అఖిల కర్మములు ఫలప్రాప్తి నొందును

మంత్ర భేదనము వలన వచ్చిన కీడునకు శాంతి చేయుట అసాధ్యము. కావున మంత్రులతో మంత్రరక్షణ నియమము గట్టిగా చెప్పి యుంచవలెను! అని మనుస్మృతికారుడు తెలుపుచున్నాఁడు.

మంత్రులతో సాధారణ విషయములు చర్చించునప్పుడు—

"గిరిపృష్ఠం సమారుహ్య
ప్రాసాదం వా రహో గతః
అరణ్యే నిశ్శలాకేవా
మంత్రయేదపి భావిత" మను. 7-147

గిరి పృష్ఠమునందైనను, రహస్యముగా — నిర్జరారణ్య సౌధాదుల యందైనను మంత్రాలోచన చేయవలెను.

ఈ మంత్రాలోచనము నందు — పంచాంగములను చక్కగా చింతింపవలెను. 1) మంత్ర భేదము కాకుండ కర్మముల యారంభో పాయమును చక్కగా చింతింపవలెను. 2) ఆ కార్యములకు — కార్య సాఫల్యమునకు పురుష, ద్రవ్య సంపత్తిని గురించి చక్కగా చింతింపవలెను. 3) తమ మంత్రాలోచన సఫలమగుటకు తగిన ప్రదేశము అనువగు కాలము — వీనిని గురించి ఆలోచింపవలెను. 4) విపత్తి ప్రతీకారమును అరయువలెను 5) కార్యసిద్ధికి తగిన యుపాయమును చింతింపవలెను.

ఈ విషయములను చింతించునప్పుడు, చర్చించునప్పుడు రహస్యమును మిక్కిలి జాగ్రత్తగా కాపాడవలెను.

యస్య మంత్రం న జానంతి
సమాగమ్య పృథక్జనాః
సకృత్స్నాం పృథివీం భుంక్తే
కోశహీనోపి పార్థివః మను. 7-148

ఎవని మంత్రాలోచనను, రహస్య కార్యములను జనులు — వేర్వేరుగా తెలిసి కొనలేరో — ఆ రాజు — కోశము లేకున్నను సమస్త భూమండలమును అనుభవింపగలడు.

ఇచ్చట – "రహస్యకార్యములను జనులు వేర్వేఱుగా తెలిసి కొనకుండుట" యనఁగా రాజ్యమున విభిన్న శాఖలుండును గదా! ఏ శాఖకు సంబంధించిన రహస్య మా శాఖవఱకే పరిమితమై యుండవలయునట! ఇట్లు యోగ్యులగు మంత్రులను గూడి–మంత్రాలోచనలు నెఱపిన రాజ్యాంగము – సత్ఫలములనే యొసంగ గలదు .



పు రో హి తు డు :—

రాజునకు పురోహితుఁడొకఁడుండవలెను—
"పురోహితం ప్రకుర్వీత దైవజ్ఞముదితోదితమ్
దండనీత్యాంచ కుశలమథర్వాంగిరసే యథా॥
యాజ్ఞవల్క్య రాజధర్మ

పురోహితుఁడు దైవజ్ఞుఁడై యుండవలెను. అతఁడు గ్రహోత్పాతములు - వానిని శమింపఁజేయుటలు – చక్కఁగాతెలిసి కొనఁగలవాఁడై యుండవలెను. దండనీతియందును సంపూర్ణ పరిజ్ఞానము గలవాఁడై యుండవలెను.

అథర్వాంగిరసే – అనఁగా శాంత్యాది కర్మలందు అని యర్థము ఇతఁడు రాజునకు అరిష్టములు జరుగఁబోవుటను ముందుగా తెలిసికొనఁ గలిగి యుండవలెను. శాంతి కర్మలయందు – సంపూర్ణ పరిజ్ఞానము అతనికి అత్యవసరము.

మంత్ర-తంత్రములు రెండును తెలిసి ఎప్పుడికేది యుపయోగమో దానిని ప్రయోగింపవలెను.

రాజు – సామ్రాజ్యాధి పత్యము చాలా విశాలమైనది. ఏ మూల ఏ అశాంతి పుట్టినను – ఆ అశాంతికి మూలకారణము నెఱింగి తెలియఁ

జేయవలసిన వాఁడు దైవజ్ఞుఁడు అట్టి పురోహితుని సూర్య — చంద్ర వంశపు రాజులాదరించుచుండిరని పురాణములు తెలుపుచున్నవి.

రాజునకు రాబోవు అరిష్టములను గణింపఁగలవాఁడు పురోహితుఁడు. ఆ అరిష్టములకు — కారణ భూతములగు గ్రహగతులు గుర్తించి శాంతి చేయించవలెను.

భారతదేశము — ఆస్తికత్వమునకు పెట్టినది పేరు. భారతీయులు- జ్యోతి శాస్త్రమును నమ్ముదురు. గ్రహగతులు — వాని ఫలితములు — వీనిపై విశ్వాసము కలిగినవారు — కనుక — ఎంతవఱకు భారతీయుల రాజులు నక్షత్ర శాస్త్రమును గ్రహ శాస్త్రములను నమ్ముచుందురో — అంతవఱకు పురోహితుని అవసరముండియే తీరును. కాని ఈ పురో హితుడు ధనాశచే అసత్యములు పలికి — రాజును భయమునకు గుఱి చేసి — ప్రలోభములకు పాత్రుని చేయునట్టివాఁడు కారాదు. కనుక పురోహితుఁడు సంయమి — తపోధనుఁడునై యుండవలె! రాజులగు వారు పురోహితరహితులై యుండరాదు. అని "అంగార పర్ణుడు"— పాండవులకు తెలిపినాఁడు. పురోహితుఁడు అనవద్యుడు వేద వేదాంగ విశారదుఁడునై యుండవలెను. అతఁడు జప హోమములు చేసి పవిత్రుఁడైనవాఁడుగా నుండవలెను.

"సత్యవచనుఁడు — విప్రోత్తముఁడు — వర్గ చతుష్టయ సాధన సఖుఁడు — సదాచారుఁడు — సూరి సేవ్యుఁడు—" పురోహితుఁడుగా నుండవలసిన వాఁడని అంగార వర్ణుఁడు పేర్కొనినాఁడు.

అట్టివాఁడు — పురోహితుఁడైనచో — భూపతి — ఇహ పర సౌఖ్య ములను పొందఁగలవాఁడు. ఇహమున సర్వత్ర జయమును పొందును. మరణానంతరము స్వర్గమును పొందఁగలుఁగును.

అని అంగారపర్ణుఁడు – ద్రౌపదీ స్వయంవరమున కేఁగుచుండు పాండవులకు పురోహితుఁడు తప్పక మీకభ్యుదయముల చేకూర్పఁజాలిన వాఁడని బోధించినాఁడు.

"మహీపతి కాపు ప్రవృత్తుఁడయ్యు–మహీసుర వరపురస్సరుఁడై ఎల్ల యుద్ధములందు జయించు"నని తెలిపినాఁడు.

"ఇచ్చోటి కనతిదూరమున ఉత్కచమను తీర్థముగలదు. అందు ధౌమ్యుఁడను బ్రాహ్మణుఁడు తపము సేయుచుండును. అతఁడు సర్వ విధముల పురోహిత లక్షణములు గలవాఁడు. అతనిని ప్రార్థింపుఁడు. అతఁడు పురోహితుఁడైన మీకు సర్వార్థసిద్ధియగునని ప్రోత్సహించినాఁడు.

ఆ అవసరమున విశ్వామిత్ర – వసిష్ఠుల మహిమనుగ్గడించెను. విశ్వామిత్రుని పురోహితునిగా బడసి ఇక్ష్వాకుల కులమెట్లు వన్నెకెక్కినదో తెలిపెను

పాండవులు – అంగార పర్ణుని యాదేశమును అంగీకరించి ధౌమ్యుఁడుండు కడకు జనిరి.

ధౌమ్యుఁడు పాండవుల పౌరోహిత్యము న కంగీకరించినాఁడు. అప్పటినుండియు నతఁడు – అభ్యుదయములందు – అరిష్టములందు– సుఖసమయములందు – దుఃఖవేళలందు అండగానుండి – దుఃఖమున ఆశల రేకెత్తించి – నీతిని బోధించి వారికి సర్వవేళల – పురోభాగియై – హితకాంక్షియై సార్థక జీవియయె ! శాంతిపర్వమున – పురూరవునకు వాయుదేవుఁడు చెప్పినట్లు భీష్ముఁడు ధర్మరాజుతో చెప్పిన పలుకులు పురోహితుని ప్రాముఖ్యమును తెలుపుచున్నది

బ్రాహ్మణుఁడగు పురోహితుఁడు సర్వవిధముల శాంతి కార్యముల నాచరించు చుండవలె. అట్లు బ్రాహ్మణ శాంతి కార్యముల వెలుఁగు రాజ్యమే! అట్టి క్షత్రియాధిపత్యమే అధిపత్యము. పురోహితుని ప్రాపు

లేని రాజరికమును-"భర్త లేనిసతి దేవరుని పతిగా గ్రహించినట్లుండును" అని తెలుపుచున్నాడు.

కనుక నిజ ధర్మమును వ్యాపింపఁజేయువాఁడు విద్వాంసుఁడు-శాంతుఁడునగు పురోహితునకు సర్వ సంపదలను సమర్పించి రాజు శుశ్రూషా పరుఁడయి — దండనీతి నవలంబించి యుభయ లోకములందును పెంపు వహించును.

పురోహితుని వలనే — అమర గరుడ గంధర్వాదుల నధ్వరముల తృప్తిఁజేయును ఆ అధ్వరములచే సర్వశుభములు గలుగును. రాజు పురోహితుని మంత్రములచే సురక్షితుఁడగును. రక్షా మంత్రములచే రాజును—రాజ్యమును అరిష్టములనుండి—ఆపదలనుండి కాపాడును.

వివిధోత్పాతములకు శాంతివిధానము నొనర్చువాఁడు పురోహితుఁడు. రాజ్యమునకు సంభవించు కీడును — వెంటనే శాంతి విధానమొనర్చి శాంతింపఁజేయువాఁడు పురోహితుఁడు.

శాంతికములు — పౌష్టికములు పురోహిత సాధ్యములు.

శత్రువినాశము—మంత్రాఢ్యుఁడగు పురోహితుని విధికలాపములచే సాధ్యమగును.

కనుక పురోహితుఁడు లేని రాజ్యము భద్రతలేని పీటము.



భారతములో హితులు—విదురుఁడు.

అప్పుడు—జ్ఞానియునై భారతమున రాజ్యాధికారమున కంకుశముగా పనిచేసిన వ్యక్తి — హితైషి - విదురుఁడు. ఇతని యుపదేశమును ధృతరాష్ట్రుఁడు, కౌరవులును వినియుండిన కురుక్షేత్ర సంగ్రామమే జరిగియుండెడిది కాదు.

విదురుఁడు ధర్మపక్షపాతి. అంబిక దాసికి వ్యాసుని యను గ్రహమున జన్మించిన వాఁడు. మాండవ్యముని శాపమున విదుర రూపమున జనించిన యముఁడు. కనుక ధర్మమునకై నిలిచిన వ్యక్తి యితఁడు, మహాజ్ఞాని, ధృతరాష్ట్రుని యనుగ్రహమును చూఱగొనిన వాఁడు, ధృతరాష్ట్రుఁడు కూటనీతిని ప్రయోగించునప్పుడంతయు ఇతనికి భయపడువాఁడు. ఇతనిని దూరముగా నుంచువాఁడు. మోసముతో కూడిన మంత్రాలోచనములు యితనినుండి మఱుఁగు పఱచువాఁడు.

విదురుఁడు అధర్మమని తెలిసినప్పుడు ముఖముపైననె అదుగు వాఁడు న్యాయము కానపుడు కఠినముగా ఖండించువాఁడు,

ధృతరాష్ట్రుని పంపున పాండవులు వారణావతమున కేగు సందర్భము. అచ్చట పాండవులను లక్కయింటనుంచి కాల్పించ గలరని విదురునకు తెలిసినది

అప్పుడు వారిని కొంత దూరము వెంబడించి - ఇతరులెవ్వరు, విననట్లు - యుధిష్ఠిరున కెల్ల విషయములను ఎఱుకపరచినాఁడు.

కుంతి యప్పుడు ధర్మజుని - విదురుఁడు తెలిపిన రహస్యమేమని యడిగినది.

"విషాగ్నుల వలన —
అప్రమత్తులై యుండుఁడని బుద్ధి గఱపెనని తెలిపినాఁడు.

విదురుఁడంతటితో నూరకుండలేదు. హస్తినాపురము నుండి విశ్వాసపాత్రుఁడగు ఖనకు నొక్కని పంపెను. రహస్యముగా అతఁడు ఈ కృష్ణ చతుర్దశి యందు పురోచనుఁడు లక్కయింటిని దహనము గావించును. ఇందుండి మీరు వెలువడి పోవుటకు మా ప్రభుని యాజ్ఞచే సురంగముగావింప వచ్చితిన'ని పాండవులకు తెలిపినాఁడు.

ఒక్క బిలమును గావించి వాతల కెఱుక పఱచి చనినాఁడు.

ఆ నాఁడు పాండవులు తామే లక్క యింటిని కాల్చి - ఆ బిలము ద్వారా - సురక్షితముగా వెడలిరి.

అన్నియు ముందుగనే తెలిసిన ధృతరాష్ట్రుడు పాండవులు లక్క యింట కాలిరని భ్రమించి ఆవరచినట్లు రచినాఁడఁట! వివిధ ప్రలాపములతో దుఃఖించినాఁడఁట!

పాండవుల కుశల స్థితి నెఱింగిన విదురుఁడును - ఏమియు నెఱుంగని వానివలె - అందఱితో కలిసి దుఃఖించినాఁడఁట! ఇచ్చట రాజుకంటె దొంగ విదురుడు విదురుని కంటె దొంగ రాజు. రాజు కూటనీతిని ప్రయోగించి ఫలించినదని యానందించినాఁడు. విదురుఁడు హితైషిగా ఆ ఎత్తుకు పై ఎత్తు వేసి-ఫలించినందులకు ఆనందించినాఁడు.

పాండవులు లక్క యింటినుండి సురక్షితముగా వెడలిరి. ఏకచక్రపురమున విప్రవేషముతో కొంతకాలము గడపిరి. ద్రౌపదీ స్వయంవరమున కేఁగిరి. అచ్చట అర్జునుడు మత్స్య యంత్రమును భేదించినాఁడు. ద్రౌపదిని తల్లి యానతిని ఐదుగురును వివాహ మాడినారు.

పాండవులు ద్రుపదునిపురమున నొక్క సంవత్సరము గడిపిరి. అఖిల రాజన్య విభవ సమన్వితులై గడిపిరి.

గూఢ చారుల వలన దుర్యోధనునకి విషయము తెలిసినది. అప్పుఁడు దుర్యోధనాదులు — దైవాను కూల్యంబు లేక - మానుషంబెంతయైనను నేమిసేయును"ని వాపోయిరి.

పాండవులను భేదించునుపాయ మాలోచించిరి. భీష్ముఁడు వలదని - అటియుపాయములు పాండవులయెడపారవని సంవించినాఁడు

"భవత్పితామహుని వచనము చేకొనుము. అదియే పథ్యము"ని ద్రోణుఁడు భోధించినాఁడు.

అప్పుడు – విదురుఁడు – ధృతరాష్ట్రునితో-

"ధర్మార్థవిత్తములు-తథ్యవాదులు-వయోవృద్ధులు-మధ్యస్థవిమల మతులు-ద్రోణ గాంగేయులు, వారు నీకేమి గఱపిన దాని నాచరింపుఁడు" అని పలికినాఁడు.

"వారల కంటె హితులు నీకులేరు. దుర్యోధన – దుశ్శాసన – కర్ణ – శల్యులు – కరము బాలురు. ఇది ధర్మము. ఇది యధర్మము అని యెఱుఁగరు. వారి పలుకులను వినకుము" అని బోధించినాఁడు. "పాండుసుతులను వేగముగాఁ దాఁబనిచి ప్రీతితో అర్ధ రాజ్యమునిమ్మ"ని హితము గఱపినాఁడు.

"వారి బలపరాక్రమము లెల్లరకు తెలియునని తెలిపినాఁడు.

"పురోచన దగ్ధంబయిన దుర్యశః పంకమును – పాండువాను గ్రహమునంజేసి కడిగి కొనుమ"ని హెచ్చరించినాఁడు. "ఈ దుర్యోధనుని యపరాధమున – అఖిల ప్రజలకు అపాయమగును. అట్లుగాకుండ రక్షింపుమ"ని బోధించినాఁడు.

ధృతరాష్ట్రుండప్పుఁడు విదురునితో—

"నీవును – భీష్ముఁడు – ద్రోణుఁడు విశుద్ధ ధర్మబుద్ధులరు, మీ వచనమున కవజ్ఞత గావించు నంత కార్యగతి మూఢుఁడనా" అని - "ఆ పాండవుల కర్ధరాజ్య మిచ్చెదన"ని అప్పుఁడు పాండవులను తోడితేర విదురుని పంపినాఁడు

అప్పుఁడు ద్రుపదుఁడు—

ద్రోణుఁడును – "దేవతనూజుఁడు – భీష్మ ధృతరాష్ట్రులు – సద్భావముతో నేమి చెప్పినను అది హితమేకదా!" అని పాండవుల

పంపినాఁడు. ఇట్లు విదురుఁడు – ధర్మపక్షమున మాటలాడుచు–నిప్పటి
పాతబుద్ధితో – కౌరవులకడనుండిన హితకాంక్షి.

మఱొక సారి——

దుర్యోధనుఁడు పాండువులతో జూదమాడ నభిలషించినాఁడు.
అప్పుఁడు ధృతరాష్ట్రుఁడు–

క॥ ధీరమతి విదురుతోడ వి
చారింతము వాఁడు నయ విశారదుఁడు కళా
పారగుఁడు దీర్ఘదర్శియు
పారహితారంభుఁడు భయ పక్షంబులకున్"

అని పలికినాఁడు

భారతము సభా. 2-124 ప.

ధీరమతి యనగా సుఖ దుఃఖములందు మనోవికారములు లేనివాఁడు
"నీతి విశారదుఁడు–కళా పారంగుఁడు–దీర్ఘదర్శి–అపారహితారంభుఁడు
భయపక్షంబులకున్" అని ధృతరాష్ట్రుఁడు విదురునకిచ్చిన బిరుదములు
అట్టివారి యభిప్రాయములను ఆదేశములను గ్రహించి రాజ్యమేలిన
రాజ్యమునకెట్టి కీడును కలుగదు! కాని దుర్యోధనుఁడు "పాండవ
పక్షపాతి." అని విదురుని ఊహించినాఁడు.

విదురుఁడు నిజముగనే జూదమున కంగీకరింపలేదు. "ఇట్టి
కార్యమునకు నేనవశ్యమంగీకరింపన"ని పలికినాఁడు ధృతరాష్ట్రునితో
నీ పుత్రుల నిట్టి కార్యములనుండి వారింపుమని పలికినాఁడు.

"శకుని దుర్యోధనుల దుర్వ్యవసాయములనుడిగించి యిక్ష్వాకుర
వంశమును రక్షింపుమని విదురుఁడు హెచ్చరించినాఁడు.

ధృతరాష్ట్రుఁడు – నేనును, నీవును, భీష్ముఁడునుండగా
న్యాయము జరుగదు. తెమ్మనినాఁడు, విదురుఁడు మొదట
ధించును. ధర్మమార్గమును వివరించును. అధర్మము
తెలిపినపుఁడు ప్రభువునాజ్ఞను శిరసావహించును. కనుకనే-
ప్పటకు విదురుఁడు పాండవుల కడకేగినాఁడు

రాష్ట్రుఁడు దుర్యోధనునితో–జూదము ఫలదని వారించినాఁడు.
రునిశాసనమున వర్తిల్లుచున్నవాఁడను, అతఁడర్థానర్థవిదుఁడు
ర్య సమర్థుఁడు. జూదమువలన కలహము సంభవించు
ఁడు. బలవంతులతో విగ్రహము పరిహరించుట తగునని
డు" అని విదురుని పలుకులగా హెచ్చరించినాఁడు.

రుని పలుకులు ధృతరాష్ట్రుని మనస్సునందెంత పని చేయు
తెలియుచున్నది. విదురుని అర్థ – అనర్థ విదుఁడని
ఁడు నిశ్చయముగా నమ్మినవాఁడు. విదురుఁడుపదేశించిన
నడచుకొన్న రాజ్యమున సుఖశాంతులభివృద్ధి యగునని
ర్తిగా తెలిసినవాఁడు. అయినను పుత్రవ్యామోహమాతనిని
ర్గమున నడచునట్లు చేయుచున్నది. పుత్రుని రాజుగా చూడ
. ఆకాంక్ష ఒక వైపు – పుత్రుని సామ్రాజ్యమున కడ్డుతగులు
—కంటకములుగా కనిపించుటచే వారిని కూటనీతిచే మార్గము
లగింపవలెనను దురాశ మఱొక వైపు అతనిని లాగినవి.
ని మాటలన్నిటిని మౌనముగా అంగీకరించినఁ .

ంద్రప్రస్థ పురమునుండి విదురుఁడు ధర్మజునితోడ్కొ
.

ర్మజుఁడు తమ్ముల నొడ్డి యోడినాఁడు. తన్నొడ్డియోడినాఁడు
ద్బలమున ద్రౌపదినొడ్డి యోడిపోయెను. అప్పుఁ – ద్రోణ
ష్మదులవిరళ స్వేదాంగులైరి. విదురుఁడు మొగము కనిపింపనీ
తన్నెఱుఁగక దుఃఖితుఁడై యుండెను.

రెండవసారి — జూదమునందోడి — యరణ్యములకేగుచుండిరి. అప్పుడు కుంతిని వనవాస క్లేశములను ఓపజాలదని — తనయింటనే విదురుడుంచుకొనినాడు.

ఆ ధర్మము నెదుర్కొనజాలని పరిస్థితి యందు ఆ అధర్మ పీడితులను ఓదార్చి — సానుభూతి చూపు మతము అతనిది.

కౌరవుల దురాగతములు — హద్దుమీరినవి. వారిని అరికట్టలేకపోయెను. మౌనముగ చూచుచు తలవాంచెను. పాండవులరణ్యములకు పోవుచున్నారు.

అప్పుడు వారినోదార్చుటయే తన కర్తవ్యముగా భావించినాడు. "మీరు కృష్ణద్వైపాయనుని చేత శిక్షితులరు. నారదునిచేత రక్షితులరు. మీకు ధౌమ్యుడు పురోహితుడు. దైవమానుష సంపద గలవారలుమీరు! బల పరాక్రమమున రాజులను జయింతిచిరి. ధర్మచరితమున ఋషులను జయించినవారలు. మహత్త్వమున కుబేర వాసవుల జయించితిరి. మిమ్ములను భూమాతయు — గాడ్పును — చంద్రాదిత్యులును — ఎల్లి కాలములందు రక్షించుచుందురు ఎల్లి కార్యములందును అప్రమత్తులరయి వర్తిల్లుడు" అని శుభాశంసలు గావించినాడు.

పాండవులు బలవత్తరమగు కర్మచే ప్రేరితులై జూదమున నోడిరి. రాజ్యమును — ధన ధాన్యములను కోల్పోయి, సమయమునకు కట్టుబడినారు. అరణ్యములపాలై పోవుచున్నారు. తానేమియు చేయజాలని స్థితి — విదురునిది. అరణ్యములకేగు నిరపరాధులను మరల్పజాలని స్థితి. ప్రతి ఆస్తికునకు — అట్టి సమయమున వశమునందున్న దొక్కటే!

"భగవంతుడు మీకు ఈ ఆపదలనెదుర్కొను బలము నొసంగుగాక" అని యాశీర్వదించుట.

"దిక్పాలురు మిమ్ముల నెల్ల విధముల రక్షింతురుగాక"యని ప్రార్థించుట! విదురుఁడు గావించిన పనియునదియే!

పాండవులరణ్యవాసమును గావింపను – కామ్యక వనమును ప్రవేశించిరి.

అప్పుఁడు ధృతరాష్ట్రుడు విదురుని పిలిచినాఁడు. అతనిని "నీవు బృహస్పతి కంటెను బుద్ధిమంతుడవు. పాండవులకు కౌరవులకు – సమ్మతుఁడవు. ఇప్పుఁడా పాండవులేమి చేయగలరు? –చెప్పుము" అని ప్రశ్నించినాడు.

అప్పుఁడు విదురుఁడు—

"పాండవులు ధీరచిత్తులు. దేవమూర్తులు. నేను ముందుగనే – అధర్మద్యూతమున పాండు పుత్రులకు – నీ తనయులకు భేదము పుట్టునని చెప్పితిని వినవైతివి. కొడుకుల మాటలే నీ చెవికింపైనది. ఇంకనైనను – ఇప్పటికైనను వీరిని వారింపుము. వారిని రప్పింపుము. ఆ పాండవులను రాజ్యమున ప్రతిష్ఠింపుము. కీర్తి ధర్మములను నిలుపుము – రాజ్యము, త్రివర్గము – ధర్మమూలములు! అధర్మప్రవృత్తివి కావలదు!

కర్ణ, దుర్యోధన, దుశ్శాసన శిక్షితుఁడా దుర్యోధనుఁడు. అతని చేష్టల కొడంబడవలదు. కుల దూషకుఁడు నీ పుత్రుడు. అతనిని దూషించి కులమును రక్షింపుము" అనినాఁడు.

"ధర్మరాజును అఖిల రాజ్య రక్షకుని గావింపు"మనినాఁడు. సభామధ్యమున ద్రౌపదీ భీమసేనులను ప్రార్థింప దుశ్శాసనుని ప్రార్థింపుము"ని నాఁడు.

అప్పుఁడు ధృతరాష్ట్రుడు కోపించి – "నీవు నా కొడుకుల ఉన్నతి కెన్నడును సహింపవు". నీ సహాయమును నేనొల్లను. పాండవుల

కడకేని—నీ కిష్టమైన చోటికేని పొమ్ము" అనినాఁడు వెంటనే విదురుఁడు పాండవులకడ చేరినాఁడు.

ధర్మజుఁడతని నాహ్వానించెను. ధర్మజుఁడతనిని "నీవు మాకును కౌరవులకును హితుఁడవు, ఏమి చేయవలెనో (ఇప్పుఁడు) చెప్పుమని" యడిగినాఁడు.

అప్పుడు విదురుఁడాతనితో" నేనుభయపక్షముల వారికిఁ జగములకును మేలగు విధమును చెప్పితిని. హితమును భోధించితిని సర్వజన రుచికరమగు ఆహారము రోగాతురునకు రుచింపనట్లు— దుర్యోధనునకు రుచింపఁదయ్యె, అందుచే ధృతరాష్ట్రుఁడు నన్నిచ్చటిఁ తఱిమినాఁడ॥ని తెలిపినాఁడు

అచ్చట — హస్తినాపురమున — విదురుడు లేనిది ధృతరాష్ట్రు ధృతి చెడినది. వెంటనే సంజయుని కామ్యక వనమునకు పంపినాఁడు "నెమ్మిగలవాఁడు నా చిత్తమెఱిఁగినవాడు. నా ప్రియమగు తమ్ముఁడ అతనిని వేగ తోడ్కొనిరమ్మ"నినాఁడు.

ధృతరాష్ట్రుడు — విదురుని దేశ నిష్కాసితుని గావించినను అఃకృత్యకమే! విదురుఁడెంతటి న్యాయమును పలుకునో — ధర్మమును బోధించునో అతని అంతరంగమునకు తెలియును ఆత్మకు తెలియును కాని. పుత్రవ్యామోహమతని నంధుని గావించునపుఁడా విదురుని పలుకులు — కర్ణశూలములై కటువుగా కనిపించినవి. అట్లు పుత్ర మోహముచే కప్పఁబడి — విదురుని తఱిమినాఁడు. కాని — ప్రతి మానవునకు అంతస్సాక్షి యనునదొకటి యుండును. అది ధృతరాష్ట్రునిలో జాగృతమై తన తప్పిదమును గుర్తించి, విదురుని వెనుకకు పిలువనంపినాఁడు. పాండవులరణ్యవాసము ముగించిరి.

అజ్ఞాతవాసము నెఱవేర్చిరి. పదమూఁడుసంవత్సరములు గడిపినారు. తమ రాజ్య భాగమును తమకియ్యవలసినదని ద్రుపద పురోహితుని రాయబారమున కంపిరి. అనంతరము సంజయుఁడు ధృతరాష్ట్రుని కడనుండివచ్చి రాజ్యభాగము నిచ్చు మాటతప్ప తక్కిన పలురకముల ధర్మములను తెలిపి పోయినాఁడు. సంజయునితో పాండవులేమని చెప్పిపుత్తెంచిరో యని ధృతరాష్ట్రుఁడు భయ పడుచున్నాఁడు.

అప్పుడు తనకు ధైర్యము కలిగించుమని ధృతరాష్ట్రుఁడు విదురుని యడిగినాఁడు.

విదురుఁడు – కోపము, గర్వము, దురభిమానము తగదనెను. ఏలినవానిని–దైవమును – బంధువులను – సముచిత సమారాధనముఁచే తృప్తుల గావింపనివాఁడు – చెడు ఫలములను పొందునని పలికినాఁడు.

భార. ఉద్యోగ 2-36 ప.

క॥ అరిపి విలుకాని యుజ్జ్వల
శరమొక్కని నొంచుఁదప్పి చని సంజను నే
ర్పరియైన నీతి
స్ఫురణము పగరాజు నతని భూమిం జెఱచున్" అని

విలువను తెలిపినాఁడు. విలుకాఁడు గొప్పవాఁడైన నతని యుజ్జ్వల శర మొక్కనిని మాత్రము హతమార్పగలదు. కాని, నేర్పరియైన వాఁడు ప్రయోగించిన నీతి స్ఫురణము శత్రు రాజునేకాక – శత్రు రాజ్యము నంతయు నశింపఁజేయఁగలదు కనుక శరీరము కంటెను రాజనీతితో ప్రయోగము ఎక్కువ పని చేయఁగలదని తెలియఁజేయుచున్నాడు. ఇది మిక్కిలి సత్యము. రాజనీతి వేత్తలెందఱో తమ తమ వాక్చాతుర్యములతో రాజ్యమునే తల్లక్రిందులు చేయఁగలరు. శాసన

సభలో వక్తలు ప్రతి పక్షమునుండి సరియైన వాగ్బాణములు విసరి నఁపుడు అధికార పక్షమువారు వారికి తగ్గి శాసనముల నవరణల కంగీకరించుట — చూచుచున్నారము.

విదురుఁడు తెలిపిన మఱొక గొప్ప రాజనీతి —

తే॥ ఒకటిఁగొని రెంటిని నిశ్చల యుక్తిఁజేర్చి
మూఁట నాల్గిట॥ గడు వశ్యములుగ జేసి
యేనిటిని గెల్చి యాడింటి నెఱిఁగి యేడు
విడిచి వర్తించు వాఁడు వివేక ధనుఁడు.

వివేక ధనుఁడెట్లుండునో తెలుపుచున్నాఁడు. ఎట్లుండవలెనో సూచించు చున్నాఁడు.

ఇచ్చట — ఒకటి యనునది — బుద్ధి — లేక ఆత్మ. ఆత్మసాక్షిగా తనబుద్ధిని ప్రయోగింపవలెనని యర్థము.

రెంటిని నిశ్చల యుక్తితో చేర్పవలయునఁట. ఈ రెండు తంత్రము అవాపము అనునవి, స్వరాష్ట్ర పరరాష్ట్ర చింతనలు. లేదా సుఖ దుఃఖము — రాగద్వేషము — ఇత్యాది ద్వంద్వములను గూడా గ్రహింప వచ్చును. ఇచ్చట రెండర్థములను చెప్పుకొనవచ్చును. రాగ ద్వేషాదులను చలనములేకుండఁజేసి — అనఁగా ఈ రెండింటికి అతీతులై తంత్రావాపములను — నిశ్చలయుక్తిని ఏకత్ర పఱచి, మూఁటిని— మూఁడింటిని — ప్రభు — మంత్ర — ఉత్సాహ శక్తులను లేదా - క్షయ, స్థాన, వృద్ధులను, లల్గింట — సామ, దాన, భేద, దండోపాయములచేత ఏనిటిని — అంగ పంచకమును - అనగా ఆరంభోపాయము, పురుష ద్రవ్య సంపత్తి, దేశకాల విభాగము. విపత్ప్రతీకారము, కార్యసిద్ధి — ఈ యైదును అంగ పంచకములు, వీనిని గెల్చి. ఆఱింటిని — ఎఱిఁగి— అమాత్య, సుహృత్. కోశ, రాష్ట్ర దుర బలములు — వీనిని చక్కఁగా

తెలిసికొని — అనఁగా రాజును - అతని శక్తిని — మంత్రులను - వారి మంత్రాలోచన శక్తిని, సుహృత్ — ఆ రాజునకుఁగల మిత్ర బలమును కోశము - బండారము — ధన సమృద్ధి; రాష్ట్రము అనఁగా రాజ్యమును దుర్గమును - బలములను - రథ, తురఁగ, గజ పదాతుల వృద్ధి క్షయములను చక్కఁగా గుర్తించి లేదా —

సంధి విగ్రహ, యాన, ఆసన, ద్వివిధాశ్రయములను చక్కగా గుర్తించి—

---

(సంధి — సమాన యానకర్మము. అసమాయాన కర్మము అని సంధి ద్వివిధము)

[తాత్కాలిక ఫల లాభార్థమైన ఉత్తరకాల లాభార్థమైన — ఒక రాజుతోఁగూడ సన్యాని పైకి యుద్ధ యాత్రాది కర్మమేది చేయఁబడునో దానిని సమాయాన కర్మమును సంధిగా గుర్తింతురు.]

ఇప్పటి ఫలమునకు గాని, ఉత్తర కాల ఫలమునకు గాని నీవా రాజు మీఁదికి వచ్చినపుఁడు నేనును వచ్చెదను, అని చేయు సంధి అసమాయాన కర్మమనఁబడును.

విగ్రహము — రెండు విధములు —

శత్రు వ్యసనాదికముల తెలిసి — మార్గశీర్ష వ్యతిరిక్త కాలమందు తానే శత్రుజయము కొఱకు చేసిన విగ్రహము—మొదటిది రెండవది — తన మిత్రునకెవరైన అపకారము చేసిన — ఆ మిత్రుని రక్షించుటకొఱక చేసిన విగ్రహము.

ఇచ్చట — రెండవ విగ్రహమున — పరున కెవఁడు శత్ర వాఁడు తనకు మిత్రుఁడను రాజనీతి వర్తించును.

ఏడు విడిచి వర్తించు వాఁడు — సప్త వ్యసనములను వదలి ప్రవర్తించు వాఁడు ఘనుఁడు.

సప్త వ్యసనములను విదురుఁడే ఇట్లు చెప్పుచున్నాఁడు.

తే॥ వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు
పల్లదంబును దండంబు పరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ము సేఁత
యనెడు సప్త వ్యసనములఁ జనదు తగుల

ఉ. 2-44

స్త్రీ వ్యసనము, జూదము, పానము, మృగయా, పలుకులలో పారుష్యము, దండ పారుష్యము, సొమ్మును నిష్ప్రయోజనము గ వమ్ము చేయుట సప్త వ్యసనములలో చేరుచున్నవి.

దైవ వశముచే శత్రువునకు వ్యస నాదికము సంభవించినపుఁడు శక్తి సంపన్నుడైన రాజు ఏకాకిగా యుద్ధమునకు పోవుట — అశక్తుడైఁన మిత్రునికి సహాయముగా పోవుట—

ఇట్లు యానము ద్వివిధము

ఆసనమనఁగా నుత్ప్రేక్ష

సమాశ్రయము రెండు విధములు :—

శత్రువులచే పీడితుఁడగువాని కాపీడను తొలఁగించుకొనుటకు సమాశ్రయము మొదటిది.

పీడలేకున్నను కలుగ వచ్చునని — "బలవంతుఁడగు రాజు నాశ్రయించెదను" అని ప్రకటానార్థ మాశ్రయించుట రెండవది.

కనుక - రాజైన వాఁడు - సప్తవ్యసనములలో తగులు కొనరాదు, స్వామ్య మాత్య సుహృత్ కోశ రాష్ట్ర దుర్గముల స్వరూప, స్వభావ, శక్తులను చక్కఁగా తెలిసికొని యుండవలెను. సంధి, విగ్రహ, యానాసన ద్వైధాశ్రయములను క్షుణ్ణముగా నెఱిఁగియుండవలె.

అంగ పంచకమనఁగా - పంచేంద్రియములు వీనిని - జయించిన వాఁడై యుండవలెను. దేశకాల విభజన, ఆపదకు ప్రతిక్రియ, కార్య సిద్ధ్యాదుల - హస్తగతము గావించుకొనవలెను. ప్రభు, మంత్ర, ఉత్సాహశక్తుల - సామ దాన భేదములతో వశ్యములు గావించుకొని పంచేంద్రియముల గెల్చి స్వామ్య మాత్య సుహృత్ కోశ రాష్ట్ర దుర్గ బలముల విషయమును చక్కగా తెలి కొని - సప్త వ్యసనముల వదలి రాజ్యమేలిన రాజు ధన్యుఁడు. — సామాన్య మానవునకు అన్వయించు కొనవచ్చును. ఆత్మసాక్షిగ బుద్ధిని ప్రయోగించి-సుఖ దుఃఖాది ద్వంద్వ ముల నిశ్చల యుక్తిఁజేర్చవలెను. తాపత్రయమును సామదాన భేదాది చతురుపాయములతో వశపఱచు కొనవలెను. పంచేంద్రియముల నిర్జించి అరిషడ్వర్గముల నెఱింగి సప్త వ్యసనముల విడిచి - వర్తించు వాఁడు వివేకధనుఁడు. ఇట్లు రాజనీతినంతయుఁ ఒక్క పద్యములో గుప్పించి బోధించిన విదురుఁడు-

"ఉత్కృష్టహితైషి" యనుటలో నతిశయోక్తి లేదు.

ప్రజలకు, సామంతులకు, రాజులకు, అధికారులకు, మానవ మాత్రునకు ఆచరింపఁదగు నీతిని విదురుఁడు ధృతరాష్ట్రునితో నిట్లు పలుకుచున్నాఁడు

తె॥ కొంచమైనను దఁగ బంచి కుడుచు మేలు
పనుల యెడ దుఃఖమోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము శత్రునకునైన
నిచ్చుటయు లెస్స యడిగిన యెడ నృపాల!

భా. ఉద్యో. 2-47 ప

తనకున్న సంపదలు-రాజ్యము-భోగ భాగ్యములు - ఐశ్వర్యము కొంచెమైననేమి - గొప్పగా నున్ననేమి?

ఒంటరిగా అనుభవించుట తగదు. దానిని నలుగురకిచ్చి తాను అనుభవింపవలెను. నలుగురితో తన ఆనందమును పంచుకొనుట - ప్రతి మానవుఁడు అనుసరింపఁదగిన నీతి. మానవత్వము గల ప్రతి వాఁడు ఆచరింపఁదగిన నీతి. ధృతరాష్ట్రునితో వ్యంగ్యముగా - "రాజ్యమును పంచుకొని అనుభవింపుఁడ"ని తెలియజేసిన నీతి. ఈ స్వభావమును అలవఱచుకొన్న మానవుఁడు-విశ్వముయొక్క ఆనందము నందే తన ఆనందమును చూడఁగలఁడు. జాతీయతాభావము మానవతా భావము - పెంచుకొనుటకిది మొదటి మెట్టు!

నలుగురికి పెట్టి - వారనుభవించుచుండ-ఆనందించు భాగ్యము భోగ భాగ్యములు. ఇంటి తలుపులు మూసుకొని ఏకాకిగా అనుభవించి - యానందించు ఐశ్వర్యమైశ్వర్యము కాదు.

వంచన - ఆత్మవంచన! సంఘ వంచన! రాజ్యవంచన! "పనుల యెడ దుఃఖ మొప్పి యల్పంబు సుఖము ననుభవించుట హితము".

రాజు మొదలు రైతు వఱకు కష్టముల కోర్చి పనిచేయవలెను. అప్పుఁడే - దేశమునందలి ప్రతి వ్యక్తి ఈ విదురుని సూత్రమును పాటించినప్పుఁడే - శ్రమ ఫలించి దేశ సౌభాగ్యము మూఁడు పూవులు- ఆఱు కాయలు"గా ఫలించ గలదు

"అల్పంబు సుఖము ననుభవించుట హితము"నినాఁడు.

ఐశ్వర్యమున్నది కదా యని అనుభవించిన అది అనారోగ్యమును తెచ్చును. అవకాశమున్నను ఐహిక సుఖ భోగములను తగ్గించి, శరీరమునకు మనస్సునకు హితమగునట్లు "అల్పంబు సుఖము ననుభవింప వలెను.

రాజ్యమున్నది కదా అని — రాజ్య భోగములకు దాసుఁడగుట తగదు. అధికారమున్నది కదా — అని పెత్తనములు చలాయించుట అధికముకారాదు. అవకాశమున్నదిగదా అని సంగ్రహించుకొనుట తగదు అల్పముగా అనుభవించిన అవి దైహికముగ ఆరోగ్యమును కలిఁగించును. అల్ప సంతోషము మానసికముగ ఆనందమును పొందించును.

ఇట్టి యలవాటు కలగిన వ్యక్తి — అధికారి - ప్రభువు - ఎవరైన నేమి - నిరాడంబరముగ బ్రతుకఁ గలఁడు. మహత్తర కార్యము లాచరింపఁగలఁడు.

ఇది నేటి ప్రతి అధికారి — ప్రతి మంత్రి నిత్యము పారాయణము చేయవలసిన మంత్రము. ఆచరణలో నుంచవలసిన సూత్రము.

"అడిగిన యెడ శత్రువునకైన నిచ్చుటయులెస్స" యని తెలిపి నాఁడు.

శత్రువైనను సరే! "దేహి" యనినప్పుఁడు రిక్తహస్తములతో పంప రాదు. ఈ యొక్క సుభాషితమును — పద్యమును — మనస్సునకు పట్టించుకొని బ్రతికిన చాలును. తాసుధన్యుఁడై పరుల ధన్యులఁ గావింపఁగలడు. ప్రతియొక్కరు ఇది పాటించిన—ద్వేషముండదు-శాంతి నిలసిల్లును.

తనకున్నది నలుగుర కిచ్చి — శ్రమతో పనులుచేసి — అల్ప సంతోషియై — శత్రువునకైన అడిగిన లేదనక ఇచ్చి ప్రతి మానవుఁడు జీవించిన — తనకు - తన కుటుంబమునకు - దేశమునకు - విశ్వమునకు కల్యాణమును చేకూర్పఁగలఁడు. ఇట్టివి — విదురుని నీతియందలి పద్యములెన్నో! ఒక్కొక్కటి ఒక్కొక్క ఆణిముత్యము. ఒక్కొక్క అనర్ఘ రత్నము. కాని అన్నింటిని విస్తరించుట కిట స్థలము చాలదు. కనుక — ఇట్టి అమూల్య సుభాషిత రత్నముల నడుగడుగున బోధించిన

విదురుఁడెంతటి మహా మనిషియో ఆ విదురుని పాత్ర ద్వారా సార్వ కాలికములగు నీతుల బోధించిన వ్యాసుఁడెంతటి మేధా సంపన్నుఁడో – ఆ వ్యాసుని భావముల నాంధ్రీకరించిన తిక్కన యెంతటి ధీసమగ్రుఁడో– గుర్తించి యానందింపవలసినదే కాని వర్ణింపనలవి కాదు.

ఇట్టి మహోన్నత గుణములన్నియు ధర్మజుని కడనున్నవని విదురుఁడు తెలిపినాఁడు

"నీవు బాల్యమునుండి వారలపోషించి – యింతటి మానుసుల గావించి రక్షించితివి. ఇప్పుఁడుపేక్షింపఁ దగునా" యని ప్రశ్నించినాఁడు. "తగిన పాలిచ్చి – వారిని రప్పింపుము – నీ కొడుకులఁ తోడి వారినిగా నడపుము. ఇది నీకు తగినపని, మీరును వారును ఒక్కటైయున్న మీకడ దేవతలను తేఱి చూడఁజాలరు" అని పలికినాఁడు

ఇవన్నియు ధృతరాష్ట్రునకు చెవిటి ఈదిన శంకువులైనవి. మనస్సు మారలేదు. ఇంకను నిట్టిబోధలు వినుచున్న మారునేమోయని తలించినాఁడు. అందుకే "మఱి కొంత హితమును బోధింపుము. నాకు కర్తవ్యమార్గమును తెలుపుము" అని కొసరినాఁడు. అప్పుడు విదురుడు-

"దక్కినది గదా యని మీ తమ్ముని భాగమును కూడా మ్రింగఁ జూచుచుంటివి. అది యెట్లు అరుగును. మీను దురాశచే గాలము నందలి మాంసము మ్రింగి మరణమును కోరి తెచ్చుకొన్నట్లున్నదని" పలికినాఁడు.

"మీను దురాశచే గాలముఁ సఁబడి మరణించును. అది దురాశచే మరణమును కోరి తెచ్చికొన్నట్లు – నీవును నీ కుమారులను పాండవుల రాజ్యమును మ్రింగి – నాశమును తెచ్చుకొనఁజూచుచున్నారు. అధిక మగు భోజనము అజీర్ణము చేయునట్లు – విషమించునట్లు – వారి పాలును అనుభవించుట – చేటు తెచ్చును." అను భావముతో

పలికినాఁడు. విదురుఁడీవిధముగా పలు నీతులతో హెచ్చరించెను. పరుషములాడెను. నీతిని బోధించెను.

అప్పుఁడు ధృతరాష్ట్రుఁడు—నిరుత్తరుఁడైనాఁడు. భ్రమానపడినాఁడు. విదురునిబోధ తీక్ష్ణముగా హృదయమున నాటుకొనినది. ధృతరాష్ట్రుఁడు-చైతన్య రహితుఁడైనాఁడు.

అప్పుఁడు – విదురుఁడు కార్యసిద్ధి చందమును బహురమ్యముగా నుపమానములతో వివరించినాఁడు

"పూర్తిఁగా పండిన ఫలమునే కోయఁదగును. అట్లుగాక అపక్వమగు ఫలమును కోసిన – రుచిచెడును. పండిన ఫలము నందున్న రుచి – అపరిపక్వమగు ఫలమునందుండదు. రుచిచెడుటే కాదు. విత్తనమునకు పనికిరాదు. పక్వమైన ఫలము రుచిచెడదు. బీజము చెడదు. కార్యసిద్ధి చెంద మిట్లుండును" అని బోధించినాఁడు.

కార్యమును – పక్వము అనఁగా సిద్ధి–యగు వఱకును పోషింప వలెను. అప్పుడే సిద్ధిని అనుభవింపఁగలఁడు. భవిష్యత్కార్యమునకు బీజమును వేయఁగలఁడు

తే॥ మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁదేఁటి
పువ్వుఁదేనియఁ గొనియెడు పోల్కినెదురు
కందకుండఁగఁ గొనునది కార్య ఫలము
బొగ్గులకుఁబోలె మొత్తలంటఁ బొడువఁ జనదు"

భా. ఉద్యో. 2-57 ప

ప్రభువైనవాఁడు – ఒక అధికారి – తన సేవకులతో నెట్లు పనిగొనవలెన విదురుఁడు తెలుపుచున్నాఁడు.

తోటమాలి – నిత్యమును తన తోటను నీరుపోసి పెంచును. మట్టిని సరిచేసి – చీడలు జాగ్రత్తగా నాశమొనర్చును. మిక్కిలి నేర్పుతో–ఓర్పుతో – కన్నబిడ్డలను వలె తాను పెంచిన తోటను కాపాడుకొనును. లతలకు, చెట్లకు–ఏ మాత్రము హానికలుగనట్లు పుష్పములను కోయును.

తేనెటీగ – పువ్వులపై – అతిసున్నితముగా కూర్చొని-లోని తేనెను గ్రహించును. పువ్వు చెడదు - వాడదు. రాలిపోదు. అంతసున్నితముగ పూలనుండి తేనెను గ్రహించుచున్నది.

అదే విధముగ - తన ప్రజలనుండి ప్రభువు పనులనుగొనవలెను ఏ మాత్రము ప్రజలు కందిపోరాదు. మాలకరి పుష్పములను కోయును. లతలు కందవు తేటి పువ్వులనుండి తేనెను సేకరించుచునే యుండును. ఆ పుష్పములు పరువము చెడవు. వాడవు అదేవిధముగా ప్రజలనుండి ప్రభుత్వము పనులను చక్కగా చేయించుచునే యుండవలెను. ప్రతి వ్యక్తియొక్క నైపుణ్యమును - కళను – విజ్ఞానమును-ప్రభుత్వాభివృద్ధికై వినియోగించు కొనుచునే యుండవలెను. కాని - ఆ ప్రజ - ఆ కార్యకర్తలు కంది-కుంది -అలసి పోయినట్లుండరాదు.

నిజముగా – అంతటి చాక చక్యముతో అధికారులు ప్రజలతో పనిగొన్ననాడు - ఆ దేశము ధన్యమగును. ఆ రాజ్యము - కందని కళలతో వెలిగి పోవుచుండును.

"బొగ్గులకుబోలె మొదలంట పొడువటజదు" అని సాదృశ్యమును చూపినాడు.

బొగ్గులను చేయుటకు వృక్షములను మూలమట్టుగ పొడుతురు కాల్చివేయుదురు. అట్లు–బొగ్గులను తయారుచేసినట్లుగ – ప్రజలను మొదలంట బాధపెట్టి – తపింపజేసి కార్యములను గొనరాదు.

ఈ నీతి ప్రతి రాజకీయవేత్త – కార్యకర్త - కార్యనిర్వహణాధికారి తెలిసికొనఁదగిన నీతి! ఇట్టి రాజనీతితో నిండిన నీతులకు విదురుఁడు జ్ఞాన పేటిక.

ఇంకను ధృతరాష్ట్రున కిట్లు బోధించుచున్నాఁడు—

"కత్తితో - గొడ్డలితో పాడువఁగా తెఁగిన ప్రాను తిరిగి చిగురింపఁ గలదు. కాని వాక్పారుష్యముచే చెడి, విఱిగినకార్యము తిరిగి సరిపోదు" అని తెలిపినాఁడు.

"తనువున విఱిగిన బాణములను ఉపాయముతో వెలికి తీయవచ్చు, కాని, అతి నిష్ఠురముగా మనమున నాటిన మాటల నెన్ని యుపాయములు చేసినను బయటికి వెడలవు" అని వాక్పారుష్య ఫలితమును గుఱించి తెలిపినాఁడు.

"అక్కటా! ధర్మనందనుని యాస్యము నుండి యొక్కనాఁడును కీడు పలుకులు వెడలవు. నీ కొడుకులే పెక్కుభంగుల నికృష్ట వాక్యముల ప్రేలుచుందురు. నీవు దానికి బాధపడవు వినుచు ఊర కుందువు. ఇది నీకు తగునా" అని ప్రశ్నించినాఁడు.

"చేటు కాలమాసన్నమైనపుడు చెడు కార్యములే న్యాయముగా తోచుచుండును. అవి నీతులను నీతులని భావింతురు. నీ బుద్ధి పాండవులతో విరోధమునుండి మరలదు. ఎంతపాపము! మనకులము నందన్ని సద్గుణములలో అగ్రేసరుఁడు యుధిష్ఠిరుఁడు. తనిని మీ సిరి నుండి వెలిగావించితిరి. అయినను సైరణ వహించియున్నవాఁడ"ని పలికినాఁడు.

ధృతరాష్ట్రుఁడింకను నీతుల తెలుపుమనినాఁడు. మనసు మార లేదు. అప్పుఁడు విదురుఁడు న్యాయ మహిమనుగ్గడించినాఁడు. నీతి మార్గమున బ్రతుకుట యుత్తమ మార్గమనినాఁడు.

"నీ పుత్రు లెల్లప్పుడును కయ్యమునకు కాలుత్రువ్వువాడు. కర్ణుడు – మొదలగు అతని మంత్రులంతకంటెను విరుదులు. నీవును నీతి మార్గమునబోవు." అని యాతని పుత్రుల కలహకారి తనమును వివరించెను.

"పాండవులు పరాక్రమవంతులే! అయినను ఆ పరాక్రమమును ప్రదర్శింప నిష్టపడు వారుకారు. నీతి మార్గమునందు నడచు పరాక్రమమునే కోరుదురు. ఎదుర్కొనరు. ఒక్కసారి ఎదుర్కొని విజృంభించిరా – తిరుగులేదు. తుదివఱకును మండుచునే యుందురు. ఇకవారి ప్రతాపాగ్నినార్పుట కెవ్వరితరమును కాదు." అని పాండవుల తిరుగులేని ప్రతాపమును వర్ణించి బెదిరించినాడు.

"వారు నిన్నును తమ తండ్రిని వలె గౌరవ భక్తులతో చూచుచుందురు. కృతమును తలంపుము. పాండురాజు నీకు పరమభక్తుడు. తేజోవంతులగు వారినాదరింపుము"ని బోధించినాడు.

ధృతరాష్ట్రుని మనస్సు పరి పరి విధముల ఊగులాడెను. అయినను నిలిచినదొక్కచోటనే – దుర్యోధనుని కడనే!

"ఉత్తముడగు ధర్మతనయుని రిక్త యుపచారములచేత నుపేక్షించితినే" యని మనస్సున వ్యథ కలుగును.

"దుర్మార్గులగు నా పుత్రులకు పోరను మృత్యువు తప్పద"ని భయము కలుగును. "ఈ దుఃఖము కలుగకుండునట్లు బోధింపుమ"ని మరల అడుగును. కాని – పాండవులతో పొత్తును గుఱించి పలుకడు ఆలోచింపడు.

అప్పుడు విదురుడు – "కులమును రక్షించుటకై యొక్కని విడుచుట నీతి" యని పలికినాడు అప్పుడు ధృతరాష్ట్రుడు–" నీవు

చెప్పిన మాటలు – నిర్మలములు. నిపుణ సమ్మతములు. రాజనీతి మార్గ బోధకములే!" "అయినను నా పుత్త్రుని విడువనోపను" అని నిలకడగా తెలిపినాఁడు.

"ధర్మో జయతి" యని యుండువాఁడ"నని తన పుత్త్ర వ్యామోహమును విడరాని స్థితిని తెలుపుచున్నాఁడు.

"కడకు దుర్యోధనునొడంబఱిచి – వారి జీవనమునకు కొన్ని యలంతి పల్లియలనైనను నొసంగుమ"ని కడమాటగా పలికినాఁడు విదురుఁడు.

విదురుని పలుకులు–నయమార్గ గాములగు వారికెల్లను రుచించు నట్టివి.

ఈ విదురుఁడెంతటి జ్ఞానియో అంతటి వినయ సంపన్నుఁడు. ఎంతటి వినయ సంపన్నుఁడో – అంతటి ధర్మప్రబోధ కుశలి. అంతటి హితైషిని సృష్టించిన వ్యాసునకు నమస్కారము. ఆ భారతము తెనిఁగించిన కవిత్రయ మేధాశక్తికి నమోవాకములు. ఇతని నీతి దేశ కాలములకు కట్టుబడనిది. ప్రతి మానవుఁడు అనుసరింపఁదగినది. ప్రతి అధికారి పఠింపఁదగినది.

"విదుర నీతి" భారతమున స్వర్ణాక్షరములతో వెలిఁగిపోవు నట్టిది. ప్రతి మానవునకు, అధికారికి, పాటింపదగిన నీతి యది! రాజనీతిజ్ఞులు పారాయణ మొనర్పవలసిన నీతియది! విదురునిబోధ మఱొక మలుపు తిరిగినది.

"మును పెందరు రాజులు జన్మింపలేదు. ఎందఱు రాజులు రాజ్యము చేయలేదు" అని జీవిత సత్యమును గుఱించి బోధించుచున్నాఁడు.

"గజ తురగాది సంపదలతో విర్రవీగిరి. కాంతలతో విహారములు సలిపిరి. ప్రజానురంజకముగా పరిపాలించిరి. పోరుల విజయశ్రీని

వరించిరి. విశ్రుత వైభవము లనుభవించిరి ఆ రాజులేరీ? ఎచ్చ
నిలిచిరా!" యని జీవితము క్షణ భంగురమని స్మరింపఁ జేసినాఁడు.

"నీ చెవికి నా మాటలు చేదు కావచ్చును. పాండవులతో సంధి
చేసికొనుము. పంచుకొని బ్రదుకుఁడు ఇహపరములకు-శ్రీవైభవములకు
కీర్తికి - తావలమై వెలయఁగలవు. ఇది తథ్యము" అని నిష్కర్షగా
తెలిపినాఁడు

"ముందీవిషయమును నీవు నిశ్చయించుకొనుము. నీ కొడుకులకు
నచ్చజెప్పుము" అతని ప్రధానులకు న్యాయ మార్గమును బోధింపుము
దిగవిడువకుము అని విస్తరించినాఁడు. అప్పుఁడును ధృతరాష్ట్రుఁడు
తన నిశ్చయమును తెలుపక భగవంతునిపై భారమువేసి వదలి ఁడు.

"నే నిటు చేయనేర్తు, చేయఁజాల" నని పలుక మన వశములేదు.
నరునకు పౌరుషము కంటెను దైవమే ఎక్కువ అని భగవంతుని
నిర్ణయమునకే వదలి విరమించినాఁడు.

ఇట్లు రాగద్వేష విదూరులై—పక్షపాత రహితముగ నీతిని బోధించు
మంత్రుల బోధలు విన్న రాజులకు దేశక్షేమము — అఱచేతి యందే
యుండుననుటలో సందియము లేదు.

అనంతరము విదురుఁడు శ్రీకృష్ణుని రాయబారమునకు పూర్వము
కనిపించును. శ్రీ కృష్ణుఁడు దుర్యోధనుని యాతిథ్యము వలదని
విదురునింట చేరినాఁడు.

శ్రీకృష్ణుఁడు రాయబారమున కేగినాఁడు. విదురునింటనే భుజించి
నాఁడు. కుంతిని దర్శించి యోదార్చినాఁడు. కుంతి పాండవుల
క్షేమములను గురించి-ప్రశ్నించినది. వారి కష్టములను స్మరించినది.

"ఆ నాడు ద్రౌపది పడిన అవమానదుఃఖములనే గాంచిన ఈ నేను ఎంతకు నోర్వజాలను. అంతటి దుఃఖములననుభవింప లోకమున నెవ్వరికగును" అని విలపించినది ఆ స్త్రీయెడ.

క॥ విదురుఁడొకఁడు దక్కఁగ
సదస్యు లెవ్వరును ధర్మసంకటయమిది కా
దదు నార యతని శీలము
కుదురిలోకమున కింతకుం దలఁపంగన్"

అని విదురుని శీలమొక్కటే లోకమంతటికిని ఆధారమని కుంతి విదురుని శ్లాఘించినది.

ఆ నాఁటి అధర్మమున - సభాసదులలో విదురుఁడొక్కఁడే యిది కూడదనీ పలికిన వాఁడని తెలిపినది.

కుంతి వాక్యముల వలనను విదురుని శీలమును మనము గుర్తింపనగును అంతటి శీలధనులు - ఇతరులకు బోధించుటకును సమర్థులగుదురు.

విదురుఁడు శ్రీ కృష్ణునితో కానున్న విషయమును తెలిపినాఁడు. "ఇదొక కార్యమని యింతదూరము వచ్చితివా? దుర్యోధనుఁడు దుష్టబుద్ధి నీ మాటవినున? దురభిమాన ధనుఁడు, దుర్తరాష్ట్రులందఱునుకూడా- నీ శాసనము నుల్లఘింపనున్నారు. సంధికానేరదు వారలకు కాలము ప్రాప్తించినది. అందుఁబోవలదని వారించినాఁడు.

శ్రీ కృష్ణుఁడును - తనకంతయును తెలియునని - చుట్టములలో నొప్పమి కలిగినపుఁడు - అడ్డుపడి దానిని మాన్పకున్న క్రూర కర్ముఁడందుఱు కనుకనే శాంతి గావించు ప్రయత్నమున వచ్చితినని పలికినాఁడు.

ధృతరాష్ట్రుడు సంధిగావింప వచ్చిన కృష్ణునకు వివిధ మణిమయ రథములను జవనాశ్వములను, భద్రగజములను, దాసదాసీజనమును కృష్ణునకిత్తునని విదురునితో చెప్పినాడు.

మనయింట - కృష్ణునకేమి వచ్చిన అన్నియు నిత్తునన్నాడు. ఇది రాయబారికి లంచమిచ్చుట వంటిది అతని వాక్కును కట్టివేయుట వంటిది కనుకనే విదురుడు ధృతరాష్ట్రునితో' శౌరికి లంచమిచ్చి సంప్రీతుని చేయుట తగదు కార్యగతియందు భేదమొనర్ప దలపకుము సుమెరు సదృశార్థము చూచియు అతడు పార్థుని బాయడు' అని ఖండితముగా హితము పలికినాడు.

ఇట్టి హితైషులు నిజముగా చాల అరుదు.

శ్రీ కృష్ణునితో కుంతి పలికిన పలుకులు — విదురుడెంతటి ధర్మపరుడో తెలుపుచున్నది

'అతని శీలమందుదరి లోకమున కంతకున్" అని విదురుని శీలమును లోకమున - ధర్మమార్గ పరుల కాధారమని మార్గ దర్శకుని తెలుపుట సత్యదూరము కాదు.

అట్టి హితైషి మాటలను వినక చెడినవారు కౌరవులు అతని ధర్మశీలమును గుర్తించిన వాడు కనుకనే శ్రీ కృష్ణుడు దుర్యోధనునింట మృష్టాన్నమును త్రోసి విదురునింట విందు నాప్యాయతతో ఆరగించినాడు.

అట్టి హితైషి పలుకులు విని ఆచరించు రాజునకు వినాశముండదు ఉండబోదు.

ప్రజలు: రాజరికములో వారి పాత్ర.

ప్రజలు: రాజ్యమనునదొక వృక్షమైన ఆ వృక్షమునకు ఫలములు ప్రజలు. అట్టి ప్రజలు నడచుకొనవలసిన విధానమును గుఱించి విరాట పర్వమున — ధౌమ్యుఁడుపదేశించినాఁడు.

"అవికృత వేషంబున సమయ మెఱిఁగి భూమీశుని కొలువవలెను. అట్టివానిని జగతీవల్లభుఁడు సన్మానించును.

రాజును కొలిచి, యలవడ తిరిగితిని. నాకేమియని భయములేక మరియాద తప్పి మెలగఁరాదు. అట్టివారి పురుషార్థములకు హాని పుట్టును.

రాజ సేవకుఁడు — రాజ గృహము కంటె సుందరమగు ఇల్లు కట్టరాదు. రాజు నాకారమును, వేష భూషలను అనుకరింపరాదు. రాజులు — ఆజ్ఞమీరినచో పుత్త్రులని, పౌత్రులని, భ్రాతలని, మిత్రులని పరిగణింపరు. శత్రువులవలె తమ కోపమునకు గుఱి చేయుదురు.

ధరణీశునకు కట్టెదుర నుండరాదు. పిఱుందనుకాని, ప్రక్కల కాని కొలిచి యుండవలెను. నగరమునందలి మాటలను బయట తెలుపరాదు అంతఃపురంలో చుట్టరికము కీడును తెప్పించును రాజు సమీపమున సంచరించు — కుబ్జ; వామన కాంతాదులతో పొందు గలిగి యుండుట — అంతకంటెను కీడు.

ఎంతటి గౌరవము కలవారైనను — భూమి పాలుఁడు కరుణతో ఇచ్చిననే తప్ప - ఉత్తమ ఆసనములు, ఉత్కృష్ట వాహనములు తామే ఎక్కరాదు. మన్ననలు పొందినప్పుడు ఉబ్బిపోరాదు. అవమతి పొందినప్పుఁడు స్రుక్కిపోరాదు రాజెవ్వరికైనను మనుపను, చెఱుపను పూనియుండుట తెలిసినను దానిని బయటపెట్టరాదు

ఏలినవాఁడు కార్యమునందు నియోగించునప్పుఁడు ఎండనక, వాననక ఇది తన ఇల్లు - ఇవి ప్రవాసములని తలంపక ఓర్చుకొనవలెను. ఆ కార్య

మును నిర్వర్తించు సమయమున—ఆకలియని తపింపరాదు. నిదురకు తఱి తప్పెనని బాధపడరాదు. దప్పి పుట్టెనని వెత జెందరాదు. "ఒక్కండనే — ఎట్లాకో" యని భీతి చెందరాదు. కార్యతత్పరుండై యుండుట తగును. ఎంతటి యాపుండైనను మహానాయకుని సొమ్ములను పొందక మానుట తగును.

ఆవులింత, తుమ్ము, హసము. నిష్ఠీవము — గుప్తముగా జరుపవలెను.

శత్రు దూతలు, శత్రువులకు నెరవగువారు, నిరాకృతులు, పాప వర్తులు, తమకు చేరువగా నుండినచో — చేటు వాటిల్లును.

రాజుకడనుండు — ఏనుగైనను, దోమయైనను — వానితో వైరము తగదు. తామెంత పూజ్యులైనను - జనులతో పొందియుండుట తగును. కలిమి గలదని విచ్చలవిడిగా భోగింపరాదు. ఇది ధౌమ్యుని బోధ.

రాజు రాజ్యమున కధిపతి. దైవాంశ సంభూతుండు. అతని అనుశాసనమును కట్టుబడి ప్రజలు వర్తింతురు అనాంటి రాజ్యము ప్రజారాజ్యము కాదు. ప్రజలచే ప్రజలకొఱకు పరిపాలింపంబడు ప్రజలయొక్క రాజ్యము కాదు. అయినను ప్రజల మాటలకెంతో గౌరవముండినది. రాజులు ప్రజల మన్ననల పొందుటకై తాపత్రయము పడుచుండిరి. ప్రజలకు భయపడుచుండిరి. ప్రజలను నిర్భయముగా రాజులు గావించిన అన్యాయములను విమర్శించుచుండిరి. రాజులను వదలి పోవుచుండిరి. ప్రజారంజనమే రాజుల ప్రథమ కర్తవ్యము కనుకనే అతనికి 'రాజ"ను నామము. ప్రజలు రాజులయెడ రాజ్యము నందు నడచుకొను విధానమును గురించి పైన చెప్పబడినది.

ఇంక రాజనువాండు ప్రజల అభిప్రాయములను ఎట్లు గౌరవించెడు వాండో పరిశీలింతముగాక!

రాజు పౌర జానపదుల సమ్మతి తోడనే సర్వకార్యములను స్థైర్యముగా జరుపఁగలిగెడు వాడు.

'తస్మై మంత్రః ప్రయోక్తవ్యః దండమాదిత్సతాన్నృప
పౌర జానపదా యస్మిన్ విశ్వాసం ధర్మతో గతాః'

భా. శాంతి. 693

దండనీతిని సక్రమముగా ననుసరింప నిష్టపడు రాజు పౌర జానపదులకు విశ్వాసమును కలిగింప వలెను వారి విశ్వాసమే రాజ్య తంత్రమునకు మూలమని అరణ్య పర్వమున తెలుపఁబడినది.

రాజు తొలుత మంత్రులతో నాలోచింపవలెను. అనంతరము ప్రజల కెఱుక పఱుప వలెను. ప్రజా సమ్మతిని గ్రహింపవలెను. విషయమెంతటి ప్రధానమైనను అప్రధానమైనను ఇదియే జరుగు పద్ధతి.

యయాతి - తన జరాభారమును గ్రహించి యౌవనమును పరిగ్రహింప లేదని - వారసత్వపు హక్కుగల యదువును వంచించి కనిష్ఠుఁడగు పూరువును రాజ్యాభిషిక్తుని గావించినాఁడు.

అప్పుఁడు ప్రజలాతనికి తమ అభిప్రాయముల నిట్లు తెలుపుకొనిరి. 'ధర్మాభిజ్ఞ! అవిచారమని పలుకుటకు జంకు చున్నాము. నీయగ్ర సంభవుఁడు అత్యున్నత శక్తి యుక్తుఁడు మహాభార ప్రగల్భుఁడు పాత్రుఁడు భార్గవ దౌహిత్రుఁడు లోకఖ్యాతుడు. ఇతఁడుండఁగ జఘన్యాత్మజుఁడగు పూరునకిచ్చుట తగునా" అని నిలదీసి యడిగిరి.

అప్పుఁడు యయాతి ఇట్లు సమర్థించుకొనుచున్నాఁడు.

"తనయుండు తల్లి దండ్రులు
పనిచిన పనిసేయఁడేని పలుకెడలోఁజే

ప్రజలు: రాజరికములో వారి పాత్ర.

ప్రజలు: రాజ్యమనునదొక వృక్షమైన ఆ వృక్షమునకు ఫలములు ప్రజలు. అట్టి ప్రజలు నడచుకొనవలసిన విధానమును గురించి విరాట పర్వమున – ధౌమ్యుడుపదేశించినాడు.

"అవికృత వేషంబున సమయ మెఱిగి భూమీశుని కొలువవలెను. అట్టివానిని జగతీవల్లభుడు సన్మానించును.

రాజును కొలిచి, యలవడ తిరిగితిని. నాకేమియని భయములేక మరియాద తప్పి మెలగరాదు. అట్టివారి పురుషార్ధములకు హాని పుట్టును.

రాజ సేవకుడు – రాజ గృహము కంటె సుందరమగు ఇల్లు కట్టరాదు. రాజు నాకారమును, వేష భూషలను అనుకరింపరాదు. రాజులు – ఆజ్ఞమీరినచో పుత్త్రులని, పౌత్రులని, భ్రాతలని, మిత్రులని పరిగణింపరు. శత్రువులవలె తమ కోపమునకు గురి చేయుదురు.

ధరణీశునకు కట్టెదుర నుండరాదు. పిఱుందనుకాని, ప్రక్కల కాని కొలిచి యుండవలెను. నగరమునందలి మాటలను బయట తెలుపరాదు అంతఃపురంలో చుట్టరికము కీడును తెప్పించును రాజు సమీపమున సంచరించు – కుబ్జ; వామన కాంతాదులతో పొందు గలిగి యుండుట – అంతకంటెను కీడు.

ఎంతటి గౌరవము కలవారైనను – భూమి పాలుడు కరుణతో ఇచ్చిననే తప్ప - ఉత్తమ ఆసనములు, ఉత్కృష్ట వాహనములు తామే ఎక్కరాదు. మన్ననలు పొందినపుడు ఉబ్బిపోరాదు. అవమతి పొందినపుడు సుక్కిపోరాదు రాజెవ్వరినైనను మనుపను, చెఱుపను పూనియుండుట తెలిసినను దానిని బయటపెట్టరాదు

ఏలినవాడు కార్యమునందు నియోగించునప్పుడు ఎండనక, వాననక ఇది తన ఇల్లు-ఇది ప్రవాసముఅని తలంపక ఒర్చుకొనవలెను. ఆ కార్య

పరము ప్రసన్నబుద్ధి ననవద్యముగా దయసేయు నెమ్మితో
నిరుపమకీర్తి యట్లయిన నీకును నాకును సంగమంబగున్॥

భా. ఆది 4-60 ప

ఇహలోక ఆశ్రమ కన్య – జితేంద్రియుఁడగు సంయమిచే పెంపఁబడిన బాల – ఒక సామ్రాజ్యాధిపతిని కొన్ని నియమములతో బంధించి వివాహమాడిన ఘట్టములు గలవు.

ఆ దుష్యంతుఁడు – అనంతసత్త్వుఁడు – సమస్తాశాంత మాతంగ మర్యాదాలంకృతమైన భూవలయమును ఆత్మాయత్తము గావించుకొని ఆది క్షేత్రుల మార్గమున మహినెలిన సార్వభౌముఁడు - మునికన్య కోరిన వరముల నొసంగినాఁడు. గాంధర్వ వివాహమున అభిమత సుఖములను అనుభవించినాఁడు. పురికేఁగినాఁడు.

ఆ సమయమున కణ్వుఁడింట లేఁడు.

శకుంతలకు కణ్వాశ్రమము నందు భరతుఁడుదయించినాఁడు. సకల చక్రవర్తి లక్షణ లక్షితుఁడు – సింహసంహననుఁడు – అగు ఆ బాలుని సమస్త భూమండలమునేలు సమర్థుఁడని కణ్వుఁడు గ్రహించినాఁడు. ఆ బాలునితో శకుంతలను దుష్యంతుని కడకు పంపినాఁడు

ఆ సమయమున దుష్యంతుఁడు – సకల సామంత మంత్రి పురోహిత ప్రధాన పౌరజన పరివృతుఁడైయున్నాఁడు. శకుంతల ఆ రాజును గాంచినది. అతని ఉదాసీన భావమును గుర్తించినది. ముందు– ఆ రాజునందు గాంచిన ఆదరమగు అనురాగము, అదర సంభ్రమములు– కానఁబడలేదు.

అధిపులు బహు కార్యమగ్నులు కనుక మఱచి యుండవచ్చునని భావించినది. అతనిని పూర్వ వృత్తాంతమును స్మరింపఁజేసినది. వరమును స్మరింపుమనినది.

"బాలార్క తేజుఁడగు ఈ బాలుఁడు నీ కొడుకని" చూపగా దుష్యంతుఁడు పలుకలేదు. "నే నెఱుఁగను, నీ వెవ్వతెవు" అని ప్రశ్నించినాఁడు.

అప్పుఁడు శకుంతల వెఱఁగందినది, సత్య మహిమనుగ్గడించి ధర్మప్రబోధ మొనర్చినది.

రాజు చలింపలేదు, సర్వ తీర్థాభిగమము, సర్వ వేద సమధిగమము సత్యముతో సరిగావనినది. అయినను రాజు అంగీకరింపలేదు. అప్పుడు దివ్యవాణి—

"శకుంతల నీ భార్య, ఈ బాలుఁడు నీ పుత్త్రుఁడు" అని పలికినట్లు దివ్యవాణి తెలుపువఱకు రాజు కిమ్మనలేదు. తెలిసి తెలిసి బొంకినాఁడు.

దివ్యవాణి వాక్కులను విని రాజు పలికిన పలుకులు — గాంధర్వ వివాహమును ఏనుగు, ఈ ఇంతియునుతప్ప అన్యులెఱుఁగరు. అన్యులెఱుఁగమిఁజేసి ఆలోకాపవాదభీతుని అనృతమాడితిని." అని తన కళత్ర పుత్త్రులను పరిగ్రహించినాడు.

రాజులెంతటి స్వాతంత్ర్యము గలవారైనను, అధికారము గలవారైనను, సత్త్వ సంపన్నులైనను – "లోకాపవాద భీతి" యందెంత వఱకుండినదో ఈ యుపాఖ్యానము తెలుపుచున్నది.

రాజులు ప్రజలకు భయపడువారు. లోకనిందకు భయపడువారు. అసత్యమాడుచున్నానని తెలిసియు బొంకినాఁడు. అసత్య మాడినచో ఎంతపాపమో రాజునకు తెలియును అయినను ఆ పాపమునకే అంగీకరించెను గాని "లోకాపవాదమునకు భయపడి సత్యమును నిర్భయముగా తెలుపఁడాయెను.

"భయంకరమగు పాపమునకంటె – లోకమునకు వెఱపెక్కువ" అని తెలియుచున్నది.

ఇది యానాఁటి రాజులకు–"ప్రజాభిప్రాయమునెడ గౌరవము"ను తెలుపు కథ!

పుట్టుగ్రుడ్డియగు ధృతరాష్ట్రుఁడు వారసత్వము కోల్పోయినాఁడు. అతనికి సంక్రమించిన రాజ్యమును ప్రజలకు భయపడి ధృతరాష్ట్రుఁడు ప్రజలకే ఇచ్చినట్లు గలదు.

పాండురాజు యొక్క ప్రజా రంజకత్వమును మఱవని ప్రజలు తమకెట్టి యుపాయమును కలిగింతురో యని భయపడి ధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరునకు యౌవ రాజ్యమొసంగినాఁడు.

యుధిష్ఠిరుని రాజ్యభార దురంధరునిగా తెలిసి ధృతరాష్ట్రుఁడు భీష్మ విదురులతో విచారించి యౌవ రాజ్యాభిషిక్తుని జేసినాఁడు.

దుర్యోధనుఁడు సకల యువరాజ లక్షణములతో నొప్పియుండినను అతనిని యువరాజును గావింప లేదు.

యుధిష్ఠిరుని నలువురు తమ్ములు నాలుఁగు దిక్కులు జయించి సర్వ భూతల రాజనందనుల నడంచిరి భూరి వస్తురాసుఁగొని తెచ్చిరి ధర్మజుఁడప్పుఁడు యువరాజయ్యును సార్వభౌముని వలె విరాజిల్లెను. ఇది దుర్యోధనునకు మఱింత మాత్సర్యము కలుగఁ జేసినది

మహోద్ధత గజ, రథ, తురంగ యుద్ధములందు గదా యుద్ధమునందును అద్వితీయుఁడని వాసి గాంచినాఁడు మధ్యముఁడు అనుపమ కార్ముకాది వివిధాయుధ విద్యా కోవిదుఁడు అర్జునుఁడే అన్యులు లేరని జయఘోషలు వినిపించు చుండినవి యములమిత శౌర్య పరాక్రమములు గలవారైరి.

ఇట్లు పాండు కుమారులు ఎల్లవారలకు ఆరాధ్యు లయినాపు అప్పుడు దుర్యోధనునకు మిక్కిలి దుఃఖమైనది—ఒక వైపు-యుధిష్ఠిరుఁడు యువరాజై వెలిగిపోవుచున్నాఁడు.

మఱొక వైపు పాండుకుమారులు ప్రజలి అనురాగమునకు పాత్రులగుచుంటిరి. ఇచ్చట — అధికారము — ప్రజాదరణ రెండును సమాన స్థాయిలో ప్రాముఖ్యమును వహించినవని తెలియుచున్నది. యువరాజు యుధిష్ఠిరుఁడైనందులకు దుర్యోధనుఁడు దుఃఖించు చున్నాఁడు అప్పుఁడు ధృతరాష్ట్రుఁడు దుర్యోధనునితో నిట్లు పలుకు చున్నాఁడు—:

ఆ ప. 6 అధ్యా 124 ప. నుండి

"రాజగు వాఁడు తన రాజ్యభారమును తానే స్వయముగా చూచి అరయు చుండ వలయును.

నేను షడంగ సహితముగా వేదాధ్యయన ము సేసితిని. అస్త్ర శాస్త్రమున సంపూర్ణ జ్ఞానము బడసితిని. బలముగలదు. కాని అంగ వైకల్యము గలవాఁడను. పుట్టుగుడ్డిని. కనుక పర చక్రములకు ప్రతి వ్యూహమును రచియింపనేరను. కనుక రాజ్యమునకు తగను. లోక విఖ్యాతుఁడు పాండురాజు. అమలుఁడు గుణ రత్నాకరుఁడు. అత్యుదారమతి అతఁడు—

నేనంధుఁడనైనను నన్ను రాజుగా జేకొనినాఁడు. నాపై భక్తి విశ్వాసములు గలవాఁడై. సర్వజగమును జయింపఁగోరినాఁడు. కురువంశ రాజ్య భారమును తన పరాక్రమమున దాల్చినాఁడు పరభూపతుల నణంచి కప్పము గొని తెచ్చి — నా కొసంగినాఁడు. బహుయజ్ఞముల నా చేత గావించినాఁడు.

వానికంటెను గుణగరిష్ఠులాతని సుతులు. జనముల కనురక్తులై బరగుదురు. వారినెట్లు బాపనేర్తును అని దుఃఖించుచున్నాఁడు. ఇచ్చట

ధృతరాష్ట్రుని పలుకుల వలన యుధిష్ఠిరుని యువరాజును గావించిన కారణములు రెండు తెలియుచున్నది. అందు — పాండురాజు — తానంధుఁడైనను, స్వతంత్ర కార్యమీలక సమర్థుఁడైనను రాజుగా చేకొని, యజ్ఞయాగాదుల చేయించి, దండయాత్రలతో ఆతని రాజ్యాభివృద్ధికి పాటుపడుట; రెండవది — అతనిసుతులు సంతియు గుణగణములతో నొప్పుచు, ప్రజానురాగము ను పొందుట! ప్రజల అనురాగమును చూరగొనుట - ఆనాఁటి రాజుల కెంత ప్రముఖకార్యమో తెలియుచున్నది.

అప్పుఁడు దుర్యోధనుఁడు ధృతరాష్ట్రునితో నిట్లు పలుకుచున్నాఁడు- పైతృకమగు రాజ్యలక్ష్మి—ధృతరాష్ట్రునకు చెందవలసినది—ఆ విధముగా పాండుభూపతి యనుభవించినాఁడు. అతని యనంతరమతని తనయుఁడు యుధిష్ఠిరుఁడు దాల్పఁబోవుచున్నాఁడు, ఇఁకపై పాండు వంశీయులే వసుమతి రాజ్యమున కర్తలు. మేము రాజ్యమునుండి వంచింపఁబడిన మా పుత్ర పౌత్ర వర్గమును రాజ్యాధికారమును కోల్పోవును. మేమిఁక పరులను సేవించుచు బ్రదుక వలసిన దేనా?

మమ్మిట్లు పరాధీన వృత్తులుఁగాకుండ రక్షింపుము పాండురాజు తెంటి భక్తిని మఱచిపొమ్ము. అతని తనయులపై దయను తొలగించు కొనుము ఈ రాజ్యము మొదటనుండియు నిది ప్రకృతి జనులు— మా వరులు గాకున్నను — క్రమాగతముగ — అప్రయత్నముగ పొంద గలను.

తొల్లి పాండురాజు రాజై తన గుణాధిక్యముచే ప్రజానురాగమును చూఱఁగొనినాఁడు. ప్రస్తుతము — ఎల్లరు ధర్మజుని రాజ్యమునే వలతురు. కనుకనే నేను నిత్యము దాన సమ్మానంబులతో ప్రకృతి జనులను సంతోషింపఁ జేయుచుందును దుష్టులింకను వారిపై పక్షపాతము కలిగియున్న — ఆ ప్రేమ వారినుండి తొలఁగి నాపై కుదురు వఱకు — పాండవులను వారణావతమునకు పంపుదమనినాఁడు.

ఇచ్చుట — పాండవులను వారణావతమునకు పంపుటకు ప్రబల కారణములు రెండు — ప్రజలను దానములతో సమ్మానములతో — తమపై ఆదరము, ప్రేమ కలుగునట్లు చేసికొనుట — ఇంకను ఎవరైన పక్షపాతము కలిగియుండిన పాండవులను దూరము పంపి వారి పరోక్షమున వీరిని సామదానాదులతో లోబఱచుకొన ప్రయత్నించుట. దుర్యోధనునంతటి దురభిమాని — అధికారమును వశపఱచుకొనుటకు, రాజ్యమును హస్తగతము గావించుకొనుటకు ప్రజల అంగీకారమును, ప్రజల అనురాగమును చూఱగొనుటకై ఇట్లు పాటుబడిన నింక సామాన్య రాజుల గుఱించి తెలుపవలెనా!

కనుక ఆ నాడు ప్రజాస్వామ్యము ప్రత్యక్షరూపమున కాకున్నను పరోక్షముగా రాజ్యాధికారమున పని చేయుచుండినదనిన సత్యదూరము కాదు.

మఱొక సన్నివేశము—

అధర్మ ద్యూతముచే దుర్యోధనాదులు పాండవులను రాజ్యము నుండి వెడల నడచినాఁడు.

అప్పుడు పాండవులను చూచి పౌరులు పరమ దుఃఖితులైనారు. వారిట్లనుచున్నారు—

"ఈ ధృతరాష్ట్ర దుర్యోధనులు వీతదయులు దుర్యోధనుఁడు లోభి అతఁడు రాజుకాగా — అతని రాజ్యమెున ఎట్లుండనేర్తుము? ఇఁక ఈ యుర్విపై ధర్మమెక్కడిది ప్రజలను కాచు వారెవ్వరు? పాండుసుతులు పరమ ధార్మికులు, వారువెళ్ళువ చోటికే మేమును వెళ్లెదము" అని వారిని వెంబడించిరి.

ఇట్లు పౌరజనులు రాజుల ధర్మాధర్మములను బహిరంగముగ విమర్శించువారు అధర్మమని తెలిసిన వారిని వదలి — వెడలి పోవుటకు సంసిద్ధులగువారు, అని తెలియుచున్నది.

అప్పుడు ధర్మజుఁడు – "మీ యనురాగము చేత మా యందు లేని గుణములను వెలిగించితిరి. మీరు వనవాస దుఃఖమునోపఁజాలరు. వలవదు: ఉడుగుఁడు" అని వాదించినాఁడు.

"జపహోమాది పుణ్యక్రియలచే మీకు ప్రియము గావించు చుండెదమ"ని బ్రాహ్మణులును వారిని వెంబడించిరి.

"మీ కపకారము గావించిన ధార్తరాష్ట్రుల రాజ్యమున నుండ నోపమ"ని బహిరంగముగ ప్రజలు విప్లవము వంటి తిరస్కారమును, గూడ ప్రదర్శించిరి.

ధర్మజాదులు ఒడంబడిరి. ధర్మజుఁడప్పుడు శోకమూర్ఛితుఁడై నాఁడు. ధర్మజుఁడు శోకమూర్ఛితుఁడగుటకు కారణము – "సామ్రాజ్య భోగములనుభవించు తాము ఇంతటి దీనావస్థ నుంటిమని కాదు. అరణ్యములఁ పాలైతిమని కాదు. కడుసుకుమారి యగు ద్రౌపది హోరవిపినములందెట్లు సంచరింపఁగలదను వ్యథచే కాదు, ఇంతటి అనురాగమును ప్రదర్శించుచు వెంబడించు ప్రజల నెట్లు పోషింపఁ గలము" అని ఇష్టమృష్టాన్న భోజనములు గావించు బ్రాహ్మణులు తమ్ము వెంబడించి శాకాశనులై యుందురే యని! అద్దానినెట్లు చూడ, నోపుదుము" అని ధర్మజుఁడు మూర్ఛితుఁడైనాఁడు.

రాజులెంతటి కర్తవ్య పరాయణులు! ఎంతటి దయామయులు! ప్రజలెంతటి అనురాగ పూరితులు.

కడకు ధౌమ్యుని యాదేశమును, బడసి ఇష్టి వారిని భుజింపఁ జేయుటకై సూర్యోపాసనము గావించి ధర్మజుడు అక్షయ పాత్రను, బడసినాఁడు. ఆ ప్రజారంజకుని నామము సార్థకమైనది.

ఈ నాఁడు ప్రజాస్వామ్యము కదా! ఈ నాఁటి – ఎందరు ప్రజా ప్రతినిధులు అంతటి నిస్స్వార్థభావమును ప్రదర్శింపఁగలుగుచున్నారు?

ఎందుకు ప్రజా ప్రతినిధి - ముఖ్యులు ప్రజల కొఱకై ప్రజల రాజ్యమునేలి ప్రజల మనస్సును చూఱఁగొన గలుగు చున్నారు.

అది పేరునకు రాజరికము కావచ్చును ప్రజల కొఱకే ఆ రాజులు తమ శక్తులను (ప్రభు, మంత్ర, ఉత్సాహ) బండారమును వెచ్చించెడి వారు! ప్రజల మనస్సును సంపూర్ణముగా ఆకర్షించెడి వారు ఆరాజులు ధన్యులు! ఆ ప్రజ ధన్యమైనది.

ఈ విషయమున సంస్కృత భారతము నించుక పరిశీలింతము.

ధర్మరాజును యువరాజుగా చేయుగోరి ధృతరాష్ట్రుఁడు ప్రజల కోర్కెలను గూడ మనమునందుంచు కొనెను

ధర్మరాజు ప్రజల రంజింపఁజేయు చున్నాఁడనియే యువరాజును గావించెను.

'ధృతి స్థైర్య సహిష్ణుత్వా దానృశంస్యాత్త థార్జవాత్ భృత్యా నామను కంపార్థం'

ధృతి, స్థైరములు - సహిష్ణుత్వము - సాధుత్వము ఆర్జవము భృత్యుల అనుకరింప కొఱకు-

నన్నయ ధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరుని రాజ్య భార ధురంధరునిగా గుర్తించినాఁడు భీష్మ విదురులతో నాలోచించి యౌవ రాజ్యాభిషిక్తునిఁ గావించెను.

నన్నయ కాలమున - యువరాజును చేయుటకు ప్రజాభిప్రాయ మక్కఱ లేదు.

సంస్కృత భారతము వ్రాయఁబడిన దినములలో ప్రజల యధి కారమును గుర్తెంగి - చతుష్పథములందును తమ అభిప్రాయమును నిస్సందేహముగా వెలి బుచ్చుచుండిరి,

రాజులను చేయుటకు, వారిని సింహాసన భ్రష్టులను గావించుటకు వారి కధికారము కలదు.

పాండురాజు మరణించినాడు. ధృతరాష్ట్రుడు—తన కుమారుఁడైన దుర్యోధనుని కాదని యుధిష్ఠిరుని రాజుగా చేయఁగోరుచున్నాఁడు.

వ్యాస భార. ఆది. జతుగృహ

"గుణై స్సముదితాన్ దృష్ట్వా పౌరాః పాండుసుతాంస్తథా
కథయాం చక్రిరే తేషాం గుణాన్ సంసత్సు భారత
రాజ్య ప్రాప్తించ సంప్రాప్తం జ్యేష్ఠం పాండు సుతం తథా
కథయంతిస్మ సంభూయ చత్వరేషు సభాసు చ
తే వయం పాండవ జ్యేష్ఠ తరుణం యుద్ధశీలనమ్
అభిషిఞ్చామ సాధ్వద్య సత్య కారుణ్య వేదినమ్"

చత్వరములందు సభలందు పౌరులు పాండుసుతుల గుణగణములను పొగడుచుండిరి. కనుక ధృతరాష్ట్రుఁడు పాండవ జ్యేష్ఠుని యువరాజునుఁగావింప నిశ్చయించినాఁడు.

మూలములో ఇంత విస్పష్టముగా నున్నను — నన్నయ పౌర సభలను గుఱించి ఏమియును చెప్పడు. ఆ సభలెటువంటివో ప్రజలకును తెలియుపదేమో!

నన్నయనాఁటి ప్రజలు — రాజుల సింహాసనము నెక్కించుట పదభ్రష్టులను చేయుట తమ అధికారముగా భావింపలేదు.

పౌరాను రాగములేని రాజ్యము సాగదని తెలిసి యేదుర్యోధనుఁడు లోలోపల ప్రజలను తిట్టుచు దానములచేతను సన్మానములచేతను — ప్రకృతి జనముల సంతోష పెట్టుచుండువాఁడు.

వ్యాస భా ఆది. జ. 4 శ్లో॥

"శృత్వా తాని వాక్యాని—

యుధిష్ఠిరాను రక్తానాం పర్యత్ర ప్యత దుర్మతిః"

"పౌరాను రాగ సంతప్తః" అని సంస్కృత భారతము. 9శ్లో

రాజులను ప్రతిష్ఠించుచుండిరి. తీసివేయుచుండిరి అంతటి శక్తి గలవారు కనుకనే — ఆ కాలపు ప్రజలు రాజులను తీవ్రముగ విమర్శించుచుండిరి.

ఏకచక్రపుర నివాసియగు ఒక పేద బ్రాహ్మణుఁడు బకాసురునకు ఆహారము పంపుటకు తనవంతు వచ్చినపుడు శోకించుచు రాజును నిందించును.

"ఉపాయం తం నకురుతే యత్నాదపి సమందధీః" అని ఆ రాజును మందబుద్ధిగా ఉపాయమును కూడ ఆలోచింపని వానిగా నిందించు చున్నాఁడు.

"ఏతదర్థా వయం నూనం వసామో దుర్బలస్యయే" అని "రాజానాం ప్రథమం విందేత" అని దుర్బలుఁడగు రాజు పాలనమున బ్రదుకు చున్నారమని, రాజును మొదట తెలిసికొన్నచో ప్రజా పాలన మర్థమయి పోవునని నిందించుచున్నాఁడు.

ఇట్లు అసమర్థుఁడగు రాజు రాజ్య పాలనమున ప్రజలు తమకు కీడు కలిగినపుఁడు రాజును నిందించుచున్నారు

మఱొక ఘట్టము—

ధృతరాష్ట్రుని నియోగమున పాండవులు జననీ సహితులై వారణా వతమునకు పోవసమకట్టినారు. రథములధిష్ఠించిరి. ధనుర్ధారులయి హస్తిపురమునుండి వెడలుచుండిరి.

ఆ పురమునందలి బ్రాహ్మణ క్షత్రియాది ప్రముఖ జనములనేకులు గుమిగూడిరి. శోక సంతప్త హృదయులై, పితృ పితామహ క్రమమున భరింపఁబడిన రాజ్యమిది! క్రమాగతమగు ఈ రాజ్యమున-పాండవుల జ్యేష్ఠుఁడు - భరత కులశ్రేష్ఠుఁడు అగు ధర్మజుని - రాజు గావింపక ధర్మము తప్పి వృద్ధరాజు ఎందులకు పంపుచున్నాఁడో!" అని విలపించిరి.

'ఈ పార్థుఁడు అరుగు చోటకే మనము వెళ్ళుదము అతఁడుండు చోటనే యుండుదము ఇందుండనేల" యని పౌరులందఱును తరలిరి.

ప్రియ పూర్వకమగు వచనములతో తన వెంట వచ్చువారిని ధర్మజుఁడు వారించినాఁడు.

320.0954
30?00 G?OD

'పితృ వచనము సేయకుండుట ధర్మవిరుద్ధమ"ని 'అందులకై వారణా వతమునకు పోవుచున్నార"మని అందఱిని ఓదార్చి - వారించి నాఁడు.

ACC NO. 12214

ఇట్లు - దుర్యోధనునకు భయపడక - ధృతరాష్ట్రుఁడేమను కొనునో యని వెనుకాడక - ప్రజలు ధర్మజాదులను వెంబడించిరన ఆ నాఁడు ప్రజలు రాజులపై ఎంతటి స్వాతంత్ర్యమగు అభిప్రాయములను వెల్లడించు చుండిరో తెలియుచున్నది తమకు - అధర్మమని తెలిసిన దానిని ప్రజలు నిర్భయముగ వెల్లడించుచుండిరి. ఆ అధర్మమును వారించుటకై దేశము వదలి పోవుటకును సంసిద్ధులగుచుండిరి అంతటి ధర్మ ప్రియులు ప్రజలు. వారికి ధృతరాష్ట్రునిపై కోపములేదు. దుర్యోధనునిపై ఏహ్యభావము లేదు. వారొనర్చునది అధర్మమని - ఆ అధర్మముపై క్రోధము - ఏహ్య భావము కలిగినది "పాపమును ద్వేషించుము పాపిని కాదు" అనునది ఆ నాఁటి ప్రజల సిద్ధాంతము.

భీముఁడు దుర్యోధనుని - గదా యుద్ధమున - ధర్మవిరుద్ధముగా నాభికి క్రింది భాగమున కొట్టి చంపినాఁడు.

బలరాముఁడిట్టి యధర్మమునకు కోపించినాఁడు అప్పుఁడు, శ్రీ కృష్ణుఁడాతని సన్నుయించి — ప్రభువులకు ప్రతిజ్ఞ నెఱపుట పరమ ధర్మము. దుర్యోధను తొడలు భగ్నమొనర్తునని సభలో ప్రతిజ్ఞ గావించెను. మైత్రేయుని శాపమొకటి ఫలింపవలసియున్నది. కనుక తన్నుఁగాచికొనుటకు నాభికి దిగువ కొట్టినాఁడు" అని సమర్థించు కొనినాఁడు. అంతటితో నాగలేదు.

ప్రజలు—అధర్మయుద్ధమని తలంతురేమోయని సందేహించినాఁడు. లోకి రాజుల మనమునందును ఈ అధర్మము నిలిచి పోవునేమో యని భీతిల్లినాఁడు.

ఎల్లరను కలయంగనుఁగొని—

"ఈ దురాత్ముఁడు దయలేక సతిమానభంగము గావించినవాఁడు. తండ్రి పాలఁడగిన ధర్మజునకు నిరాకరించినాడు. విదురాదులు చెప్పినను వినఁడు తగినంత భూమిని ఇయ్యఁడు. అని యాతని దుష్కృత్యములనెత్తిచూపి ప్రజల మననమునుండి "అధర్మయుద్ధనుమ" టను తొలగించుటకు ప్రయత్నించినాఁడు.

కనుక, ప్రజలకు వెఱచి అన్యాయములు గావింపనను భయ పడువారు. చేసినను అది న్యాయమే యని సమర్థించుకొనుటకు కృషి సలుపువారు.

ఇట్లు ప్రజల విమర్శలకు భయపడు రాజులు తప్పక న్యాయ మార్గమునందే సాధ్యమయినంతవఱకు ప్రవర్తించెడివారని నిర్ణయింప వచ్చును.

ధర్మ శాస్త్రములచేత—విధింపఁబడిన పన్నుమాత్రమే రాజు ప్రజల నుండి గ్రహింపవలెను. ఈ నియమమునకేమాత్రము పన్ను అధికముగ

తీసికొనవలసి వచ్చినను — రాజు పౌర జానపదుల సమ్మతిని, బడయు వలెను. పరిస్థితుల నెఱుక పఱుపవలెను కనుక రాజు అర్థార్జనము నందు కూడ ప్రజల యంగీకారమును బడయవలసి యుండినది.

ధర్మజుఁడు రాజ్యపాలనము గావించుచున్నాఁడు. ధృతరాష్ట్రుఁడు నూఱుగురు పుత్రులను కోల్పోయినాఁడు. గాంధారితోపాటు కొంతకాలము ధర్మజునింట నున్నాఁడు. ధర్మజుఁడాతనికి సకల సౌకర్యములను సమకూర్చుచున్నాడు. వైరాగ్యము వహించి కొంతకాలమునకు ధృతరాష్ట్రుఁడు వనవాసమునకు పోవనిశ్చయించినాఁడు. తపోవనమునకు ఈ ఘట్టము పోవుటకును ప్రజల యనుజ్ఞ పొందువారని తెలియఁ చేయుచున్నది.

ధృతరాష్ట్రుఁడాశ్రమమునకు పోవుచున్నాఁడని విని సమస్త నగరము సమావేశమైనది.

ఆ నగర జన ప్రకారము నుద్దేశించి—

"మిమ్మును కురు రాజులును పెద్ద కాలమన్యోన్యముగా నుంటిరి. అధిక స్నేహముతో ప్రవర్తించితిని. నేను వృద్ధుఁడనైతిని. వనమున కేగుచున్నాఁడను, అనుజ్ఞయిందు" అని అడుగుచున్నాఁడు.

సర్వజనులు అశ్రుపూరిత నయనులైరి. గద్గద స్వరముతో దుఃఖ పూరితులైరి. ఆర్తితో నేడ్చిరి.

ధృతరాష్ట్రుఁడప్పుఁడు తమ వంశ పాలకులను గుఱించి తెలుపుచున్నాఁడు. "ప్రజలారా! మాది భారత వంశము. మొట్ట మొదట మా వంశమున శంతనుఁడు ప్రజలను పాలించెను. అనంతరము శాంతనవునిచే రక్షితుఁడై విచిత్రవీర్యుఁడీ ధాత్రినేలినాఁడు. వారి పాలనలో మీరు ప్రీతులై గడిపితిరి.

అనంతరము పాండు నరపాలుఁడు భూమిని రక్షించెను. మీరు ఆనందముతో నుంటిరి. అనంతరము ధర్మనందనుఁడు రాజైనాఁడు. అది మీరెఱింగిన విషయమే! "అని తమ వంశమున పూర్వులెట్లు ప్రజానురంజకముగా పాలించిరో తెలిపినాఁడు ఇచ్చట తన పరిపాలన గురించి తడపలేదు. పాండవులరణ్యవాసము – అజ్ఞాత వాసము గావించినప్పటి పాలన దుర్యోధనునిది. దానిని వివరింపలేదు. అతఁడు ప్రజల నుండియే తన పరిపాలన – దుర్యోధనుని పాలనల గురించి తెలిసి కొనఁగోరుచున్నాఁడు. కనుకనే" ప్రజలతో నిట్లు పలుకు చున్నాఁడు.

"ఈ ధర్మజుఁడు సత్య ధర్మ నిరతుఁడు. ఇతని ననుసరింపఁక అన్యాయమాచరించి నా పుత్త్రుఁడు దుర్యోధనుఁడిలను పాలించినాఁడు. కులనాశకుఁడైనాఁడు. వాని దుశ్చేష్టలకు మూలము నేనే కదా!

మహిని లెస్సఁగా పరిపాలించిన మహితగుణులు – అన్నయని కొడుకని, మనుమండని నా హితము కోరి – కరుణతో అనుజ్ఞయిండని సద్గతమునకై అరణ్యముల కేగుదును అని తాను గొప్పవాఁడు కాకున్నను – భూమిని చక్కఁగా పరిపాలించిన పాండురాజు, విచిత్రవీర్యుఁడు, శంతనుఁడు – వీరి ముఖము చూచియైన మంచి మనసుతో పంపఁ గని యర్థించుచున్నాఁడు.

"ఈ యుధిష్ఠిరుఁడు మహనీయ విభవ సమగ్రుఁడు. దిక్పాలక మధ్యభాగుఁడగు నింద్రునివలె – తమ్ములమధ్య వెలుగుఁచున్నాఁడు. ఏమిటికని ఏమఱక ఇతని పాదవి ప్రీతితో మెలఁగుఁడు. ఇమహాత్ముని భావసిద్ధిత పెక్కుతెఱఁ పెక్కుభంగుల తన పరిపాలనచే మీకు ప్రీతి గలిగింపఁ గలఁడు" అని ధర్మజుని మహిమను ప్రజాపాలనా సామర్థ్యమును ఉగ్గడించినాఁడు.

క॥ తరయ నెన్నండైనను
మీరలు నా కెగ్గుగాఁగ మెలఁగుట లేదో
పౌర వరులార నన్నున్
గారవమున ననుపరయ్యా కాననమునకున్" అవి
యర్థించినాఁడు.

భార. ఆ|శమ 1వ 94 ప.

ఇచ్చట – |పజలు – శాసన కార్యమునాచరించు చుండిరేమో యని సందేహము కలుగుచున్నవి.

అనఁగా – |పభువును రాజ్య ౨న కెక్కించుటకు వీరి సమ్మతి బడయవలెను.

|పజలకు భయపడియే దుర్యోధనుని కాదని ధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరుని యువరాజును గావించినాఁడు.

|పజలు యుధిష్ఠిరాదులు–అరణ్యమునకు పోవునపుడ ను-వారికి జరిగిన అన్యాయము నోర్వక వారిని వెంబడించుటకు ద్యుక్తులైరి.

"క్షత్రియస్య పరోధర్మః |పజానామేవ పాలనమ్"

అని ఆ రాజులును |పజాపాలనకై తమ ధన, మానము లనుపయోగించు చుండిరి. ఆ నాడు |పజాబలమున్న నెంతటి కార్యమునైనను చేయ వచ్చునని రాజుల అభిప్రాయములు.

|పజలు ధృతరాష్ట్రుని యభ్యర్థనము విని ఉత్తరీయము లతో వదనముల కప్పుకొని ఏడ్చిరి

విప్రులలో శంబువను వానితో తమ అభిప్రాయములుగా నాఁడ వలసిన పలుకులు తెలిపిరి.

అప్పుడు – శంబువను విప్రుడు – ఇట్లు తెలుపుచున్నాడు. "పౌరజనులు తమ సమ్మతిని తెలుపుచున్నారు. పౌరజనులు తమ మాటగా నన్ను చెప్పమనిరి" అని వారి మహోన్నత వంశమును – వంశపాలనను గుఱించి పొగడినాడు.

"వెదకినను మీ మహావంశమున మహీవిభుల ఒప్పమి కానరాద"ని ప్రశంసించినాడు.

"మీ భరత వంశమునందలి ప్రతిభూ నాయకుడు ప్రజలను కన్న బిడ్డలవలె రక్షించినాడ"ని పలికినాడు.

"దుర్యోధనుడు చేసిన అనర్థమొక్కటియులేద"ని దుర్యోధనుని పరిపాలనను గూడ ప్రశంసించిరి.

"ధాత్రిని శంతనుడెట్లో–విచిత్రవీర్యుడెంత చక్కగా పాలించెనో పాండురాజెంత జనరంజకుడయ్యెనో – రారాజును అంతే – ప్రజలను సంతసమగునట్లు పరిపాలించినాడు" అని దుర్యోధనుని పాలనను – భరతవంశ శ్రేష్ఠులతో పోల్చినాడు.

ధృతరాష్ట్రుడు ప్రజలవలన ఆశించిన పొగడ్త ఇదియే! ప్రజలు– యథార్థమును పలుకుటలో వెనుకాడరని అతనికి తెలియును. అందు అందులకే ప్రజాభిప్రాయములను వారినుండియే రాబట్టుచున్నాడు. ప్రజాభిప్రాయమును శంబువు తిరిగి ఇట్లు చెప్పుచున్నాడు.

"నీ యందు – దుర్యోధనునియందు తగ్గులేదు. విధిప్రేరణమున భీష్మాదులొకవైపు – భీమాదులొకవైపు పోరు సలిపిరి. దాన అఖిల క్షత్రియ నాశము సంభవించినది. [illegible]యొక్క దుర్యోధనుని వలననే కాలేదు కదా! రాజులకు రణముత్తమ ధర్మము. ఆ రణ మరణము సుగతిని చేకూర్చునది" అని ఆ కురుక్షేత్ర యుద్ధమునకు దుర్యోధనుడొక్కడే బాధ్యుడు కాడని విధి ప్రేరణము కొంత – ఇరువైపులవారు కొంత బాధ్యులని స్పష్టముగా తెలిపినారు ప్రజలు.

తమ భవిష్యత్తును గురించి బాధపడవలదని తెలియఁజేయు చున్నారు బ్రాహ్మణుని ముఖమున—

"ఇఁక మీఁద పాండవులు మాకు రక్షకులు.

తే॥ స్వర్గమైనను పాలింపఁజాలువారు
వీరలకు భూమి పాలన విధియనంగ
నెంత పని వీరి చేతికి నిచ్చితిప్పుడు
మమ్ము నెల్లి విధంబుల మనిచి తధిప!

ఆశ్రమ భారత ।, 102

యని పాండవులకు తమ పాలనా బాధ్యత నప్పగించి నందులకు సంతోషమును ప్రదర్శించిరి. ఇఁక ధర్మజుఁడు తమకు ప్రభువు, అతని గుణ గణములను తెలుపుచున్నారు.

"ధర్మపుత్త్రుఁడు దీర్ఘదర్శి మహోదాత్త స్వభావుఁడు బంధు రక్షణ పరుఁడతఁడు. శత్రువులపైనను మిక్కిలి కృపను ప్రదర్శించు వాడు భావ సంశుద్ధి — ప్రతిభ — సువ్రతము — ఇవి యితనికి వెన్నతోఁబెట్టిన విద్యలు. తమ్ములందఱును సన్నుతికెక్కిన ధీరులు, గుణ గరిష్టులు, దేవవిషయములగు సమంచితాగ్రహారములను — సజ్జనుల మాన్యములను గ్రామములను రక్షించుటలో సమర్థులు. ధర్మజునిపై రాజ్యతంత్ర భారమిడి మనమున నూఱడుము. నీయిచ్చను సలుపుము" అని తమ రాజును ప్రశంసించి ధృతరాష్ట్రునకు వనమున కేగుటకు అనుజ్ఞనిడిరి రాజులు వనమున కేఁగినను — ప్రజానుమతి బడిసియే యేగుగెవారని తెలియుచున్నది.

కురుక్షేత్రయుద్ధము ముగిసినది పాండవులకు విజయము చేకూరినది. ధర్మజుఁడు సభ తీరియున్నాడు. అప్పుఁడు చార్వాకుఁడను రక్కసుఁడు త్రిదండి వేషమున విప్రుల మధ్యనుండి సభయందులేచి ధర్మజుని నిందింపఁబూనినాఁడు.

"ఇతఁడు జనకుఁడని, భ్రాతృ పుత్త్రుఁడని శంక యొకింతుక లేక సద్గురుఁడను గౌరవములేకసర్వులను చంపిన వాఁడు. ఇతనిని రాజని కొలువ వలెనా!" అని నిందించినాఁడు.

అప్పుఁడు విపులందఱును వ్యథితాంతః కరణులైరి-ఒండొరుల మొగంబులు చూచుకొనిరి. ధర్మనందనుఁడు లజ్జావనతవదనుఁడైనాఁడు. వారలకు కేలు మొగిడ్చి ఫాల భాగమున గదియించినాఁడు-

"మిమ్ము మ్రొక్కి వేఁడుచుంటిని, ధిక్కరింపక ఆదరింపుఁడు. ముని సమూహానుమతుండనై యిచ్చటికి వచ్చితిని." అని పలికినాఁడు.

ఇది యా నాఁటి రాజకీయ స్థితి.

రాజైనవాఁడు మునిజనుల అనుమతిని బడసియే సింహాసనము నధిష్ఠించువాఁడు బ్రాహ్మణాభి ప్రాయములను సేకరించువాఁడు - బ్రాహ్మణులను ఆ నాఁటి శాసన కర్తలుగా స్వీకరించువాఁడు.

కనుక రాజులు - అనఁగా రాజ్యమునందలి కార్యనిర్వాహక వర్గము - బ్రాహ్మణులకు - అనఁగా శాసనకర్తలకు లొంగియే అధికారమున ప్రవర్తించెడివారు.

అప్పుడు-ఆ సభయందలి భూసురులు భయసంభ్రమ భరితులైరి.

"దేవా! ఈ వాక్యములు మా వలన పుట్టినవికావు. నీ వుత్తమ కౌత్త్రి ధర్మమున సముపార్జించిన యుజ్జ్వల శ్రీ సుస్థిరతను బొందుఁగాతమ"ని యాశ్వాసించిరి.

చార్వాకుఁడు దుర్యోధనుని సఖుఁడని తెలిపిరి. అతని హితమునుఁగోరి ఈ దుర్వచనము లాడెనని, ఈ కుక్క మొఱిఁగినంత మాత్రమున పాలమున్నీరుఁబోలిన పరిశుద్ధుఁడవగు నీవు కలఁగనేలయని ఆశ్వాసించిరి.

"ధర్మాత్ములగు తమ్ములు పనుపు సేయఁగా పూజ్యమగు సామ్రాజ్యమును వహింపుమ"ని యాదరించిరి.

ఇట్లు బ్రాహ్మణుల అంగీకారమే వీరి కార్యనిర్వహణకు ఆమోద ముద్రవంటిది. బ్రాహ్మణుల ఆశీర్వాదము, మునీశుల ఆదరము – వీరి కార్య నిర్వహణకు ప్రోత్సాహకములు.

కృష్ణుని నిర్యాణానంతరము—
మహా ప్రస్థానికమున – పాండవులు –

పరీక్షిత్తునకు రాజ్య తంత్రపు తెఱంగును ఎఱుక పఱచిరి. రాజ్య తంత్రమును నడపు తీరును వివరించిరి. రాజును గావించిరి. పౌర జానపద ప్రవర జనముల రావించి కృపాచార్యున కప్పగించిరి. ఆ పార్థ పౌత్రుని ప్రజలకుఁ జూపి "మాయేపురకు తగ నడపుఁడు. అను రక్తితో సేవింపుఁడు" అని అర్థించిరి. ఇట్లు రాజగుటకు ముందు ప్రజల అంగీకారమును గ్రహించెడి వారు.

ప్రజలప్పుడు "మీరిట్లు మమ్మువదలి వెడలుట సముచితమా" యని ప్రశ్నించిరి.

ఈ విధముగా రాజులు – ప్రజాభిప్రాయమున కనుగూలముగవో వారిని నయమున నంగీకరింపఁజేసియో-తమ వారసులను రాజ్యాభిషిక్తుల గావించుచుండెడి వారు

పాండవులు – మహాప్రస్థానము గావింప నుపక్రమించినప్పుడు పౌర జానపదులు ఆ బాల వృద్ధముగా వెంబడించిరి.

కొందఱి తనవులు తూలి పోవు చుండినవి. అయినను నడచుచునే యున్నారు. కృప ధౌమ్యాదులును వెంబడించిరి. పరీక్షిత్తును వెంబ డించెను. కృప, ధౌమ్యాదులు వారిని తగు విధమున అనునయించి,

చిత్తములందు అంగీకరింపఁజేసి తిత్తిగ్రిప్రాసులలో చేర్చిరి. కార్యము లందు త్యాకులగునట్లు గావించిరి.

అప్పుఁడు హస్తినాపురము సంపత్పూరి భరితమయినది. ఇట్లు ప్రజలు విముఖులు, అనాసక్తులు గాకుండ అనునయించుట గలదు. ఇది రాజ తంత్రమా! స్వాయంభూతమా! ప్రజా తంత్రమా!

భారతీయుల దృష్టిలో రాచరికము ప్రజాతంత్రము. రాజును సింహాసన మెక్కించుటకు దింపుటకు అధికారముకల వారు ప్రజలే. రాజు జన్మ ననుసరించి — రాజ్యమునకు వారసుఁడు కావచ్చును. కాని — ప్రజల కర్తఁడు కాఁబట్టనిచో వారతనిని తొలఁగించుటకు ప్రయత్నింతురు. బహిరంగముగా అతని పరిపాలన వలదని ప్రకటింతురు. లేకున్న తామైన అచ్చటినుండి వెడలి పోవుటకు ప్రయత్నింతురు ఇట్టి సన్నివేశములు భారతమునందనేకములు కనిపించుచున్నవి.

రాజులు తమలో తాము ద్వేషించు కొనినప్పుడు — వారిలో అన్యాయము గావించిన వారిని ముఖముమీఁదనే యడుగుచుండిరి.

రాజులును అనుకూలము ప్రజా రంజనమే తమకు కర్తవ్యముగా ప్రజలకు భయపడి రాజ్యపాలన గావించుచుండిరి. తమలో తాము ద్వేషించినను — ఆ ద్వేషమును ప్రజలపై చూపుట లేదు.

ఆ నాఁటి రాజరికము —ప్రజాతంత్రమను పేరులేని ప్రజాతంత్రము, రాచరికముకాని రాచరికము, ప్రజాభిప్రాయములను గొని పురోగమించిన రాజ తంత్రము.

కనుక ఈ నాఁటి ప్రజా స్వామ్యమునకు బీజము బునాది — ఆ నాఁడే రాజరికమున చోటు చేసికొని యుండెననిన అతియోశక్తి కానేరదు.

వేగులు :—

ఆనాటి రాజులు చారచక్షువులైయుండిరి. చారుల ముఖమున రాజ్యము నందలి సర్వ విషయములను గుర్తించుచుండిరి. ఈ విషయమును కొన్ని ఘట్టములనుండి పరిశీలించెదము గాక!

అజ్ఞాతవాస మొనర్చుచుండిన ధర్మజాదుల యునికిని తెలిసికొని రండని దుర్యోధనుఁడు చారులను పంపినాఁడు. చారులు వారి జాడ నెందును గానక వెనుతిరిగి వచ్చిరి. వచ్చి యందఱును తమ సంకేత స్థలముల కలిసి కొనిరి. కలిసి — ఖేదముతో సదుర్యోధన గరమును ప్రవేశించిరి.

వారు దుర్యోధనునితో నిట్లు తెలుపుకొనుచున్నారు.

పొదరు పొదరు, పల్లియ పల్లియు, గ్రామను గ్రామను—దుర్గమయగు చోటులు, దొనలు, గుహలు — అంతటను అరసితిమి. ఒక యెడ రథముల చొప్పు కనపడ దానిని వెంబడించితిమి. అవి ద్వారక చేరినవి. అచ్చట పాండవులుందురని పెక్కు చందముల పరిశోధించితిమి. సారథులు మాత్రముండిరి. కాని పాండవులను కానమైతిమి.

సమస్త దేశములు గ్రుమ్మరితిమి; పాండవుల పాడ కానరాదు. మాకుఁజూడ పాండవులు రూపు మాసిపోయిరని తోచుచున్నది. అయిన నొకవింత కంటిమి—

మత్స్య దేశాధీశుని మఱఁదియగు కీచకుని- ఒక వనిత కారణమున నడురేయి గంధర్వులతి రహస్య ప్రకారమున చంపిరఁట! అదియు ఆయుధములతోఁ గాదు! శిరము, కాలు సేతులు — డొక్కలోనికి జొనిపి చంపిరట! అతని తమ్ములనందఱిని చిత్రగతిని చంపిరి. విరటుఁడు మీకు శత్రువు, కనుక అతనికి కలిగిన వ్యసనము నెఱిఁగింప వచ్చితిమి" అని తెలిపిరి. అప్పుడు రారాజు వారలను పొనంపి చింతాక్రాంతుఁడై మంత్రులతో— "పాండవులు ప్రతిజ్ఞ నెరవేర్పకముందె

వారిజాడ తెలిసికొనవలెను తిరిగి అరణ్యములకు పంపవలెను. వారిని కనుగొనుట కష్టసాధ్యము" అనెను. వారిని కనుగొనుటకు వివిధ దుర్నిరూప వేషములతో సర్వ దిశలందు నిపుణులను పంపుదము. వారెల్లి నేఁటిలో నెఱుఁగ బడుదురని" కర్ణుడు పలికినాఁడు. ఇట్లు వేగులు వివిధ కార్యములందు నియోగింపఁ బడువారు. వారు తెచ్చిన వార్తలను శ్రద్ధతో రాజులు పరిశీలించువారు. వారికి కొన్ని సంకేతములును అందుచుండినవి.

ఇట్లు ఆ నాఁడు రాజులెంత స్వతంత్రమగు అభిప్రాయములు గలవారైనను ప్రముఖములగు సమస్యలను పరిష్కరించు నిమిత్తము వేగులలను వార్తలను గ్రహించి ప్రధాన పురుషులతో చర్చలు జరిపి వారి అభిప్రాయములను గ్రహించి కార్యోన్ముఖులగువారు.

అప్పుఁడు భీష్ముఁడొక సూచన నిచ్చినాఁడు.

"ధర్మజుఁడున్న చోట గోధన మభివృద్ధి చెందియుండును పాడి సమృద్ధిగా కురియుచుండును. కావున నిప్పుడట్టి దేశమెయ్యదియో వెదుకవలెను'' అని

కృపాచార్యుడు "పాండురాజ సుతులు బాసనేరవేర్చి వచ్చుచున్నారు. వారు వచ్చి కయ్యమునకు కాలుద్రువ్వకున్న యెడల సంధిచేయుట తగును'' అని తన అభిప్రాయమును సూచించినాఁడు.

ఇట్లిందఱి యభిప్రాయములను కనుగొని – తగ విచారించి – కురునందనుఁడు – కార్యము తెగువఁజూచి యిట్లనెను.

"భీమసేనుఁడు, సింహబలుఁడు (కీచకుఁడు), శల్యుడు, హలధరుడు – ఈ నలుగురును సమాన బలములు గలవారు.

వాయునందనుఁడొక్కఁడే సింహబలుని గర్వమును మాన్ప గల వాఁడు. ఆ సింహబలుఁడు చంపబడినాఁడు. కనుక తప్పక వాయు నందనుఁడచ్చట ఉండి యుండును. ఆ సతి ద్రౌపది కాఁబోలు! మఱెవ్వరును కీచకుని యుద్ధమునందు ఓర్వఁజాలరు

గంధర్వులనునది నెపము మాత్రమే! అంధకారమున అనిల సుతుఁడే వారిని సబాంధవముగ చంపి యుండవచ్చును.

పితామహుఁడుపదేశించిన లక్షణము లన్నియును ఆదేశమునందే గలదని విందుము పాండవులు విరటుని నగరమున ప్రచ్ఛన్న వేష ధరులై వసియించినవారు కావలయును.

అతనిపై నెత్తిపోదము, ఆ విరటుని గోధనములను గ్రహింతము. అప్పుఁడచ్చట — పాండవులున్నచో — ధర్మజుఁడు అతని తమ్ములు వచ్చి యడ్డుపడుదురు. వారి సమయ భంగమగును మరల పండ్రెండు వత్సరములు వనవాసము సలుపను పంపుదము. ఒకవేళ — కుంతీ నందనులు అచ్చట లేకున్నచో మత్స్యపతి సమస్త వస్తువులను గ్రహింతము. ఎల్ల విధంబుల ఇప్పటికిదియే కార్యము.

"మీ కందఱకును ఇది తగునని పించిన దీని కనురూపమగు ఉద్యోగమును సేయుఁడు" అని పలికినాఁడు.

సుశర్మ — కర్ణ, దుశ్శాసనులతో ప్రసంగించినాఁడు. తాను విరటునిపై దండెత్తుటకు సుశర్మ సిద్ధమైనాఁడు. సైన్యములను రెండుగా విభజింపను నిశ్చయమైనది.

దక్షిణమున గోవులను బట్టుటకు సుశర్మ సైన్యముతో సంసిద్ధుడైనాఁడు.

తక్కిన అతిరథ మహా బలురందఱు ఉత్తరమున గోవులనుఁ బట్టుటకు నిర్ణయించిరి.

ఇట్లు వేగులను పంపుట, ప్రముఖులతో సంభాషించి వారి అభిప్రాయముల సేకరించుట — కడకు ఒక నిశ్చయము గావించి, — ఆ నిర్ణయమున ఆమోద ముద్ర వేయుటకై సభాముఖ్యుల నడగుట అనంతరము కార్య ప్రారంభము.

ఇది యానాఁటి రాజుల కార్యనిర్వహణముల తీరు. ఇట్లు రాజులు చార చక్షువులై కార్యాంశములను పరిశీలించుచుండిరి. కనుకనే అనుట యథార్థం చారులను — తమ రాజ్యమునందు రాజులు సర్వత్ర పంపువారు. శాంతిపర్వమున మందాకినీ నందనుఁడు చారులను రాజుపయోగించు తెఱంగిట్లు చెప్పుచున్నాఁడు.

భార. శాంతి 3-106 ప.

కII కిరణముల భంగిఁ జతురప్ర
బరిజనముల నెందుఁ జొనిపి పరకృత్యంబుల్
నిరతంబును గను గొనుచును
ధరణి కరణి వెలుఁగు చెప్ప ధరణీశునకున్ — అని

రాజు సూర్యుఁడు తనకి రణముల సర్వత్ర వ్యాపింపఁజేసినట్లు చారులను రాజ్యమంతట జొనిపి పరకృత్యములను అనవరతము గమనించు చుండవలెను. అప్పుఁడే రాజు తన పరోక్షము నందలి సర్వ విషయముల నెఱుంగగలఁడు తన పాలనా విధానమును స్వకీయ, పరకీయుల నెఱుంగ గలడు. రాజ్యక్షేమమున కది బాట!

మఱొక ఘట్టము —

దుర్యోధనుఁడు మడుగులో దాగినాఁడు. అది — యుద్ధభూమి. భీష్ముఁడు—ద్రోణుఁడు—కర్ణుఁడు—శల్యుఁడు—సర్వులు మరణించినారు.

దుర్యోధనుఁడు దాగినది తెలియక — ఎచ్చట నుండెనో తెలియక పాండవులు వెదకుచున్నారు.

అనిలసుతుఁడు — వేగులనుగా నియమించిన వేట కాఱులు — మాంస భారములతో పరిశ్రాంతులై జలపానార్థము — ఆ మడువు కడ జేరిరి. అచ్చట దుర్యోధనుఁడున్నట్లు గుర్తించిరి. కృపాదులతోడి సంభాషణచేత లోపల దాగినది దుర్యోధనుఁడే యని నిర్ణయించిరి.

మాంస భారమును, గూడ — అచ్చటనే డిగ్గ విడిచి — భీముని కెఱుక పఱచిరి

అతఁడు మిక్కలి హర్షించి వారికి కానుకలొసంగి పంపినాఁడు. ఇట్టి కార్యములను వేగులు నిర్వర్తించుచుండిరి. అప్పుడు దుర్యోధనుని పాండవులు వెంటనే బయటికి తెప్పించకుండిన-కథ కొంత మార్పులతో సాగెడిదేమో! ఆనాడు — ఆటవికులను — వేట కాండ్రను కూడ చారులనుగా పంపుచుండిరి

శ్రీ కృష్ణుఁడప్పుడు — "మాయలు గల్గు దుష్టులకు మాయపు భంగులె మందుగాక — నిర్మాయతనుల్లసిల్లెడు పరాక్రమలీలలు గొల్చునెట్లు" అని మాయా విధానమున మడుగులో దాగిన దుర్యోధనుని బయటికి రప్పించినాఁడు.

అప్పుడు దుర్యోధనుఁడు ధర్మజునితో—

"ఏ నొంటి సమర మొల్లన"ని నాఁడు. "మహీనాయక! నీక యుర్వినిచ్చితిని ఏలుకొమ్మ"ని నాఁడు.

"శాంతిగా కానలకుఁజని వల్కలములు ధరించి మునులకడ తప మొనర్తు"నని నాఁడు ఇంతలో అతనికి వైరాగ్యభావము పోయి రోషమావేశించినది.

"ఓడివచ్చినాఁడ నుద్ధతి నా కేల
యుడుకు మాని నీవ యుర్వి యేలు
గుఱ్ఱములను, నేనుగులును లేని బయలునీ
తలనెకట్టి కొనుము ధర్మతనయ" యని పల్కినాఁడు.

తానే హితులను, ఆప్తులను. మిత్రులను నమ్మి గర్వించెనో వారు భూమి పాలైరి. అంగరాజు వీరస్వర్గము నలంకరించెను.

భీష్మద్రోణాది వృద్ధులు లేరు. దుశ్శాసనుఁడు రక్తపుమడుగులో దొర్లినాఁడు. తనకు సరిగా ధైర్యము చెప్పువారునులేరు. ఏకాకియైనాఁడు. అశ్వత్థామ యొక్కఁడు మిగిలినాఁడు. ఎంతటి దురహంకారము గల వానికైనను జీవితమున మనస్సు దుర్బలమగు గడియలును రావచ్చునని ఇతని పలుకులు తెలియఁజేయుచున్నవి.

"గుఱ్ఱములు, ఏనుగులు బయలు నీతలనె కట్టి కొమ్ము, ఓడిపోయిన వాడను! నా కెందులకు గర్వము" అని క్షణికమగు వైరాగ్య భావముతో పలుకుచున్నాఁడు. ఈ పలుకులలో ఆవేదన-ఆవేదనతోఁ గూడిన నిరాశ – నిరాశతోపాటు క్రోధము – క్రోధముతోఁ గూడిన వైరాగ్యము ఒక్కుమ్మడిగా ధ్వనించుచున్నవి

అప్పుడు ధర్మజుఁడు పలికిన తీరు—

"నీ దాతృత్వముచే నేను భూదానమునకుఁ దగుట ఒల్లను. రాజులకు దానము పరిగ్రహించుట తగునా! యుద్ధమున నిన్ను హతమార్చియే నేలను పాలింతును" అని క్షత్రియ ధర్మమును స్మరింపఁ జేసినాఁడు.

"నీవు నిజముగా ధరిత్రని యూ నేర్చిన-కురుకులమిట్లు వినాశము నొందెడిదా!" అతని పూర్వపు అహంకారమును, అహంకార ఫలితమును తెలిపినాఁడు.

అప్పుడు దుర్యోధనుఁడు దైన్యముగా "చుట్టు ముట్టి పలువు రొక్కనితో పోరఁదగునా!" అని అధైర్యమును ప్రకటించినాఁడు.

ధర్మజుఁడు అప్పుడు ధైర్యమొసంగి "మా యేవురిలో నీతో గదా యుద్ధ మొనర్పగలవాని నొక్కనిని ఏఱికొనుమ"ని యడిగినాఁడు.

"వానిని చంపినచో మహి యేలుము. చచ్చినచో వీర స్వర్గమును పొందుము" అని పలికినాఁడు.

దుర్యోధనుఁడు భీముని ఎన్నుకొనెను. గదా యుద్ధము జరిగినది దుర్యోధనుని తొడలపై కొట్టి భీముఁడు చంపినాఁడు. ఇట్లు కురు సంగ్రామము ముగిసినది.

వివిధ వేషములతో, వివిధ వృత్తులవారిని రాజులు తమ వేగులనుగా నియమించి తమ కార్యమున సాఫల్యమును పొందు చుండువారు.

వారును తమ కర్తవ్యములను నిర్వర్తించి రాజుల విశ్వాసమును చూఱగొనువారు.

"రాజులు చార చక్షువులు" అనుట ఆ నాటి రాజరికమును పరిశీలించిన – ఎంత యథార్థమో తెలియుచున్నది

••••••••••

రాజు :– ప్రజా సంక్షేమము

బక వచ్చింతయే దర్థాన్
సింహవచ్చ పరాక్రమేత్
వృకవచ్చావ లుంపేత
శశవచ్చ వినిష్పతేత్ మను–7. 106

బకము వలె అర్థములను గుఱించి చింతింపవలెను. సింహము వలె పరాక్రమము ప్రదర్శింపవలెను. వృకమువలె పొంచి శత్రువును చంప వలెను. శశమువలె భ్రమకలుగజేసి బలవదాశ్రయమును పొందవలెను.

మీనము మిక్కిలి చంచలమైనది. దానిని గుఱితో గ్రహించుట మిక్కిలి కష్ట సాధ్యము. అందులకు మిక్కిలి ఏకాగ్రత పరిగణనము అవసరము. బకమెంతటి ఏకాగ్రచిత్తముతో మీనమును గ్రహించునో అంతటి ఏకాగ్రమనస్కుడై రాజకీయ విషయములను రాజు ధ్యానింపవలె. రాజు – ఆయా విషయములను చింతింపవలెను. సింహ పరాక్రమండై – వర్తమాన ఆగామి సమస్యల నెదుర్కొనవలెను. శత్రువులను దండింపవలె.

రహస్యమున శత్రువు యొక్క దేశ గ్రహణార్థములను చింతింపవలెను. వృకమువలె – పొంచి దుర్గాది సంరక్షితుడగు శత్రువును పట్టవలె.

శశము వలె – భ్రమ కలుగజేసి బలవదాశ్రయమును పొంద వలెను.

దుర్గములనేకములు. వానియందు నర దుర్గము శ్రేష్ఠతమము.

ధన్వ దుర్గం మహీ దుర్గం
గిరిదుర్గం తథైవచ
మనుష్య దుర్గం అబ్దుర్గం
వనదుర్గం చ తానిషట్

శాంతి. 88 అధి 4 శ్లో

రాజ్య రక్షణకు – రాజు రక్షణకు దుర్గములు ముఖ్యములు. ఈ దుర్గములలో ముఖ్యము నరదుర్గము. కనుక ఆ నర దుర్గమును రక్షింపవలెను.

- షన — గోకుల — ఆకర - నగ ప్రముఖార్త కర్మములను — అజ్ఞ యిచ్చుటకు అధికారుల పంపవలె. అన్నింట తానే కన్నిడి గమనించు చుండవలె.

వార్తామూలోహ్యయం లోకః
త్రయ్యావై ధార్యతే సదా
తత్ సర్వం వర్తతే సమ్యగ్
యదా రక్షతి భూమిపః

శాంతి పర్వ. 68 అధి 35 శ్లో.

జగజ్జీవనమునకు మూలము వార్త. కృషివాణి — జ్యాదులు "వార్త" అనబడును. వృష్ట్యాది కారణము త్రయి. కనుక "త్రయీ" విద్య జగమును పోషించును. రాజు ప్రజలను రక్షించునపుడే ఈ కార్యములన్నియు జరుగును.

ఈ సమస్త జగత్తు — సుఖ సౌభాగ్యములతో, ధన ధాన్యములతో వెల్లి విరియవలె, అందులకు — "వార్త" మూలము. అనగా కృషి — వాణిజ్యములు, పశుపాలన రూపములగు ధనమభివృద్ధి గావించు సాధనములు "వార్త" రాజు ప్రజలను రక్షించునపుడు — ప్రజలు శాంత చిత్తులైయుందురు. వారు వేదములననుసరించి యజ్ఞ యాగాదు లొనర్పగలరు. ఆ యజ్ఞములవలన పర్జన్యుడు వర్షము కురిపింప గలడు. ఆ వర్షము — కృషికి దోహదము. పశు సమృద్ధికి హేతువు కనుక రాజు పరిపాలన — త్రయీ విద్యకు — త్రయీ విద్య వార్తకు హేతువులై రాజ్యము సస్య శ్యామలముగా వికసింపగలదు.

బండారమును వృద్ధి చేయువిధమును భీష్ముడు ధర్మజునకు తెలిపిన విధానము —

కర్షకులు — వణిజులు — గోరక్షకులు — కోశ మొనగూర్చుతావులు. కనుక ధన ధాన్యములకుత్పత్తి స్థానములగు వీని కెన్నడటికిని హాని

కాకుండా తన బండారమును సమకూర్చుకొనవలెను. రాజు—అపాత్ర దానము చేయరాదు. ధర్మరక్షకై జనించిన వాడు—రాజు, అధర్మముగా ధనము నార్జింపరాదు.

రాజు – ప్రజ చేత తగినట్లుగా అప్పనము గొనవలెను. కప్పము యాఅవపాలు గొనుచు కరుణ గలిగి ప్రజల తండ్రిబోలె మధ్యస్థా చరణమున పాలించుట పరమ పదము.

అట్లు గాక – క్రొవ్వి కామ క్రోధములతో గూడిన చిత్త వృత్తితో తొలఁగ నడచు పతికి ప్రజలు సేయు పాపమున చతుర్థ భాగమబ్బును.

అన్వీక్షకీ, త్రయీ, వార్తా, దండనీతుల యందు రాజ విద్యల యందు ప్రవీణులగు సహాయులతోఁగూడి సర్వ వ్యవహారములను నిర్వహించు రాజు తప్పక మోక్షగామియగును.

స్వరాష్ట్రే న్యాయ వృత్తస్స్యాద్భృశ దండశ్చ శత్రుషు
సుహృత్స్వ జిహ్మ స్స్నిగ్ధేషు బ్రాహ్మణేషు క్షమాన్వితః
మ. 7.23

రాజైనవాఁడు స్వరాష్ట్రమున యథా శాస్త్ర వ్యవహారము గావింపవలెను. శత్రువుల యందు తీక్ష్ణ దండన ప్రయోగింపవలెను. మిత్రులందు కుటిల రహితుఁడై ప్రవర్తింపవలె. బ్రాహ్మణులందు సహనము గలవాఁడై యుండవలె.

అప్పుఁడా రాజు రాజ్యమున – ప్రజలు సంతుష్టులై సర్వ కార్య నిరతులై రాజ్యాభివృద్ధికి పాటు పడగలరు. శత్రువులు భీతులై పలాయితులగుదురు. సామంతులుగా మారుదురు. కప్పములగొని యిత్తురు. మిత్రులు విశ్వాసముతో రాజుననుసరింతురు బ్రాహ్మణులు. శాంతిక పౌష్టికాది కార్యములతో అనవతరము రాజు సమృద్ధినే కోరుదురు.

ఆలస్యము – అసహాయత్వము లేని రాజు సుఖియైయుండును.

ప్రజలకు – తనకు మేలుకోరు రాజు – మున్ను దేవతలను – భూదేవతలను పూజింపవలెను. అనంతరము – ప్రయత్నమొనర్చ వలెను. ఉద్యోగ వంతునకు దైవము తోడ్పడిన కార్యము సిద్ధించును.

సాంగ వేదియగు – పురోహితుఁడెప్పుడును నగరమున మెలఁగు చుండవలెను. కప్పమును – కఠినముగా కొనరాదు. అది క్షీరమునకై గోవు పొదుగును కోయుట వంటిది. పాలు కుఱియించు కొనఁదలచిన వాఁడు-గోవులను మిక్కిలి జాగ్రత్తగా కాపాడును. ప్రజలును గోవుల వంటివారు. వారి నుండి కఠినముగా పనులు గొనరాదని తెలుపు చున్నాడు. భీష్ముఁడు.

రక్ష :– శాంతి పర్వమున భీష్ముఁడు బోధించిన రాజనీతి యందు రాజు గావింపవలసిన రక్షా విధానమును గుఱించి చక్కఁగా తెలుపఁ బడినది।—

రాజు తన్ను గెలిచి పిదప శత్రువులను గెలువవలెను. జితేంద్రియుఁడగు రాజు రిపుల గెలువఁగలడు.

ఆరామాది నిజ సంచారస్థలములను – దేశ సంధులకు – పురి ద్వారములకు – నగరిక – ధరా రమణుఁడు రక్షలొనర్పవలెను.

రాజులు – శత్రులెవరో మిత్రులెవరో ఎప్పటికప్పుఁడు తెలిసికొను చుండవలెను. నిజ భూమియందును – శత్రు ప్రదేశములందును వేగులను నియమింపవలెను.

అనుజ – తనుజ – బాంధవ – అమాత్య – మిత్రులను వేగుల నుంచి వారి భావములను అరయుచుండవలెను. ఒకరికి తెలియక మఱొకరు వేగుల వృత్తిలో స్వరాజ్య పరరాజ్య విషయముల రాజులకు తెలియఁజేయుచుండవలెను.

చోరుల బారి పడకుండ ప్రజలను రక్షింపవలెను. క్రూరులచే చావకుండ చూడవలె. వారలచే పడకుండ కాపాడవలె. తనయులైనను రాజు నమ్మరాదు. నమ్మినట్లు నటింపవలె.

క॥ స్థల ముఖ్యము లయ్యెడు పే
రర్థుల యూళ్లులనెల్ల వెరపుగలిగిన విశ్వా
సులఁ బ్రభుత యిచ్చి భూపతి
నిలుప వలయుఁ వర్ణరక్షణీయత వెలయన్

విశ్వాస పాత్రులనే — ప్రసిద్ధములగు ప్రదేశములందు అధికారములందు నియోగింపనలెను. ఆ విశ్వాసపాత్రులు భక్తి—భయము గలిగి రాజకార్యముల నిర్వర్తించువారై యుండవలె వర్ణ రక్షణము ముఖ్య కర్తవ్యము — కృషి, వాణిజ్యములకు మూలము — పశువుల అభివృద్ధి. కనుక రాజు కాపుల కన్నబిడ్డలవలె కాపాడవలెను.

గణ రాజ్యముల రక్షణ గావింపవలెను.

మన్నెరాజుల మర్దించి — సైన్యమును మెల్లగా కూర్చుకొనవలెను. వైరిపై చనవలయును. ప్రబలుని యాశ్రయించి అతని సేనను తోడుగొని శత్రువును చెఱుపవలయును.

విషము — మంత్రము — యుద్ధము — వీనితో శత్రుని అలయక తెగటార్పవలెను.

పొంచియైన — కలఁచియైన — అంగనలఁగొని వారి మాయలందు తగిల్చియైన — బహువిధోపాయముల ప్రయోగించి పగతుని సాధింపవలెను.

గణ జనుల పాలించు విధానమును భీష్ముఁడు ధర్మజునకు చెప్పిన విధము—

అర్థర్జాకులు – కార్య నిపుణ మానసులు – ఆయుధజీవులు – శేషకార్య నిరతులు అగు జనులు – గణము వారలు. అనగా నిచ్చట మనము – ఒకే విధమగు వృత్తిని గానించువారు ఒక గణము వారు అని పరిగణింపవలెను. రాజైనవాఁడు–ఇట్టిగణము వారిని అన్యోన్యముగా కలిసి మెలఁగునట్లు చూడవలె. వారి మార్గముల నరయుచుండవలె. వారికి ప్రేమ గలిగింపవలె.

ఈ గణమున ఐక్యమత్యము హెచ్చు. ఒకే జాతి వారైనచాలు-తేకువలేక – బుద్ధి – శౌర్యము – పెంపు సరకు గొనక ఎట్టివారితోనైన ఎవ్వరైన మత్సరింతురు. అనగా గణజనులు ఏకమగుదురు. పరజాతి జనుని – ఎంతటి శౌర్యధనుఁడైనను – పెంపు గలవాఁడైనను – బుద్ధిమంతుఁడైనను – ఎదురింతురు. వారి ఐకమత్యమును విడగొట్టుటకై శత్రువులు ప్రయత్నింతురు. అట్లు వారిలో అంతఃకలహములు పుట్టినపుఁడు శత్రువులు కొందఱిని తమ కడకులాగి కొనవచ్చును. కావున ముందు భూపాలుడు వారినందఱిని – తగు వచన రచనచేత – ఈఁగి–మన్ననలతో వారిలో కలఁత రాకుండ చూడవలెను. గణ ముఖ్యు నాదరించుచు పనులు గొనవలెను. వారు తమ్ము బాయకుండ చూడవలెను. వాను పురము వెడలిన పొలుపు దప్పును.

గణ జనులొక్కటిగా మెలగుచున్నప్పుఁడే రాజునకు సంపద. కావుస రాజు గణజనుల ఐక్యతకు పాటుపడుచుండవలెను. ఆప్తులను, దక్షులను కర్మగ్రహణమున నియోగింపవలెను.

రాజు కోటనెప్పుఁడును ఏమఱరాదు, గడ్డి, ఖాణము, కట్టియలు, నేయి, నూనె, ఆయుధములు, ఔషధములు, అఖిల యంత్రములు, కూపములు లోనుగా పదార్థములను – వలయు వానిని సమగ్రముగా సంపాదింపవలె. ఆప్తులగు యోధులను సేకరించవలె.

పగతుఁడలిగి నడచు మార్గమున – తృణకాష్ఠములు ధాన్య తోయములను లేకుండఁజేయవలె

రాజు పరిజనులుగా—ధర్మరతులను — అర్థనిర్మాణ చతురులను. చాంచల్య రహితులను — అలంఘితాజ్ఞులను — సునీతి నిపుణులను - కులజులను కొనవలెను.

సప్తాంగములను సంపూర్ణముగా నడుపవలెను. దానికి అర్థప సత్యములు తాపలములు. అంతటికి దండనీతి విధానము రక్ష

క్షమయు, తేజము, అయ్యాయి కాలంబున ప్రయోగింపనేరని రాజునకు ప్రజానురాగ ప్రతాపములులేవు. అని భీష్ముఁడు తెలిపినాఁడు.

ప్రహ్లాదుఁడు బలీంద్రునకు రాజు విషయము తెలిపిన విధాన మిట్లు పేర్కొనఁబడినది.

ఆ॥ క్షమయ తాల్చి యుండఁ జనదెల్ల ప్రొద్దుఁదే
జంబ తాల్చి యుండఁజనదు పతికి
సంతత క్షముండు సంతత తేజుండు
నగుట దోషమందు రనఘ మతులు భార. శాంతి. ప

నిత్య క్షమాన్వితుండయిన వానికి భృత్యులు వెఱవక అవమానము చేయుదురు. అర్థములందధి కృతులయినవారు ధనము నపహరింతురు, దర్పము సూపుదురు. నిత్యతేజోధికుఁడు అతిక్రూర దండమున సర్వ జన సంతాపము కలిగించును. గృహగతమగు సర్పమువలె నెప్పుడును భయావహుఁడగును. కావున నృపతి దండించు నెడల—అనుగుణముగ దండమాచరింపవలెను. తీక్ష్ణ దండన గావించిన — ప్రజలేగను గనిన పులుగు పిండువలె చెదరిపోవును. కనుక ప్రజలనట్లు భయపెట్టుట తగదు.

దండనలు — నఱకుట — అర్థము గొనుట — చేఱనుంచుట - కట్టి యడిచి—చేదప్పటొందంబనుచుట—ఇట్లు పలు తెఱంగులుగా నుండును.

శత్రువు – బలముల పన్నినప్పుడు తాను బలముతో పోరాడ వలెను. ఒంటిమై సంగరము గోరిన – అదే విధముగా ఆచరించునది. శత్రువు మాయలొనర్చిన తానును మాయలతో గెలుపొందవచ్చును.

"చిల్లియిడిన యాయుధమున్న – విషలిప్తమగు శస్త్రమును" ఎట్టి శత్రువుపైనను ప్రయోగింపరాదు. ప్రయోగించిన నరకము ప్రాప్తించును.

శత్రువులను జయింపవచ్చును గాని, శత్రుప్రజల బాధింపరాదు అట్లు కొల్లగొట్ట వలసినస్థితి కలిగినప్పుడు – దేవగృహ, భూసుర గృహములనైన వదలి వేయవలెను.

ఉత్సాహశక్తి – మంత్రశక్తి – ప్రభుశక్తి వీనియందు శత్రువునకు తనకు గల తారతమ్యము నుపాయముతో గుర్తింపవలెను.

మత్తుని – ప్రమత్తుని – విషయాయత్తుని – దుర్బలుని చూచి అట్టి శత్రువుపై దండెత్తవలెను.

ఉత్సాహము – ధృతి రాజులకుండవలసిన ముఖ్య లక్షణములు శస్త్రజీవిక – అరిషష్ఠ భాగ మాచరించుట – ప్రజావివాదము వినుచోట, నిష్పక్షపాత వైఖరి ముఖ్యము.

"రాజులు వేటకు వెడలుట ముఖ్యము కాదు" అని తెలుపఁ బడినది సప్తవ్యసనములలో "మృగయా" ఒకటి మఱి రాజులు వేటకు వెడలుటలో దోషము లేదనియు చెప్పఁబడినది. కనుక – అతిగా వీనిననుభవించుచు దాసులు కారాదని తెలియుచున్నది. శాంతి పర్వమున భీష్ముఁడు రాజు ఎట్లు హెచ్చరికతో మెలఁగవలెననునది ధర్మజునితో చక్కఁగా వివరించినాడు.

"భృత్యులెల్లప్పుడు కుటిల బుద్ధులు – గలవారు గనుక వారసూయతోఁగూడి కార్యము చెఱుపగలరు. కనుక వారిని గమనించు

చుండవలెను" అని— వ్యాఘ్ర – గోమాయువు కథను ఉదహరించు చున్నాఁడు.

"క॥ వావిరి మాటలఁ దేలఁక
భావమున కీడు మేలు పరికించి యస
ద్భావుని సద్భావుని నవ
నీవర యేర్పఱుఁప నెఱుఁగ నేరఁగవలయున్"

భార. శాంతి 3-81 ప.

మాటలలో తేలిపోరాదు – తన మనస్సున కీడు మేలు పరికింప వలెను. అసద్భావుఁడెవరో – సద్భావము గలవాఁడెవరో యేర్పఱుఁప వలెను. అని తెలుపుచున్నాఁడు.

సముద్ర సరిత్సంవాద మూలమున – శత్రువు బలాధికుఁడైనచో- అల్పబలుఁడైన రాజే విధమున ఆపద తరింపఁగలఁడ"ను ధర్మజుని ప్రశ్నకు భీష్ముఁడు "వేతస వృత్తి నవలంబింపవలెన"ని తెలుపు చున్నాఁడు.

నదులు పొంగి పాఱుచున్నప్పుడు – తటమునందలి తరులు – నిలువుగా నిలిచియుండుటచే తాళలేక కూలిపోవుచున్నవి.

ప్రబ్బలి చెట్లు ప్రవాహమేవైపుననున్న – ఆవైపునకు మొగ్గి – ప్రవాహము తగ్గిన తరువాత యథాస్థానమునకు వచ్చుచున్నవి. ఇట్లు తమ్ము తాము రక్షించు కొనుచున్నవి. కనుక అల్పబలుఁడగు రాజు బలాధికుఁడగు రాజునకు వంగి – తన్ను తన రాజ్యమును రక్షించు కొనవలెను. అని తెలియుచున్నది.

కుర్కురోపాఖ్యానము–అల్పున కధికారము నిచ్చిన యజమానికే ముప్పుతెచ్చును కనుక అట్లు అల్పున కధికారమియ్యకుఁడని తెలుపు చున్నది.

గృధ్ర జంబుకోపాఖ్యానము—

ఆర్త జన దుఃఖనివారణము ప్రభువునకు కర్తవ్యము కనుక — నిజకార్య పరులు — మోసకారులునగు వారి నేర్పు మాటల తెఱంగు నెఱిఁగి వర్తించుట రాజునకు కర్తవ్యమని తెలియఁజేయుచున్నది.

"శాల్మలీ వృక్షము—నారదుడు"— అను కథ వలన ప్రబలునితో దుర్బలుఁడు మాత్సర్యము పూనరాదని తెలియుచున్నది అట్లు మత్సర గ్రస్తుఁడైన అతడు విభవ విహీనుఁడగునని తెలియుచున్నది.

భీష్ముఁడు - ముచుకుందునకు శుక్రుడు చెప్పిన యితిహాసము వలన — శరణాగత రక్షణ వలన నరునకు గలుగు ఫలమును—తెలుపు చున్నాఁడు.

లుబ్ధ కపోతోపాఖ్యానము — కరుణ, త్యాగములు మానవునకు ప్రథమ ధర్మమని తెలుపుచున్నది.

నరపతి హీన బలుఁడైనపుఁడు — పెక్కండ్రు శత్రువులు చుట్టు ముట్టినపుఁడు ఆపదనెట్లు తరింపవలెనను ప్రశ్నకుత్తరముగా-భీష్ముఁడు మూషిక మార్జాలోపాఖ్యానమును పేర్కొనుచున్నాఁడు.

రాజులు మిత్త్రులనెట్లు నమ్మవలెనో — ఈ క్రింది పద్యము తెలుపుచున్నది.

క॥ నమ్మమి మృత్యువు, పెద్దయు
నమ్ముట యపమృత్యువగుట నరపతి నమ్మి
నమ్మక పనిగొను నది ని
త్యమ్మును సూక్ష్మమతిఁదాను నరయగవలయున్.

భార. శాంతి 2. 351 ప.

కాలక వృక్షీయ క్షేమ దర్శి సంవాదము వలనను—

"అధికారులు వంచకులైనచో – నేర్పుతో క్రమముగా పరస్పర విరోధము కలిగింపవలెను ప్రీతిని చెఱుపవలెను. అప్పుడు – వలసి నట్లు ఒక్కొక్కని దండింపవలెను" అని తెలుపుచున్నాఁడు.

రాజైనవాఁడు చిఱునవ్వుతో నుండవలెను—

"క॥ మృదు మధుర వాక్యముల నిం
పొదవెడు చిఱునవ్వుతోడ నుర్వీశుఁడు స
మ్మదము సచివులకు ప్రజలకు
నొదవింపఁగ వలయునది మహోన్నతి సేయున్"

భారతము శాంతి **2-371**

అని, మృదు మధుర వాక్యములను – ఇంపగు చిఱునగవుతో – పలికి రాజగువాఁడు ప్రజలకు, సచివులకు సమ్మద మొనగూర్పవలెన"ని తెలిపినాఁడు.

"రాజునకెట్లును అధోగతి తప్పదు కదా" యనిన ధర్మజునితో భీష్ముఁడు–రాజు పాపదూరుఁడగు విధానమునిట్లు పేర్కొనుచున్నాఁడు.

శరణాగతులను రక్షించుట – పాప నివారకము. శత్రువుల పోటులకు క్షత గాత్రుఁడైన వానిని తెచ్చి చక్కఁగా అఱయవలె – అది పాపమును నివారించును. ధరణీసురులను రక్షించినవాఁడు – – పాపములకు దూరుఁడగును. అనేకములగు అధర్వములు గావించి రాజు పాప పరిహార మొనర్చుకొనఁగలడు.

ఇట్లు–శరణాగత రక్షణ–ధరణీసుర పోషణ–అధ్వర నిర్వహణ– పాప దూరులగుటకై రాజులు గావింపఁదగిన ముఖ్య కర్తవ్యములని తెలియుచున్నది.

సముద్ర సరిత్సంవాదమున—

"అరి నృపాలు పెంపు నాత్మీయ శక్తియు
నెఱిఁగి మూర్ఖవృత్తి నెదురు పడక
యుచితవృత్తి నతని యుద్ధతి మేపడి
గడపి హీన బలుఁడు సెడక నిలుచు—"

అని—శత్రురాజు నాధిక్యమును, శక్తిని గుర్తించి మూర్ఖుఁడై ఎదుర్కొనక-ఆతని యుద్ధతి పోవువఱకు యుచితవృత్తితో గడపి. చెడక నిలుచుట-అల్పబలునకు తగును" అని విదితమగుచున్నది. రాజు-మయూరము వలె, బహు చిత్ర భంగిని ప్రజల యంతరంగమును ఆత్మవశము గావించు కొనవలె మృదు వాక్యము పలుకవలె. మంత్రము లందు తన మాట బయలు పఱుపరాదు. నీచులను, కుటిలురను దునము చుండవలెను.

మూషిక మార్జాలోపాఖ్యానము—

"నమ్మఁదగని వారి నమ్మక యున్నది
తగిన వారినైనఁ పద్ద నమ్మి
యుండఁదగదు తన్ను నొరులనమ్మెడునట్లు
యుండి యొరుల నమ్మకునికి నీతి"

భార. శాంతి 3_239 ప.

నమ్మఁదగనివారిని నమ్మరాదని — నమ్మఁదగిన వారినికూడ పెద్దగా నమ్మ రాదని—తన్నుమాత్ర మితరులు నమ్మునట్లు రాజ్యాంగముల నరయుచు పనులను గొనుచుండవలెనని" బోధించుచున్నది.

వసంతము భానులనివలె — తగు ప్రతాపముతో ధరణి ప్రజలను ఉచిత వర్తనముల నుంచవగినది. ఇది రాజధర్మజ్ఞులకు రాజు.

రాజు మూలబలము నెల్లప్పుడును సంతుష్టి పఱుప వలెను. సామముతో నెల్ల కార్యముల గొనవలె. సమరము వలన అధిక సంపదలు — జనసంపద నశించును. కావున — అహంకారము వదలి — కోపమువీడి — రిపుల తగ్గించు కొనవలెను.

విరోధిని దానమిచ్చియైన — శాంతుని గావింపవలె. ఇదియును తప్పిన భేదోపాయ ముపయోగింప వలె. అనంతరము దండోపాయము పంచమమగు ఉపాయ మొకటి గలదు అది ఉపేక్ష! ఇది శుక్రుని మతము.

ఇనుము జాతినుండి — అనలము నీటినుండి విప్రులు రాజుల వలన వృద్ధినొందుదురు. ఇనుముతో శిలను త్రెంప బోయిన జలముతో అగ్నిని కాల్పబోయిన అవియే నశించును. అదే విధముగ — రాజు విప్రులను కోపింప బోయిన తాన చెడును. రాజ రహితమగు పుడమిని జనులింకిన మడివులోని మీనములట్లు పలు పాట్లు పడుదురు.

"క్షత్రియస్య పరోధర్మః ప్రజానామేవ పాలనమ్
నిర్దిష్ట ఫల భోక్తాహి రాజాధర్మేణ యుజ్యతే"
మను 7-144

రాజులకు అన్ని ధర్మములకంటెను ఉత్కృష్టధర్మము ప్రజా పాలనమే! శాస్త్రోక్తమగు "పన్ను" అనుభవించురాజు ధర్మమునే పొందును.

ధృతరాష్ట్రుడు ధర్మజునితో—

వినికి గలిగి రక్షించువాఁడు ఉత్తముఁడగు రాజు, అనువున దయతో — న్యాయముగా ఆయుతులెల్ల గొనుట — రాజునకు శ్రేయస్సును గూర్చును" అని తెలిపినాఁడు. అట్లు తగనేలిన రాజున కుర్వి కామధేను వగునఁట!

రాజు బండారమును సేకరించుట యందు మిక్కిలి మెలఁకువ గలిగి యుండవలెను. రాజు నాదాయమునకు మూలమైనవారు – కర్షకులు వణిజులు – గోరక్షకులు.

అది ఆనాఁటి మూల భారత కాలపు మాట!

ఈనాఁడు రాజున కాదాయ మార్గములు విస్తృతము లైనవి. భూమీశుఁడు – పులి కూనలను తిన్న విధమున బండారమును ? ంపరాదు జలగ రక్తమును పీల్చునట్లు – ప్రజల క్షేమాత్రము ఎఱుక లేక వారినుండి ధన సేకరణ చేయవలెను ఇది శాంతి పర్వము నందలి పలుకులు

రాజు – ఆదాయము వచ్చు వెరవులను వృద్ధి పొందింప వలెను దుష్టులైన ధనవంతుల సంపదలను రాజు బండారమునకు చేర్ప వచ్చును

కాని – రాజు తన పాలిత వర్గము లోని సంపన్నుల యెడ ఈర్ష్య వహింప రాదు.

ఉచిత వ్యయములే రాజ్యసికి రక్షకములు. అర్థసిద్ధి కంటెను ధర్మ సిద్ధి యధికమని – వామదేవుఁడను ముని – వసుమనుఁడను రాజునకు బోధించెను.

అట్లని రాజు బండారమును వృద్ధి పఱచుటలో విముఖుఁడు కారాదు. బండారము పెరుగని జనపతికి బలమును మిత్రసంపదయును కొఱవడును. కావున నరపతి బండారము నేవిధముననైన వృద్ధి పొందింప వలెను.

'ఏవిధముననైన"–అనుట ఏ అధర్మ మార్గము చేతనైన అనికాదు ప్రభు, మంత్ర శక్తులు – ఉత్సాహశక్తి - ఈమూడింట - ఏశక్తినైన కావలసిన ధర్మ మార్గమున వినియోగించి బండారమును నింపవలెనని యర్థము.

దారిదోపిడి మూకలను రాజు చేరదీయ రాదు అవసరమునకై చేరదీసినను నియమములకు కట్టుబడ చేయవలెను. ఇందులకు భీష్ముడు కాపవ్యుడను బోయవాని కథను ఉదహరించినాడు. దీనినిబట్టి -

'ధర్మశాస్త్రముల చేత విధింపబడిన పన్నుమాత్రమే ప్రజల నుండి గ్రహింప వలెనని - ఈ నియమమున కేమాత్రము పన్ను అధికముగ గ్రహింప వలసి వచ్చినను - రాజు పౌర జానపదుల సమ్మతిని బడయ వలెననియు - తెలియు' చున్నది.

'అలబ్ధ మిచ్ఛే ద్దండేన లబ్ధం రక్షేద వేక్షయా
రక్షితం వర్ధయేద్వృద్ధ్యా వృద్ధం దానేన నిక్షిపేత్'

మ. 7-101

రాజు - అలబ్ధమును - తాను పొందని దానిని — దండముతో - చతురంగ బలరూపమగు దండముతో సంపాదింపవలెను. అట్లు పొందిన దానిని ప్రత్యవేక్షణముచే రక్షింపవలెను. రక్షితమగు ధనమును వాణిజ్యాదికములచే వృద్ధినొందింపవలెను. ప్రవృద్ధమగు ధనమును శాస్త్రీయమగు విభాగముచే సత్పాత్రమందు వినియోగపఱుపవలెను

ఇట్లు—రాజు బండారమును చతురంగబలములను ప్రయోగించి వృద్ధి పఱుపవచ్చును. వాణిజ్యాదికములచే వృద్ధిపఱువవచ్చును. దండెత్తినపుడు — శత్రురాజు ఓడిపోయి కప్పమును కానుకలను ఒసంగును కదా! అదియును బండారమునభివృద్ధి పఱచుటకు మార్గము!

ధర్మజుండశ్వమేధ యాగమును గావించి — అనేక రాజన్యులచే కప్పములను గొనెను.

రాజసూయ యాగము గావించి సమస్త భూమండలము నందలి రాజులచే - గజాశ్వాదులను, రత్నకంబళాదులను, ధన కనక వస్త్ర వాహనములను గొనెను. అతని బండారము నిండినది. అది అధర్మము కాదు. కాని అట్లు సమృద్ధమగు కోశమును శాస్త్రీయముగా విభజింప వలెను. సత్పాత్రమునందు వినియోగింపవలెను. గోబ్రాహ్మణరక్ష, స్త్రీ బాలవృద్ధ జన రక్ష-భూరిదక్షిణలు-వీనికై వినియోగమగుచినాఁడు ఇట్లు యోగ్యముగా ధనమును వ్యయపఱుపవచ్చును.

రాజు అష్ట దిక్పాలుర అంశముగా భావింపఁబడినాఁడు. "అతడు ప్రజలపై ధనమును వర్షించును. ఉపకారులకు ప్రత్యుపకార మొనర్చును. అపకారుల సంపదల హరించి కోశము నింపును. అప్పుఁ డాతడు కుబేరుని యంశమున జనించినవాఁడు.

సకల వర్ణ ధర్మరక్ష ఆతని విధి వర్ణాశ్రమ రక్షణకై ధనమును వినియోగించును దుర్వినీతులను - దండనీతి వినియోగించి వారిచే "శిక్షా" - రూపమును ధనమును గ్రహించును. ఈ ధనముల సుజన రక్షణకై వినియోగించును.

అట్లని - ధనమును గొనుటయే తన పనిగా రాజు వ్యవహరింప రాదు. ధనము నింపుటకై - దండన విధింపరాదు.

ప్రజలు నొవ్వకుండ కరములను రాబట్టుకొనుట భూపతి ధర్మ మని శాంతి పర్వమున తెలుపఁబడినది.

"విప్రేభ్యో దీయతే ద్రవ్యం ప్రజాభ్యశ్చా భయంసదా" అని భారతమున గలదు. ఇది రాజైన వానికి కర్తవ్యము, ఆ నాటి విప్రులు తపోధనులు. లౌకిక సంపదలపై నాశలేనివారు ధన ధాన్యములపై వారికాశ ఉండదు. రాజులకు సమయ సమయముల గుర్తించి - హితము బోధించువారు! అట్టివారు దరిద్రులుగా నుండుట తగదు.

అట్టి మహనీయులు ఏకోరాజు రాజ్యమున దరిద్రులుగా, దైన్యజీవనమును గడుపుచుందురో ఆ పాపము ఆ రాజునకు చెందును.

కనుక తపోధనుల ప్రశాంత జీవనమునకై రాజు ద్రవ్యమును వెచ్చించవలె! ప్రజలకు అభయ మొసంగవలె.

కొంత ధనమును ప్రజాభివృద్ధికి మఱి కొంత ధనమును ప్రజా రక్షణకు వినియోగింపవలెను.

ప్రజలను — అంతశ్శత్రులు — బహిశ్శత్రువులు — వీరి నుండి కాపాడవలెను. తస్కరాదులను దండనీతి ప్రకారము రక్షించి — వారి నుండి ధనము గొని కోశమును నింపుట — బాహ్యశత్రువులపై దండెత్తి వారినుండి కప్పములనుఁగొని కోశమును నింపుట—

కృషి, వాణిజ్యాదుల నుండి కరము గ్రహించి కోశము నింపుట- ఇది రాజు ఒనగూర్చు ఆదాయము.

ఆశఁడొనగూర్చుకొను సామాగ్రి—

బహు ధన ధాన్యములు—

మణి రత్న మాణిక్యములు —

బాణ శరాసనములు — అస్త్ర జాలములు

యోధ వీరులు—

రాజు రాజ్యమునందు నిరంతరము ప్రవహించు అంతరుదక ప్రవాహముల నేర్పఱుపవలెను.

తృణ, జల. కాష్ఠ, ఇంధనముల సేకరింపవలె, దుర్గములను నిర్మించి — అనేక యంత్రముల నుంచవలె.

ఈ దుర్గములు – యంత్రములు శత్రు భయానకములై రాజ్య రక్షణ దక్షత గలిగి యుండవలెను.

ఇట్లు ధనము – కోశము లేని రాజు రాజుగాఁడు. ప్రజాపాలన దక్షుఁడు కాఁజాలఁడు ప్రజా రక్షణ దక్షుఁడు కాఁజాలఁడు. తపస్వి జనుల సుఖశాంతుల నభివృద్ధి పఱుపలేఁడు. బంధుజనుల దైనందిన బాధలను తీర్పలేఁడు. శత్రువులపై పటిష్ఠ సాధనములతో దండెత్త వలెను.

నృపుడు అర్థార్జనాది కార్యములందు ధర్మాత్ములచే పరిశుద్ధులై పాపవ్యపేత బుద్ధులలై వినీత వర్తులై యుండువారినే నియోగింపవలెను. వారు కార్య నిపుణులైయుండవలె.

రాజు ముందుగా – నియోగ్యులలో – ఉత్తములెవరో మధ్యము లెవరో – అధములెవరో తెలిసికొనవలెను.

న్యాయముగా – నియోగములందు నియమించవలె, భృత్యకోటికి తగు జీవితము లాయుత్తము గావింపవలెను.

"యుద్ధమున నీ ప్రస్తమున నీల్గిన వీరభటుల – అనుపోష్యుల నెల్లను ప్రోతువా? భోజనాచ్ఛాదనములు వారికి తక్కువ కాకుండ చూచు కొందువా?" అని నారదుఁడు సభాపర్వమున రాజగు ధర్మజుని యడుగుటం బట్టి – చనిపోయిన వీరుల వీరభటుల – కుటుంబములను ఏకొఱత లేక ప్రభువు పోషించుచుండెనని – అది యాతని కర్తవ్యమని తెలియుచున్నది.

ఈ రాజనీతి – ఈ నాటి ప్రభుత్వమునకు మార్గదర్శకమైనది. ఈ నాఁటి – రాజ్యము – ప్రభుత్వము – రాజరికము కాదు. ప్రజా స్వామ్యము. శాసని నిర్మాణములో – కార్యనిర్వాహక వర్గములో మార్పులున్నవి. అయినను – యుద్ధవీరులు మరణించినపుఁడు – ఆ

విధముగ — భారత కాలపు రాజనీతి నిధానమును అనుసరించుచున్నది. వారి కుటుంబములను భరించుచున్నది. ఉద్యోగాదులలో ప్రత్యేక వసతులు కల్పించుచున్నది — భారత ప్రభుత్వము!

"రాచకార్య భారమును దాల్చుటకు-ధనలుబ్ధులను ప్రచ్చులను పంపవు కదా!" అని నారదుఁడు ధర్మజుని ప్రశ్నించుచున్నాఁడు. "పగరవలని వారలను — ధృతిచాలని వారలను రాచకార్యములందు నియోగింపవు కదా" అని యడుగుచున్నాఁడు. కనుక — అట్టివారిని రాచకార్యములందు నియోగింపరాదని తెలియుచున్నది.

ఇంకను ఇతని ప్రశ్నలవలన అనేక విషయములు వ్యక్త మగు చున్నవి ఆ నాఁటి రాజులు—రాజ్యమున చోరభయము లేకుండునట్లుగా పాలింపవలెను. వాన లేమి వలన — భయము కలుగకుండుటకై తాను పరిపాలించు భూమియందు చెఱువులను త్రవ్వించవలెను.

హీనులకు కర్షకులకు — ధాన్యము, వణిజులకు — బీజములను శతైక వృద్ధికి నూటికి ఒక్కటి చొప్పున వడ్డి తక్కువకాకుండ ఋణము లియ్యవలెను.

రాజైన వాఁడు — పంగులను, మూకులను, అంధులను, వికలాంగులను, అబాంధవులను, భయార్తులను, శరణన్న భయంకర శత్రువునైనను — కాపాడవలెను.

కృత మెఱిఁగి — కర్తయొక్క గొప్పతనమును సభలందు సంస్తుతింపవలెను. వారిని సత్కరింపవలెను.

ఇట్లు కృత మెఱిఁగిన రాజే జగజ్జనులను పాలింపఁగలవాఁడు.
వ్యయము : .. ఆయమునందు — నాల్గవ భాగముకాని — మూఁడవ భాగముకాని - అందర్ధము (అరు) కాని వ్యయము చేయవలెను.

పరమ విశ్వాస పాత్రులగు భక్తులను - దక్షులను అయః థాగారము లందు ధనాధ్యక్షత యందు - వరవాజి వారణావళులందు బండారము లందు నుంచవలెను.

గురువులను, వృద్ధశిల్పులను, పరవణిగ్బాంధవ జనులను, ఆశ్రితులను, సాధుజనులను పేదరికము లేకుండ రక్షింప వలెను.

దైవజ్ఞులను సన్మానింప వలెను శాస్త్రదృష్టి గలవారిని ప్రతిభావంతులను దివ్యాంతరిక్ష భౌమోత్పాత ప్రతీకారులను సన్మానింప వలెను

ఇట్లు రాజైనవాఁడు - బండారమును సద్వినియోగ పఱుప వలెను. అతఁడు తప్పక ధనసేకరణ చేయవలసినదే! లేనియెడల తన్నాశ్రయించిన వారిని రాజు సంరక్షింప జాలఁడు

'అరక్ష్యమాణాః కుర్వంతియత్ కించిత్ కిల్బిషం ప్రజాః
తస్మాత్తు నృపతేరర్థం యస్మాద్గృహ్ణాత్యసౌకరా" యాజ్ఞ్యరాజ
339

ప్రజలు రక్షింపఁ బడక బోయినచో పాపము లాచరింతురు. వారిపాపములో అర్థము రాజును పొందుచున్నది. కనుక రాజు ప్రజా రక్షణ పరుఁడై "కరము" గ్రహింప వలెను!



యజ్ఞ యాగములు —

అశ్వమేధము :— కురుక్షేత్ర యుద్ధము సమాప్తమైనది. ధర్మజుఁడు బంధు మిత్రుల మరణమునకు దుఃఖించినాఁడు. కర్ణుఁడు తన కగ్రజుఁడని తెలిసి — అగ్రజుని చంపితిని గదా యని దురపిల్లినాఁడు. అర్జునునితో మనకేటి రాజ్యము ఒండొక జనపదమున కేఁగి భైక్ష చర్యా విధిని జీవనమును గడుపుదమనినాఁడు. అప్పుఁడర్జునుఁడు

"భూపాలుర చంపిన పాపము అశ్వమేధాది పుణ్యకర్మములఁ బోదా" యని ప్రశ్నించినాఁడు.

ఆ నాఁడు-యుద్ధము గావించుట రాజుల కర్తవ్యమని భావించువారు. యుద్ధమున గావించిన హత్యలు-హింసగాదని భావించువారు. అట్టి యుద్ధముల వలన పాపము సంభవించియుండిన అశ్వమేధ యాగము పాప పరిహారకమ'ని ప్రబల విశ్వాసముతో నుండువారు.

అర్జునుఁడు – అర్థో పార్జనము – బంధుమిత్ర పరితోషణము, భూపతులకు పరమ పురుషార్థమ'ని పలికినాఁడు.

పార్థివులు-పృథివిని బలిమిని గైకొందురు. అర్థములు పార్జింతురు. పర్జన్యాదులగు ఆదిత్యులనధ్వర క్రియా జాతమున ప్రీతులఁజేసి యుత్తమ లోకములఁ బడయుదుర'నినాఁడు. ఇట్లు అధ్వరములకు మిక్కిలి ప్రాముఖ్యము నొసంగువారు. అందును రాజులకశ్వమేధము-మఱియు ముఖ్యము.

"ఇదే విధమున – దిలీప, నృగు, సగర, నహుష, అంబరీష, మాంధాతులు – నడచుట వినమా" అని ప్రశ్నించినాఁడు

బహుళ దక్షిణ విధానముగా – "ప్రభూతములైన యజ్ఞములు సేయ నైతివేని సకిల్బిషుఁడవగుదువు"

"అశ్వమేధములు సేసిన రాజులెల్ల అవభృథమున పరిపూతాత్ము లగుదుర"ని అశ్వమేధ యజ్ఞమును సర్వపాపప్రశమనమునుగా వర్ణించి నాఁడు. ఇది యా కాలపు విశ్వాసము.

భారత రచనా కాలమున యజ్ఞ యాగాదులపై మిక్కిలి విశ్వాస ముండెడిదని రాజుల కశ్వమేధము, రాజసూయము ముఖ్యములని

తెలియుచున్నది అగ్నిష్టోమ, వాజపేయములు, అతి రాత్ర పౌండరీ కాదులు ఆ నాటి ప్రధాన యజ్ఞములు.

ధర్మజుఁడు – అశ్వమేధ యాగమును గావింప, బూనినాఁడు. అప్పుడు అర్జునుఁడు – త్రిగర్త దేశాధిపతి నోడించెను. సూర్యవర్మను, అతని తమ్ముని కేతువర్మను – జయించినాఁడు.

ప్రాగ్జ్యోతిష పురాధిపతితో యుద్ధము గావించినాఁడు. భగదత్త తనయుఁడు వజ్ర దత్తుఁడతఁడు.

సింధు దేశాధీశుఁడు – సైంధవుని పుత్ర పౌత్రులు – జయింపఁ బడిరి. మణిపూర పురంబున కధిపతి – బభ్రువాహనుఁడు – అతనితో యుద్ధము – జరాసంధ పౌత్రులతో యుద్ధము – జరిగినవి.

వంగ, పుండ్ర, మ్లేచ్ఛ దేశములు – చేది; కొంకణ, కిరాత దేశములు – కోసల, కాశి, దశార్ణదేశములు – నిషాదాధీశ దేశము – జయింపఁబడినవి.

పిమ్మట – దక్షిణమున – పాండ్ర, ఆంధ్ర, ద్రవిళ, కేరళ, కర్ణాటకములను జయించినాఁడు.

సౌరాష్ట్ర రాజునోడించెను. గోకర్ణాధిపతిని నిర్జించెను. ద్వారక కేగెను. అచట యదు కుమారులతనిని పూజించిరి.

అపరాబ్ధి తీర దేశముల కరిగెను. పంచనదముపై దండెత్తెను. గాంధార దేశమును సొచ్చెను. సుబల పౌత్రునితో యుద్ధమొనర్చెను.

దిగ్విజయము సంపూర్ణమైనది. అనంతరము – వ్యాసుఁడు – "దక్షిణలు మున్మడుఁగులుగా నిది మూఁడు ముఖముల ఫలము నొందుమ"నినాఁడు.

దక్షిణలు లేని యజ్ఞములు ఫలములియ్యఁజాలవని—దక్షిణలెంత అధికముగా నిచ్చిన అంత అధికముగా ఫలమును పొందుదురని విశ్వసించిరి. కనుక ప్రతి యజ్ఞము సమాప్తమగుట "భూరి దక్షిణల" నొసంగిన తర్వాతనే

ఇది రాజులు — వివిధ దేశములను జయించి ఆర్జించిన ధనరాసులను జనులందఱకు పంచుట కొఱకే — ఏర్పడిన దేమో!

ఇట్లు "దక్షిణలు" అని — ప్రజా సమూహమునకు ధనమును పంచు మార్గమును గావించిరేమో! అందును బ్రాహ్మణులకు మఱింత ఎక్కువగా నిచ్చుచుండిరి ఆ నాఁటి బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞాన సంపన్నులు. జ్ఞాన ధనులు, నిరుపేదలు, అట్టివారికిచ్చుట పాత్ర దానము. కనుక రాజులు దక్షిణలతో యజ్ఞము పరిపూర్తిగావించుచు కిల్బిష దూరులగుచుండిరి

రాజసూయ యాగము :—

ఆ నాఁటి రాజశ్రేష్ఠులకు రాజసూయ యాగమొనర్చుట యొక ప్రతిష్ఠ! హరిశ్చంద్రుడు రాజసూయ యాగమొనర్చినాఁడు. అతఁడు సప్తద్వీపములు జయించెను ధారుణిలోఁగల ధరణిపతుల తన శాసనమున నిలిపెను. సకల సామ్రాజ్యము ఒప్పునట్లుగ రాజసూయ యాగ మొనర్చెను.

యదోచిత దక్షిణ లొసంగెను. ఏనుమడుగుల అర్థమునిచ్చి యాజకులను పూజించెను. విశిష్ట విప్రవనులను అభిమతార్థ ప్రదానముల తృప్తులఁ గావించెను. అని రాజసూయ మొనర్చను స్వర్గస్థుఁడగు పాండురాజు - నారదుని చేత ధర్మజునికి చెప్పి పంపినాఁడు.

రాజసూయ మొనర్చినచో పితృదేవతలు - ఇంద్రసభన పొందుదురస ఆనాఁటి విశ్వాసము.

కనుకనే స్వర్గస్థుఁడగు పాండురాజు ధర్మజునకు అనతి ఇచ్చుట ధర్మజుఁడు — నారదుని మాటలువిని రాజసూయ మొనర్ప నిశ్చయించెను.

ధర్మజుఁడు రాజసూయాగము గావించుటకు పూర్వము।—

అర్జునుఁడు — కౌబేర దశయందు దిగ్విజయమునకై బయలు దేరినాఁడు. పుళిందావనీశ్వరుని — ప్రతివింధ్యుఁడను వానిని — ఓడించెను. అఖిలద్వీప మండలేశ్వరులను — వశవిధేయుల గావించు కొనెను. ప్రాగ్జ్యోతిష పురాధిపతి — భగదత్తుని తాకెను. అతనినోడించి కప్పము గొనెను.

అంతర్గిరి, బహిర్గిరి, ఉపగిరుల భూపతుల నోర్చెను. వారిచే నానావిధ ధనరాసుల గొనెను ఉలూక దేశాధిపతి బృహద్బలుని పరాజితునిఁ గావించెను. పార్వతేయుల గర్వముడిపెను. దేవప్రస్థమున సేనా బిందునోడించెను.

బర్బర, శబర, తురుష్క, లోహిత, సుధన్వ గాంధారవ్, కాంభోజ కోసల పతులచేత విచిత్ర వస్తువాహన నివహంబుల గొనెను. చిత్రాయుధ రక్షితమగు సింహపురమును మథించెను.

సింహాసనాసీను లయిన వనచర దస్యుల వశ్యుల గావించెను. శ్వేత పర్వతము నతిక్రమించెను అచ్చట — కాంభోజ కటకుండను రాజుచేత పూజితుఁడయ్యెను హాటక దేశమున—మానసంబను కొలను - ఋషి కుల్యమును జూచి అందలి రాజుల చేత నపరిమిత పదార్థములను గొనెను.

ఆరాజులు - తిత్తిరి - కల్మాష - మండూకాఖ్య మయూరహంస - శుక సవర్ణంబు లయిన హయములను గొనెను. పర్వత నిభంబులైన ఏనుగులనుఁ గొని - హేమకూట నిషధాచలముల గడచెను గంధర్వ నగరములను గెలిచెను.

శత సహస్ర యోజనా యతంబయి శుద్ధ సువర్ణ మయం
తేజోరాశి యయిన మేరు పర్వతము నాలోకించెను.

జంబూ మహా వృక్షమును చూచెను. తత్తిరమున మేర
ప్రదక్షిణముగాఁ జని గంధమాదన పర్వతము నతిక్రమించెను.
పతులగు – సిద్ధ విద్యాధర, చారణ, గంధర్వుల చేత నానా
వస్తు వాహనములఁగొని – మాల్యవన్నీల పర్వతముల నతిక్రమి
ఉత్తర కురుదేశముల కేఁగెను హరివాసంబను పురముపై వి
ఉత్తర కురుభూములందలి రాజులు–అపరిమిత దివ్యరత్నాభర
నిచ్చిరి. కరము లొసంగిరి ప్రీతులైరి.

భీమ సేనుఁడు పూర్వ దిగ్విజయ యాత్ర గావించెను: —

జరాసంధుని వధించెను. పాంచాల పతిచేత సత్కృతుఁడై
విదేహ రాజును – జనకుఁడను వానిని జయించెను దశార్ణ
సుధన్వునితో మహా యుద్ధము చేసెను. అతని పరాక్రమ
మెచ్చి – అతనిని తనకు సేనాపతిని గావించుకొనెను. అశ్వమేధ
రోచమానుని – అనుజ సహితుని – నిహతునిఁ గావించెను.
విషయమునకేఁగెను. చేది భూపతి శిశుపాలుఁడు – భక్తిపరుఁ
రత్నశోభిత ధన రాసులొసంగినాఁడు.

పుళిందపురమున – సుకుమార, సుమిత్రులను

కుమార విషయమున – శ్రేణిమంతుని

కోసల దేశమున – బృహద్బలుని

అయోధ్యాపురమున – దీర్ఘ యజ్ఞుని

కాశీరాజగు – సుపార్శ్వుని

రాజపతియైన – సుధన్వుని – మత్స్య, మలశపతులను, కర్ణాట దక్షిణ మల్లులను మర్దించి వారిచేత అపరిమిత ధనమును గొన్నాఁడు. మగధపతియగు జరాసంధ తనయునాశ్వాసించినాఁడు. హిమవత్పర్వత పార్శ్వంబున – జలోద్భవంబను దేశమును భల్లాట దేశమును జయించెను. ఇంద్రపర్వత సమీపమున – కిరాత పతులనేడ్వురను, శర్మక వర్మకులను, ఇంద్రసేన సముద్రసేనులను, కర్ణ వత్సపతులను, పుండ్రపతిని, పౌండ్రక వాసుదేవుని–వశ గతులను గావించుకొనెను.

సహదేవుఁడు:— దక్షిణకు బయలు దేరినాఁడు. గోశృంగగిరి నివాసులగు సుమిత్ర. శూరసేన, దంతవక్త్ర, యవనులను జయించెను. కుంతిభోజునిచేత ప్రియ పూర్వకముగా సత్కారము వడసెను. జంభుకుని ఓడించి–వానిచేత ఉత్తమ గజహయ. రత్న తతులను గొనెను.

నర్మదా సమీపమున – అవంతి పతులను, విందాను విందులను మందదర్పులఁ గావించెను. మహిష్మతీపురమున కధిపతియగు నీలునితో యుద్ధమొనర్చెను. ఆ నీలుఁడు – ఓడి – సహదేవుని – దివ్యాంబర నానావిధ రత్నమయ ఆభరణములతో సమ్మానించెను.

సౌరాష్ట్ర దేశమున రుక్మి, భీష్మక, శూర్పారక. దండక పతుల చేత దూత ముఖమున – అసంఖ్యాత ధనముఁగొనియె. సాగర ద్వీప నివాసులగు – నిషాదులను, పురుషాదులను. ఏక పాదులను, కాల ముఖులను, కర్ణ ప్రావరణులను, నరరాక్షస యోనులను, రామశైల, కోలశైల, తామ్రద్వీప. సంజయంతీ పురనివాసులను వశ గతులను గావించుకొనెను

తాళవన, పాండ్య, కేరళ, కాళింగ, ద్రవిడ, యవన, కరహాటక భూపాలకుల నోడించెను. దక్షిణ వేలావన భూములందు విడిసెను. లంకకు దూతల నంపెను. లంకాధిపతి విభీషణుఁడు కప్ప మొసఁగెను.

అర్థములను, రత్న సమూహమును, చందనాగురు కాష్ఠాదులను కప్పముగా గొనెను.

నకులుండు :— పశ్చిమ దిశయందు పయనించినాఁడు. రోహితక విషయమును ప్రవేశించినాఁడు. దత్తక, మత్స్య, మయూరకాది శూద్రులతో కయ్యము గావించెను మరు, మాళవ బర్బర, కుర్పర. శైరీషక, దాశార్హ దేశంబుల రాజులను జయించెను. పుష్కరారణ్య నివాసులైన యాభీర గణములను, సరస్వతీ సింధు కూలాశ్రితులైన గ్రామణీయులను, పంచనద అమర పర్వత నివాసులను వశము గావించు కొనెను.

మద్రేశుఁడగు శల్యునిచేత సత్కార పూర్వకముగా వస్తు వాహనములఁగొనెను. పశ్చిమాంబుధి కుక్షి నివాసులను పరమ దారుణులను – బర్బర కిరాత వీరులను ఓడించెను.

వరుణేంద్ర పాలిత దిక్పతుల చేత – పదివేల లొట్టియలను ధనమును బలాత్కారముగా గొనెను.

ఇఁక దండయాత్రలు పూర్తియైనది. ధర్మజుఁడు రాజసూయ యాగమును ప్రారంభింప కృతనిశ్చయుఁడైనాఁడు. అగ్నిదేవ ముఖమున వ్రేల్చెను. దేవతర్పణములు, యథోచిత తర్పణాలతో మహీతర్పణము గావించుట – అయినది.

అప్పుఁడు దుర్యోధనుఁడు దురాలోచనము గావించినాఁడు. "మానధనాఢ్యుఁడైన భూపతి సహియింపనోపునె సపత్నులవృద్ధియు నాత్మ హానియున్" ఇట్లతడు మాత్సర్యగ్రస్తుఁడైనాఁడు. పాండవుల వృద్ధికి దురపిల్లినాఁడు. ధర్మరాజు యజ్ఞ దీక్షితుఁడైనాఁడు.

యజ్ఞ దీక్షితుఁడగు ధర్మజునకు :—

గౌడ, కాంభోజ పతులనేక ప్రకారములగు వర్ణకంబళములను సంగిరి. శుక వర్ణముగల వాహన నివహములను తెచ్చి యిచ్చిరి.

సింహళ, కేరళ, చోళ, పాండ్యదేశాగాత రాజపుత్రులు — సాగర వారి రుహ శౌక్తికముల నొసంగిరి. విద్రుమముల నొసంగిరి. ఏలాగురు చందనముల నిచ్చిరి.

దేవకీ నందనుఁడు —

పదునాలుఁగు వేల గజములను కానుకఁగా నిచ్చెను. విరాటుఁడు రెండువేల గజముల నొసఁగెను.

ద్రుపదుఁడు — వేయి గజములను, పదివేల హయములనుఁ పదునాలుగు వేల విలాసిని జనములను పదివేల దాసీ గృహస్థులను ఇచ్చినాఁడు.

కురు, కుకుర ఉలూక కేకయ, కాశ్మీర కాంభోజ, గాంధార, మద్ర ద్రవిడ, మగధ, మాళవ, కళింగ, అంగ, వంగ, బంగాళ, గౌడాంధ్ర కేరళ కోసలాది మహీపతులు - భగదత్తుఁడు - మరుకచ్ఛ నివాసులు చేదిపతులు — అజానేయ బాహ్లిక హూణ పారసీక దేశములందు గల హయములను, పర్వత సన్నిభములగు అజావి గోమహిషములను - హిరణ్య రజత కంబళాంబరాదులను ఇచ్చిరి.

మేరు మందర మధ్య కీచక వనవాదులయిన కుళింద సారద, బర్బర, తురుష్క, టెంకణ, కొంకణాధిపతులు—వశగతులు, హిమశైల రామశైల, కురుదేశంబులు — క్షౌద్ర పాత్రంబులను, దివ్యౌషధంబుల నిచ్చిరి.

ఇంద్రనీల, ఇంద్రగోప, పిక, చంద్ర, మయూర, కీరవర్ణ, తురంగములను — నిశితదీర్ఘ నిస్త్రింశములను, గజదంతమయ శిబికాసనంబులను ఇచ్చిరి.

వాసవ సఖుఁడు – గంధర్వపతి – చిత్రరథుండును వాఁడు నన్నూఱు గంధర్వ హయంబుల నిచ్చె.

తుంబురఁడను గంధర్వుఁడు నూరు హయములనిచ్చె ఈ రాజసూయ యాగమును చూచుటకు "నిఖిల మహీతలంబునం గల బ్రాహ్మణ క్షత్రియాదులనెల్ల రాఁబనుపు" మని యుధిష్ఠిరుఁడు పిలువ నంపినాఁడు

ఆ యుధిష్ఠిరుని యజ్ఞశాలయందన్ని జాతులు, అన్ని వర్ణముల వారును కిట కిట లాడుచుండిరి.

ఆ యజ్ఞమున శ్రీ కృష్ణుని యోగ్యునిగాఁజేసి అర్ఘ్యమొసంగిరి. శిశుపాలుఁడు కూడదని ఎదిరించి, అచ్యుతుచే హతుఁడయ్యె.

ఈ విధములగు నధ్వరములచే రాజులు – ధర్మమార్గమున ధనమునుపార్జించుచుండిరి- దేవతలనుద్రేల్చి తృప్తిపఱచుచుండిరి. వచ్చిన కానుకలను – దక్షిణల రూపమున, దాన రూపమున ప్రజల కొసంగి తృప్తులగుచుండిరి.

ఇట్లు ధర్మరక్షిత, ప్రవర్ధితంబులయిన మహాధనమును పాత్ర ప్రతి పాదనమున నియోగించుచుండిరి,

కాళిదాసు నుడివినట్లు "ఆదానంహి విసర్గాయ సతాం వారిము చామివ" యని సమకూర్చుకొనుట, గ్రహించుటలు వారి ధరములకు వలె –.నలుగురకు ఇచ్చుటకే కదా! అనుట ఆ నాఁటి రాజుల పట్ల యథార్థమగు చుండినది.

సముద్రమునందలి నీటిని పానమునకు వినియోగింపలేము. పలుచోట్ల పంటల కుపయోగింప లేము. మురికి గుంటలలోని నీరు కాలుష్యముతోఁగూడి ప్రజల వినాశమున కుపయోగించును గాని

సద్వినియోగము కాఁజాలదు. నిర్మానుష్యమగు ప్రదేశములందలి నీరు నిరుపయోగముగ నుండిపోవును. మిట్టలపై, గుట్టలపై, గుంటలలో, పెంటలలో నిలిచిన నీరు నిరర్థకము. అట్టి నీటిని సూర్య రశ్మి ద్వారా గ్రహించి మేఘుఁడు వర్షించి సర్వుల సమృద్ధికి విసర్జించుచున్నాఁడు. ఈ రాజులు యజ్ఞముల గావించి—

సామంతులనుండి; ఆటవిక పుళింద బర్బరాది కిరాతులనుండి, శత్రువుల నుండి, విద్రోహుల నణఁచి వారి నుండి పలు భంగుల కానుకలను, కప్పములను గ్రహించి ఆ ధన కనక వస్తు వాహన రాశిని అవసరమున్న వారికి, పాత్రులకునిచ్చి వస్తు వినిమయ మున సమత్వము చూపుచున్నారు

రాజులు — ధర్మమార్గమున పరి పాలింపఁ దొడగిరి. గుణ సందలలచే రాజులు, ప్రజలు విరాజమానులైరి.

ప్రజలు సర్వ విధముల నభివృద్ధిగాంచిరి. రాజ వంచకులు — రాజవల్లభులుగా మారిరి. తస్కరుల బాధలు తొలఁగినవి. రుజ, వహ్ని—బాధలు తొలఁగినవి. వఱపు కఱవు–మొ॥ ఈతి బాధలడఁగినవి. ఇట్లు యజ్ఞ యాగాదులను ప్రజా శ్రేయస్సునకు, రాజ్య కల్యాణమునకు గావించెడివారు.

❁❁❁❁❁❁❁❁❁

రా య బా ర ము

"దూత" అయినవాఁడుండ వలసిన విధానమునుగూర్చి మనుస్మృతి ఇట్లు చెప్పుచున్నది.

దూతం చైవ ప్రకుర్వీత
సర్వ శాస్త్ర విశారదమ్
ఇంగితాకార చేష్టజ్ఞమ్
శుచిం దక్షం కులోద్గతమ్"

మను. 7-68

రాజయిన వాఁడు సర్వ శాస్త్ర విశారదుని, ఇంగితాకారములను చేష్టలను తెలిసిన వానిని, శుచియైన వానిని దక్షుని, కులోద్గతునిదూతగా చేయవలెను. అట్టివాఁడు—పరరాజుచేతను గౌరవింపఁబడును కార్యా కార్యములు తెలిసి చక్కగా దౌత్యమును నిర్వర్తింపఁగలడు.

ఇంగితాకార చేష్టజ్ఞుడు – అనఁగా—దక్షా దృష్ట్యార శాస్త్రజ్ఞుఁడు. చేష్టయనఁగా – కోపాది సూచకమగు కరాస్ఫాల నాదికము, వీని తత్త్వములను బాగుగా తెలిసినవాఁడు దూతకావలెను. అనఁగా మానవ మనస్తత్వమును, విభిన్న మానసిక పరిస్థితులలో – మానవుని ఆంగిక చేష్టలను, భావహావములను శీఘ్రముగా తెలిసి కొనఁజాలినవాఁడు కావలెను. అతఁడు దూతగా పంపదగినవాఁడు.

అనురక్తః శుచిర్దక్షః
స్మృతిమాన్ దేశకాల విత్
వపుష్మాన్ వీత భీర్వాగ్మి
దూతో రాజ్ఞః ప్రశస్యతే మను 7-64

ఇచ్చట అనురక్తుఁడన జనాను రాగమును పొందినవాఁడు. ధనవనితాది లోలుఁడు కానివాఁడు శుచి. మఱపులేనివాఁడు స్మృతిమంతుఁడు. కార్యకాలము నతిక్రమింపని వానిని దక్షుఁడని బావింతురు. దేశకాల విత్—అనగా దేశముననుసరించి అప్పటి ఆ సమయ సందర్భములనుఁ బట్టి ముందు చెప్పిన మాటలేగాక—అన్యథా కల్పించుకొను సామర్థ్యము కలవాఁడు. విగతభీః – శ్రోతల కప్రియమైనను సందేశమును నిశ్శంకముగా చెప్పువాఁడు వాగ్మియన యుక్తిదక్షుఁడు. ఇట్టివాఁడు దౌత్యమున సాఫల్యము పొందఁగలఁడు.

పురోహితుని రాయబారము ;—

పాండవులతో సంధి గావించు కొనుటకై మొట్టమొదట ద్రుపదుఁడు కౌరవుల కడకు తన పురోహితుని పంపినాఁడు.

అతఁడుచిత రీతిగా కౌరవుల నగరమున కేతెంచినాఁడు. ధృతరాష్ట్రుని గాంచెను. కృప ద్రోణ, విదుర, గంగా సుతులను వారి వారి మందిరములకుఁ జని చూచెను. కౌరవేశ్వరుని పేరోలగమున కేగెను. వారలందఱిని కనుగొనెను.

"ధృతరాష్ట్ర పాండు భూపతులు సహోదరులు, వారిపుత్రులు తమ తమ తండ్రుల ధనములు గైకొనుట మీ కందఱకును ఉచితమే కదా!" యని ప్రశ్నించినాఁడు.

"ధార్తరాష్ట్రులు-ప్రాణహింసాకరములగు పనులచే పాండవుల చంపఁజూచిరి. పుణ్యబలము, బాహుబలము పాండవులను నిజరాజ్య పదవిని పొందఁజేసినది కౌరవులు – వంచించి వారి రాజ్యము నపహరించిరి. దీని నంతయును ఈ పెద్ద రాజంగీకరించినాఁడు నారీ రత్నమగు ద్రౌపదిని సభలో నట్లీడ్చి తెచ్చిరి. పాండవులు చూచునట్లుగా వలువలూడ్చిరి. మాయా ద్యూతమున రాజ్యము నపహరించిరి. అరణ్యమునకు పంపిరి. వీరి వర్తనమును, పాండు కుమారుల వర్తనమును మాత్సర్యము లేక గమనించి ఈ ధృతరాష్ట్రునకు మీరు బుద్ధి సెప్పఁదగును" అని సభలో పలికినాఁడు.

ఇందువలన ...

ఆనాఁడు ప్రజా సమూహమునకు, సభలకు రాజకీయరంగమున ఎంతటి ప్రాముఖ్యముండినదో గుర్తింపనగును.

"ఆ పాండవులు కౌరవులతో పగనొల్లరు. పగవలన అఖిల భూప్రజలు నాశమగుదురు. అంతియేకాని-వారినల్పులని తలంపకుఁడు. వారధిక ధర్మపరులు. అందు కూడినవి ఏడక్షౌహిణులు, ఇందున్నవి పదునొకండు. అయినను భీముఁడు బాహుబల ఘనుఁడు. సాహస రసికుడు సాత్యకి, వారిరువురే సహస్రాక్షౌహిణులతో సమానము. గాండీవ ధన్వుని – ఆహవమున మార్కొనఁ దలఁచుట కొండను పొట్టేలు తాకఁ గోరుటయే యగును.

ఆ బీభత్సుని బాహు బలమును పందికినై బవర మొనర్చి హరుఁడే ఎఱుంగును.

వివిధోపాయ పరాయణుఁడు, అఖిల విద్యా జాల సంవేదియగు మాధవుఁడా దిక్కు! ఇంక పాండవుల కసాధ్యమేది గలదు?

కనుక అదను తప్పఁదగదు. మహాత్ములను పిలిపింపుఁడు ఇరు పక్షములకు ప్రియమును, హితమును గావింపుఁడు న్యాయము ? కొంత భూమి పాండవులకు చెందవలసి యున్నది. ఇచ్చి, కరాఁ బ్రదుకుఁడు" అని యుద్బోధించినాఁడు.

భీష్ముఁడిందులకు హర్షముతో నంగీకరించెను. "ఈభూపతి పితృ ధనమగు పాలును ఉచితస్థితిని వారల కిచ్చుట తగును పాండవులను సుత నిర్విశేషముగా చూడఁదగును" అని పలికినాఁడు.

కర్ణుఁడు— "సగము పాలిచ్చుట అసంభవమ"ని పలికెను భీష్ముఁడు కర్ణుని పలుకులకు కోపించి "పాండవులలో ఒక్క అర్జునుఁడ గోగ్రహణ సమయమున ఇందఱిని గెలువలేదా" అని దండించెను

అప్పుఁడు ధృతరాష్ట్రుఁడు కలుగఁజేసికొని—నేనును, బంధువులను మంత్రి జనంబులను పెద్దలను విచారించి — సమస్త భూ ప్రజలను విచారించి పుత్రుల కడకు సౌమ్యుఁడగు ఒక్కని పుత్తెంచెదను. నా మనో వాంఛయు కౌరవజాతి కలిసి వర్తించుటయే! నీవు ముందుగా వెళ్లుము' అని అతనిని సత్కరించి పంపినాఁడు.

అనంతరము ధృతరాష్ట్రుఁడు సంజయుని రావించినాఁడు. అతనిని పాండవుల కడకు పంప సమకట్టినాఁడు. అతనితో నిట్లనినాఁడు— "నీవు పాండవుల కడకేగుము. "మీరు వనవాసాయాసమును నిస్తరించి అభ్యుదయముతో సమీపించితిరి. ఇది విని ముదితాత్ముఁడైనాఁడు — మీయయ్య, నన్ను మీ కడకు పుత్తెంచినాఁడు" అనుము. అనెను.

"దుర్యోధనుఁడు–కార్యాకార్యజ్ఞుఁడు కాఁడని, అందువలన నిట్లు కలంక గలిగిన దని" పలుకు మనెను.

"ఆర్యులు, దృఢ ధైర్యులు, రణధుర్యులునగు పాండుసుతులు దోషాన్వితులు కారని, పొగడు మనినాఁడు.

"పాండవులు క్షీరోదక గతి కలిసి ప్రేమతో బ్రదుకుట తగునని తెలుపుమ"నినాఁడు.

మమ్ము్మలను పాండుసుతులు – అసత్యభాషులని, అన్యాయ పరులని; గర్విష్ఠులని తలంతురని సందేహించినాఁడు, కూడి బ్రతుకుట కష్టపడరేమో అని తలంచినాఁడు.

"ధర్మజుఁడు న్యాయము నడుపగలఁడు. మనము పాలియ్యక గర్వములాడిన అర్జునుఁడు గాండీవమును మోపెట్టును. కృష్ణుని సారథ్యముతో – జగత్త్రితయ సంక్షోభము కలుగును. దుష్ఫ్రపదుఁ డల్పుఁడా! కవలలు అగ్రజన్ములకంటెను ఏమిట తక్కువ" అని పాండవుల ప్రవృత్తులను ప్రతాపమును తడవినాఁడు. శ్రీకృష్ణుని ప్రతిభను స్మరించినాఁడు. మనము పాలీయకున్న అర్జునుఁడు గాండీవమును మోపెట్టునే అని పలవించును కాని "పాలు" ఇచ్చుచున్నామని మాత్రము చెప్పఁడు.

"నీవు ధర్మజుని పాలికి వెళ్లి – పేరోలగమునందున్న అవసరమున పలుకుము. నెయ్యమును పాటించి తియ్యగా పలుకుము. అలుక తీరునట్లుఁగా పలుకుము. కయ్యమను మార్గమును యమనందనుఁడు మానునట్లుగ శాంతి ప్రకారమున కార్యమును నడుపుము. పొమ్మ్మ" అని పంపినాఁడు.

ఇచ్చట ధృతరాష్ట్రుని కుటిల మార్గము అవగతమగుచున్నది.

పాండవుల కియ్యవలసిన పాలు ఇచ్చు మాట లేదు. వారి మనుగడకై రాజ్యభాగము నొసంగు తలంపులేదు.

తియ్యని మాట లాడవలెయునంట! పాండవుల యందుక తీర్చవలయునంట! శాంతి ప్రకారమున కార్యము నడుపవలెనంట! ఇది పాండవుల కడకేంగి సంజయుండు నడుపవలసిన కార్యము. పైపై మాటలలో పాండవుల నౌదార్య పఙ్కులు! ఆ పలుకులతో రాయబారము సఫలమగున!

పాండవుల రాజ్య భాగమొసంగు విషయ ప్రస్తావన లేక-శాంతిని వాంఛించుట – ధృతరాష్ట్రుని కౌటిల్యమును, మోసపు మాటలను తెలియం జేయుచున్నవి

రాజకీయ రంగమున వక్రమార్గము ననుసరించి మంత్రుల తీరు తెన్నులను సూచించు దూత కార్యమిది.

సంజయుండు పాండవుల కడకేగినాండు. శ్రీకృష్ణుని కడ భయ, భక్తి, వినయ సంభ్రమములను ప్రదర్శించినాండు. పేరోలగమున ధర్మజునింగాంచి దండ ప్రణామము లాచరించినాండు. "అశోక పుణ్యధనుండగు మీ తండ్రి మీ యునికిని విని ప్రియమందినాండు. మీ యోగ క్షేమముల నరయుటకై నన్ను పుత్తెంచినాడ"ని ధర్మజునితో పలికినాండు

కురురాజకడ-అవినీతిపరులు, సత్త్వసంపన్నులు, దురహంకారులు-కలిసి యుందురని, వారొకరిమాటల నొకరు పాటించు వారుకారని కౌరవుల విభిన్న భావ సంఘులరను, దౌష్ట్యమును, ఐక్యతలేని భావ సముదాయ స్వరూపములను వేలెత్తి చూపినాండు. ఇచ్చట పాండవులు ఐకమత్యము భావములందు, కార్యములందు చూపువారు కాని కౌరవులలో భావ సమైక్యత లేదు కనుక సంజయుండు చెప్పిన మాటలను తప్పక పాటింప వలసినదని ధ్వనించుచున్నది.

ఇఁక – "నీ హృదయమిందు శిశిరమ"ని పొంఁదొంద దలఁచిన వాఁడవని కనుక నా కౌరవులకందఱికి నేఁటినుండి సేమము కలుగునే"ని ధర్మజుని హృదయ శీతలత్వమును, పొందుకోరు స్వభావమును పొగడినాఁడు. ఇది ముందు కాళ్లకు బంధము వేయుటవంటిది.

ఇచ్చట – పాండవులను పొగడి, ధర్మజుని శాంత స్వభావమును నుతించి, కౌరవుల దౌష్ట్యమును వేలెత్తిచూపి ధర్మజుని సంగరాభిలాషను నశింపఁ జేయుచున్నాఁడు.

ధృతరాష్ట్ర భూపతి వృద్ధత కారణమున చిత్తచాంచల్యమును పొందినవాఁడని, సుతుల గర్వమును మాన్పలేఁడని నీవిట్టి వారిని సైరించిననే "అజాత శత్రువ"ను పేరు సార్థకము కాఁగలదని యుబ్బించినాఁడు. దుర్వార బలురయ్యును పాండు కుమారులను శాంతాత్ములని పొగడగలరని పైకెత్తినాఁడు.

రాజ్య భాగమును గుఱించి తెలుపలేదు. సంజయుఁడు ధృతరాష్ట్రుఁడొసంగిన ఆదేశమును తన బుద్ధి కొలది పాటించినాఁడు. ఇంతకంటెను – ఆ సంజయుఁడేమి పలుకఁగలఁడు? కయ్యము లేకుండునట్లు మాత్రము నెయ్యు మెసఁగు సంధి మాటలను నడపుటకు తాపత్రయపడినాడు సంజయుఁడు.

"శాంతులని పేరుగాంచిన మీకు తగవు తగదు, మీవంటి సర్వజ్ఞులు చులకన కార్యము చేయఁదగదు. మీది సత్కులము, కౌరవేంద్రుని ప్రవర్తన వలన మడుగుచీర యందు మసి తాకినట్లుగ వంశమునకు కళంకము గలిగినది. అట్టి కళంకమును పోగొట్ట నీవే తగుదువు. సత్శీలుఁడవై బంధుహింస మానుము. రవులకు గలిగిన అప్రతిష్ఠ పోవునంతటి యున్నత శీలమును కలిగి బ్రతుకుము" అని యాదేశించినాఁడు

ఇచ్చట భరతవంశ ప్రతిష్ఠను చూపి పాండవులను యుద్ధ విముఖుల గావింప ప్రయత్నించుచున్నాఁడు. మొదట పాండవుల గుణ గణముల

పొగడి మచ్చిక గావించుకొనుట అనంతరము కౌరవుల దుష్ప్రవర్తన నుగ్గడించి వారి స్వభావమును మార్పజాలరని తెలుపుట, ఆ కౌరవుల వలన భరత వంశమునకుఁ గలిగిన కళంకమును మాన్ప సమర్థులని యొక కార్య సామర్థ్యము నంట గట్టుట, "అట్టి వంశపు అప్రతిష్ఠ పోగొట్టి వంశ గౌరవమును కాపాడఁదగిన సత్పురుషుఁ గనుక కాపాడుఁడు" అని యాదేశించుట జరిగినది.

రాజ్య భాగము – మాట వరుసకైన ఇత్తుమని తెలుపక ఈ వృథోపదేశములు – సంజయుని కప్పటి యవశ్యకర్తవ్యమైనది.

అనంతరము – యుద్ధము వలని ఫలితములనువివరించు చున్నాఁడు. యుద్ధము వలన అఖిల జనక్షయము కలుగునని – జయ మైనను అపజయమైనను సుఖమును చేకూర్ప, జాలవని – ఒకవేళ జయము లభించినను వృద్ధ జనులను, బాలురను, సఖులను, బంధు వులను, గురువులను చంపి పొందిన ఆ జయము వలన పాండవుల వంటి యుత్తములకుత్తమ సౌఖ్యము కలుగఁజాలదని–యుద్ధవిముఖుల గావించుచున్నాఁడు.

యుద్ధమున – బంధు బాంధవులు, కురువృద్ధులు, బాలురు, గురువులు ఇందఱు చచ్చినను ఆ రాజ్య సౌఖ్యమేమి సౌఖ్యమని యుద్ధానంతర ఫలమును చక్కఁగా చిత్రీకరించుచున్నాఁడు. సంజయుఁ డింకను తన వాక్చాతుర్యమును మానలేదు.

"ఇచ్చట నీవారు యుద్ధమున మహా ప్రరాక్రమ శాలురు. అజేయులు. అచ్చట భీష్మద్రోణాదులు – ఆ స్థానమునకైన నోడని వారు.

రెండు పక్షములకును హితము, ప్రియమును కోరువారిని అడిగి చూడుము. మ్రొక్కి వేడెదను. అసూయలు దక్కుము. క్రోధము మానుము. శాంతితో జీవింపుఁడు.

ఇది సంజయుని బోధ! ఇచ్చట శాంతి బోధలు జరుగుచున్నవి కాని రాజ్యాంశ ప్రసక్తి కనిపించదు.

కౌరవులు దుష్టులు కనుక రాజ్యమేలు కొనవలెనని – పాండవులు శాంతిప్రియులు కనుక యుద్ధప్రయత్నము విరమించి – జనక్షయము వలదని కోపమును మానుకొని – అసూయలు వదలుకొని – ప్రశాంత జీవనమును గడుపవలెనని ఆ ప్రబోధము. మఱి వారు బ్రాహ్మణులు కారు. క్షత్త్రియ కుమారులు అట్టివారికి జీవికకు మార్గమెట్టిదో ఇంకను తెలుపలేదు.

ఇట్టి కూటనీతితో కుమారులకు రాజ్యమును చేకూర్పవలెనని కృషిసలిపినాఁడు. వృద్ధ జంబుకము వంటి ధృతరాష్ట్రుఁడు.

అప్పుఁడు ధర్మనందనుఁడు సూటిగా ప్రశ్నించిన విధానము "సంజయా! ఆ ధృతరాష్ట్రుఁడు నెయ్యము దప్ప మఱొక మాట పలుకఁడు మాకు మాత్రము కయ్యము లేక జీవించుట ఇష్టముకాదా! పోరులేక, ఏ కష్టము లేక అర్దసిద్ధి కలిగినచో ఎట్టి మూర్ఖుఁడైనను వదలుకొనునా! రండని మమ్ములని పిలువ రాదా! ఆ ధృతరాష్ట్రుఁడు– "పాలిండని" కొడుకులకు చెప్పరాదా! ఇంద్రప్రస్థమో మఱొక పురమో మాకిచ్చి పంపుట తగదా!"

అని తమకు రావలసిన రాజ్య భాగమును గుఱించి స్పష్టముగా ప్రశ్నించినాఁడు. అప్పుఁడు సంజయునకు డొంక తిరుగు మాటలకు అవకాశము లేకపోయినది. వృథా ధర్మోపదేశమునకు తావు లేదు. అడిగిన ప్రశ్నకుత్తరమియ్యవలసి యున్నది. అందువలన సంజయుఁడు అసలు విషయమును బయట పెట్టినాఁడు—

"పాలియ్యక దుశ్శీలురగు కౌరవులు చెడ, దలఁచినను నేనొకటి చెప్పుచున్నాను వినుము. యుద్ధమొనర్చి బంధు మిత్రులను చంపి – జయము గొని – అరుధిరా భీలాన్నమును తినుట కంటెను – మీ వంటి

శాంత శీలురకు — సుగుణ గరిష్ఠులకు భిక్షాన్నము తిని బ్రతుకుట యైనను మేలు" అనినాఁడు.

ఇచ్చట స్పష్టముగా వారి అభిప్రాయము తెలిసిపోయినది.

(1) కౌరవులు దుశ్శీలురు కనుక రాజ్యము నియ్యరు.

(2) వారు రాజ్య భాగమియ్యక పోయినందున చెడి పోవుటయు సంభవము కలదు.

(3) అందువలన మీరు యుద్ధ సన్నద్ధులు కావచ్చును. బంధు మిత్రులను యుద్ధమున చంపను వచ్చును.

(4) అప్పుడా రాజ్యమును మీరు భుజించు అన్నము — సుఖమొనర్ప జాలదు. అది రుధిరా భీలాన్నము రక్తముతో తడిసిన భయంకరమగు కబళమది" అది మీ వంటి శాంత చిత్తులు, సుగుణ సంపన్నులు తినలేరు.

(5) కనుక మీ నడవడికి భిక్షాన్నమైనను మేలు.

సారాంశము :— కౌరవులు రాజ్యమెట్టి పరిస్థితిలోను ఇయ్యరు. యుద్ధము జరిగిన వారు మరణించుటయు సంభవము. కనుక ఆరు ధారముతోఁ గూడిన అన్నము మీ వంటి సత్శీలురకు తగదు. కనుక రాజ్యాంశమునియ్యరు. యుద్ధము వలదు

కనుక భిక్షాన్నముతో నైనను జీవించుట తగును.

సంజయుఁడు మరల స్తుతించుట కారంభించినాఁడు. "రాజసూయ యాగమొనర్చిన ఘనుఁడవు. శాంతి దాంతి ధనముగా సకలలోకములు పొగడునట్లు బ్రతికిన వాఁడవు. ఇప్పుఁడును శాంత స్వభావమును మానుకుము. క్రోధాదుల వదలి బ్రదుక వలసినది" అని మరల

శాంతిపాఠమును వల్లెవేసినాఁడు. ఇప్పుఁడు మఱొక క్రొత్తమలుపు త్రిప్పు చున్నాఁడు – గమనింపుడు. అలనాఁడు దుర్ద్యూతమున మోసపోయి అడవులందిడుమల బడితివి. తాల్మియే ధనముగా బ్రతికితివ"ని ధర్మజుని తాల్మిని అదేవిధముగ అనుసరింప వలసినదని బోధించు చున్నాఁడు.

తుది జీవనమున క్రూర కర్మాస్పదమగు యుద్ధమునకు బోయి బంధువులను, గురువులను వధియించి ఏమి సౌఖ్యమును బొందఁ గలవ"ని – చర్విత చర్వణము చేయుచున్నాఁడు.

"అట్టి సౌఖ్యము అర్యసింద్యము, అస్థిరము" అని సౌఖ్యము క్షణ భంగురమని వేదాంతమును బోధించుచున్నాఁడు.

అల్పులకు మ్రింగను అసాధ్యమగు హాలాహలమును అలనాఁడు శివుఁడు మ్రింగఁ జాలినాఁడు. శివుని హాలాహలమును మ్రింగుటలో ఎన్ని క్రోధమును మ్రింగఁ జాలిన వారిలో నిన్నెన్న వచ్చును. అని శివునితో పోల్చి క్రోధము వలదని వారించినాఁడు.

అందులకు ధర్మజుఁడిట్లు పలికినాఁడు—

"కోపము నివారింపఁ దగినదే! అహింస ఉత్తమ ధర్మమే! అయినను వంశదూషకులను లోకకంటకులను, పాపాత్ములను -నిర్మూలించుటకు హింస చేయవచ్చును. క్రోధము ప్రదర్శింపవచ్చును" అని "సంగ్రామము వలదు – లోకక్షయమగున"ని పలికిన సంజయుని పలుకులకు "సంగ్రామము రాజులకు పరమ ధర్మమ"ని ఉత్తర మొసంగినాఁడు.

"ధర్మాధర్మ విదులకును గురువు వాసుదేవుఁడు ఇతఁడే కార్యాకార్య నిరూపకులకును శిక్షకుఁడు. అతని యాజ్ఞ చేతనే యదు, వృష్ణి,

భోజ, అంధక, సంజయ, కేకేయ ప్రభృతి భూపతి ప్రకరము ప్రశస్త మార్గమున వర్తిల్లు చున్నది" అని కృష్ణునకే సంజయునకుత్తరమొసఁగు బాధ్యత ఒప్పగించి ఆగిపోయినాఁడు

అప్పుఁడు శ్రీ కృష్ణుడు పలికిన పలుకులు—

ఆ రాజు చేయు నెయ్యమును, గారాబమును తెలుపు చుంటివి. ఈ పాండవులు తమ పాలు రాజ్యమును బడయనిదే పైపై మాటలెన్ని చెప్పినను లొంగరు. వీరి తండ్రి పాలు వీరికిమ్మనుము. అది పొంద నిదే అట్టి అవమానము కంటెను వీరికి యుద్ధమే మేలు. రాజులిచ్చు వారే కాని వేడికొనువారు వారుకారు'' అని యుద్ధము వలదనినందుకు బదులు పలికినాఁడు

"రాజులిచ్చువారే కాని వేడికొనువారు కారనుట'' – "భిక్షాన్నము మేలు మీనదవడికిన్" అనుటకు ప్రత్యుత్తరము.

"సకల వర్ణాశ్రమములను తమ తమ ధర్మములందు పాలించు రాజులు తమ ధర్మమునే వదలు కొందురా! అనెను. "నీవిక్కడ చెప్పు ధర్మములను అకార్యకారులై చెడుతెరువునఁ బోవుచుండు కౌరవులకు చెప్పుము'' అని తెలిపినాఁడు,

"ఆ ధృతరాష్ట్రుఁడలనాఁడు దుశ్శాసనుఁడు పట్టి ద్రౌపదీసతిని ఈడ్వగా ఆ ఏడ్పు టెలుంగు నెట్లోర్చినాఁడు? ఇప్పుఁడు వీరి సేమము నడయ పంపుచున్నాడే'' అని ధృతరాష్ట్రుఁని అకార్య సహిష్ణుతను స్మరింపఁజేసినాఁడు.

"అప్పుడాకర్ణుఁడాడిన పలుకులెట్టివి? ఈ పాండవులను ద్రౌపదికి చూపి వీరలందఱును గొడ్డువోయిన వారలు, కూరిమి గల మఱొక మగని వెదకి కొమ్మని "యన లేడా'' అని కర్ణుని నీచపు పలుకుల నెత్తి పలికినాఁడు.

దుశ్శాసనుడు "పౌరుషము గల మానిసి ఇంకెవ్వఁడ"ని పలుక లేదా అని దుశ్శాసనుఁడు పాండవుల పౌరుషమునెట్లు గాయపఱచినది తెలిపినాఁడు.

"ఇంత జరిగినది. అయినను రాజ్యము పాలు పంచి ఇచ్చిన పాండవులను సమ్మతింపఁ జేసెదన"ని తన బాధ్యతను తెలిపినాఁడు. "కౌరవులకు బుద్ధిచెప్పి మృత్యుపాశమునుండి తప్పింపుమ"ని హెచ్చరించినాఁడు. అంతటితో శ్రీకృష్ణుఁడాఁగ లేదు. పాండవుల రాజ్య భాగమునకై నొక్కి పలికినాఁడు.

ధృతరాష్ట్రుఁడు, అతని పుత్రులును వనము వంటివారని వారిని అరణ్యముతో పోల్చినాఁడు. కుంతీనందనులు సింహ సదృశుల"ని పాండవులను సింహములతో పోల్చినాఁడు.

"అసింహమైన వనమును శీఘ్రముగా వినాశమొందించఁగలరు. వనావృతములు గాని సింహములను శీఘ్రముగా చెటొందును. కనుక ఇరువురకు క్షేమము కావలయుననిన — పొందియుండుట మేలని"— నొక్కి యుపమానములతో విశదపఱచినాఁడు.

"ఈ విషయమును చర్చించుటకై నేనే అచ్చటికి వత్తునని" తన రాకను తెలియఁజేసినాఁడు.

ధర్మజుఁడప్పుడు కడమాటగా ధృతరాష్ట్రునితో నిట్లు పలుకుమనెను — "పాండు నందనులను తజ్జనకుని రాజ్యపీఠమున శైశవము నందే సంతసముతో నిలిపితివి" ప్రభుత్వ మిచ్చితివి. తగఁబోషించితివి. ఇప్పుడు పేకచేసి దయలేక వారు హీనవృత్తి యందుండుట నీకు చూచుట తగునా యని యడుగుమనెను.

ఇఁక పితామహునితో —

"శంతనుని వంశము నశించు పోవుచుండ నీవే నిలిపితివి. నీ మతమున కలిసి బ్రతుకునట్లు చూడుము. నీ పౌత్రులను—కౌరవులను

నిందనుండి, అధర్మ వృత్తినుండి, చావునుండి – తొలఁగింపుము. జీవితులను గావింపుము. అప్పుఁడు పుడమిజనులు ప్రస్తుతింతురు. అని తెలుపుచున్నాఁడు

"కౌంతేయా గర్జుఁడపుఁడు యుద్ధము పోంతకు పోఁడని తెలుపుమనె"ను.

సుయోధనునితో బాహు బలాఢ్యులను బలహీనుల పగిది వెడల నడచితివి. చిరకాలమడవులకు పోఁద్రోచితివి–సభలో పాంచాల పుత్త్రిని తలపట్టి యీడ్చితివి. ఆ పరుస దనమును పాండు పుత్రులు సైరించిరి అతులువ తనమును ఓర్చిరి. నీవు కురు కుమారుల యుద్ధమును మ్రింగ జూడకుము. ఒరుల సొమ్ముకై కాస పడదగదు. వారి పాలు వారి కొసఁగి కూడి బ్రతుకమ"ని అను నునెను.

సంజయునితో నింకను పాండు పుత్రుఁడిట్లనుచున్నాడు—

"మాకు ధర్మముతోడై యున్నది. పెద్దగా ఈనోపఁడేని కడకు కుశ స్థలము, వృక స్థలము, వాసంతి, వారణావతము మఱెందేని యొక్కటె – తనతోఁబుట్టువుల కిమ్మనుము. ఏవుఁకు నిలువను తావు లిచ్చిన చాలును సర్వశాంతియగును. అట్లయిన కురు పాంచాలాదులును బ్రదుకుదురు, ఇరువురకును సంతుష్టిగా పొందు తగునని తెలుపుమని సంజయునకు గంధ మాల్యాంబరాదుల నొసంగి వీడు కొలిపినాఁడు.

దూతయైన వానికి వాక్చాతుర్యముండవలెను. సమయస్ఫూర్తితో మెలగవలెను. ఇచ్చట సంజయునకు వాక్చాతుర్యమున్నది. సమయ స్ఫూర్తి యున్నది. దూతకుండవలసిన ధైర్యమున్నది. కాని – లోపమొక్కటే! అతనికడ న్యాయము లేదు. పాండవులు కోరు – "రాజ్యాంశము" ఇచ్చుట అనునంశములేదు. కనుక సంజయుని రాయ బారము – భిత్తికలేని చిత్రణమైనది.

శ్రీ కృష్ణ రాయబారము :

"దూత ఏవ హి సంధత్తే భినత్త్యేవచ సంహతాన్
దూతస్తత్కురుతే కర్మ, భిద్యంతే యేవ వానవా"
మ. 7-66

పొందియున్నవారిని భేదించుటకు దూత సమర్థుఁడు భేదమున్న వారిని సంధించుటకు దూతసమర్థుఁడు. కనుక దూత విడిపోయిన వారిని కలుపుటకు, కలిసిన వారిని విడదీయుటకు సమర్థుడైయుండును! అట్టివాఁడే దూత అనిపించుకొనును. అని శాస్త్రములు ఘోషించు చున్నవి.

మూఁడవ రాయబారము శ్రీ కృష్ణుఁడు కౌరవులకడ కేఁగుట— ఈ రాయబారము మూఁడు రాయబారములలోను ఉత్కృష్టమైనది. దూతలకుగల సర్వలక్షణములతో రాయబారమున కేఁగినాడు శ్రీకృష్ణుడు "రాయబారి"గా వెడలిన వాని నిరుపక్షముల వారును ఆదరించవలె. ఇరువురకు న్యాయము చెప్పువాఁడై యుండవలె ఆ న్యాయమును నిర్భయముగ చెప్పఁదగిన వాడై యుండవలె, అట్టివాఁడే శ్రీకృష్ణుఁడు! ఒక వేళ దుష్టుల కడకు పోవు వాఁడైనచో – అచ్చట తానెదుర్కొను ఆపదలకు ఎదురుపాయమాలోచించుటకు సమర్థుఁడైయుండవలెను! శ్రీ కృష్ణుఁడానాఁటి రాజ్యములన్నిఁట – దైవాంశ సంభూతుఁడుగా మెలఁగుచుండినాఁడు.

శ్రీ కృష్ణుడు – రాయబారిగా బయలు దేరినాఁడు. అతఁడుఁవాగ్మి చతుర సంభాషణలో నేర్పరి. శాస్త్రజ్ఞానము సంపూర్ణముగా గలవాఁడు. కనుకనే అంతటి మహాత్ముని పలుకులను వినుటకై నారద కణ్వాది మహర్షులే ఏతెంచిరి.

"వాక్కు" ఎంతటి వారినైన ఆకర్షించునట్టిది.

ధృతరాష్ట్రుఁడాతని రాకను తెలిసికొన్నాఁడు. సర్వలోకాభి గమ్యుఁడు మాధవుఁడు. అతనికి మనసుభి గమ్యులమైతిమని సంత

సించినాఁడు. వివిధ మణిమయ రథములను, జవ నాశ్వములను, భద్ర సామజములను రత్న విభూషణములను, దాసీనివహములను శ్రీ కృష్ణునకిత్తునని నిశ్చయించినాఁడు.

మనయింట, దుశ్శాసనుని గృహమున, సుయోధనుని గృహమున ఎయ్యది శ్రీ కృష్ణున కింపగునో అన్నియును ఇచ్చెదనని విదురునితో పలికినాఁడు. ఇదొక రాజకీయపుటెత్తు

"కూటనీతి దూతగా వచ్చినవానిని వలలో వేసి కొనుటకు "ఎర" చూపుట వంటిది. ధన కనక వస్తు వాహనాదులను పరిగ్రహించిన వాఁడు లోఁబడును. పరుష వాక్యములను పలుకఁజాలఁడు. నోరు కట్టుబడిపోవును. చెప్పవలసిన నీతి వాక్యములను చెప్పఁజాలఁడు. నిష్కర్షగా దోషముల నెత్తి చూపి విమర్శింపఁజాలడు. మొగ మోట పడును. వాక్కులతొ బంధితుఁడగును.

ఈ కూట నీతిని విదురుఁడు పసిగట్టినాఁడు. అందులకే నిజముగా నీవు శ్రీకృష్ణుని ప్రీతునిఁ గావింపఁదలంతువేని పాండవుల కైదూళ్లిచ్చినను చాలును. శౌరికి లంచమిచ్చి సంప్రీతునిఁ గావింపఁ జూచుచున్నావు. కార్యగతిని భేదము సేయఁజూచెదవు. సుమేరు సదృశమగు అర్థమును చూచినను అతఁడు పార్థునిఁ బాయునా! అని సూటిగా నిలదీసి యడిగి నాఁడు. ధృతరాష్ట్రుని కపట నీతిని బయట పడగొట్టినాఁడు

"కిరీటి భక్తి, అచ్యుతుని పెంపును నీకు తెలియదా" అని ప్రశ్నించినాఁడు.

దుర్యోధనుఁడు విదురుని పలుకుల నంగీకరించినాఁడు. "ఇది నిజము శ్రీ కృష్ణుఁడు పాండు సుతులతో వేఱుకాఁడు. సమయా సమయముల నెఱుంగక దానమిచ్చుట తగదు. అట్లు చేసిన బెదరిరని తలంతురు. పిమ్మట నవ్వుదురు" అని పలికినాఁడు. ఇది యెంతయు నిజమైన తలంపు. శత్రుపక్షము నుండి వచ్చిన వానిని అతిగా ఆదరించి,

సమూహ్మనముచేత, మణిరత్నాదులొసంగిన బెదరి యిట్లాచరించుచున్నారని తలంచుట సహజమే! అట్టివారు పరిహాసాస్పదులగుదురు కూడ!

దుర్యోధనుఁడు శ్రీ కృష్ణుఁడు పూజనీయుఁడని తెలుపుచునే మఱొక మాయను; మోసమును చేయ సంకల్పించినాఁడు. దూతఁగా వచ్చిన కృష్ణుని బంధింపఁ దలఁచినాఁడు. అటులయిన పాండవులకు అధారము లేక ఱెక్కలు విఱిగిన పులుఁగులవలె పడిపోవుదురు విధేయులై పడియుందురు అని యూహించినాఁడు. అప్పుఁడు పాంచాల యాదవులైన అతని బంధుమిత్రులును తనకు వశవర్తులగుదురని దుర్యోధనుఁడు నిర్ణయించినాఁడు.

ధృతరాష్ట్రుఁడీ విషయమును విని "మహాత్ముఁడు, ధర్మాత్మాహిమాత – అయిన శ్రీ కృష్ణుఁడు బంధింపనర్హుఁడు కాఁడని" నిందించినాఁడు.

భీష్ముఁడు "దామోదరునిట్లు బంధించిన తప్పక దుర్యోధనుఁడు-అతని మిత్రులు వినాశము నొందుదురని" పలికినాఁడు.

అచ్చట – పాండవుల కడ : –

శ్రీ కృష్ణుఁడు బయలుదేరఁబోవుచు పాండవుల నందఱిని కలిసికొన్నాఁడు. అప్పుఁడు ధర్మరాజు–

"కృష్ణా! మిత్ర కార్యమును చక్కఁబఱచు సమయ మాసన్నమైనది. నీ కారణమున ఆ సుయోధనునితో పోరాటము దక్కి మా యంశమగు ధరిత్రిని అనుభవింతుము. ధృతరాష్ట్రుఁడు పాలు పంపనీక, పైపై మాటలచే అలుక తప్ప నిశ్చయించినాఁడు.

పోనిమ్ము! ఆ సిరి నాకేల అని యూరకుందునా! నాపై నాశ్రితులకు గ్రామ వాసములకు దైన్యము వచ్చును. సర్వవిధముల సంధియే మేలు అని సంధికై ప్రయత్నింపుమని పలికినాఁడు.

కాని, శ్రీ కృష్ణునకిది ముదావహము కాదు. అతని య
"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
కనుక ధర్మజునితో నిట్లు పలుకుచున్నాఁడు—

"ధర్మజా! నీమది ధర్మనిష్ఠతో నిండియున్నది
సులభముగా వైరము విడుచువారు కారు ద్రోణ భీ
కలరని గర్వముతో విఱ్ఱవీగుచున్నారు రాజన్యు
కుడుచుట క్షత్రియులకు ధర్మమా! వారును ఎట్టి
వింపక రాజ్యమువనుభవింప మఱిగినారు! నీ
నెట్లిత్తురు? పాపాత్ములగు హింసకులను పాముల
చంపవలెను. నిర్విచారముగ చంపవలెను" అని చ
కొల్పినాఁడు.

రాయబారిగా పోవలసినవ్యక్తి మనస్సునందే వి
ప్రాయమున్న—ఆ విషయము కొఱకే మాటలాడును
చర్యలు — ఆ విషయము వైపు మొగ్గు చూపు చుం
ధర్మజుని శాంత భావమును పోద్రోలుటకై ప్రయత్ని
శ్రీ కృష్ణుఁడు!

శ్రీ కృష్ణుఁడు ధర్మజునితో నిట్లనుచున్నాఁడు—

"చెలులు, చుట్టలు, సకలదేశముల రాజులు వి
చరిత్రను కురుసభలో నుగ్గడింతును నీ ధర్మమార్గ
పఱచెదను. దానికి దుర్యోధనుఁడియ్య కొనఁడు.
పలుకులు పలుకును. అతని తండ్రి అశక్తుడు. క
నేరఁడు అదిచూచి తొల్లింటి మీ పాట్లు దలంచి
నిందింతురు. "ఇంతకాక మనకింకేమి కావలెను"

ఇది శ్రీ కృష్ణుఁడు కాంక్షించిన కార్యరూపమున
సభలో సర్వులకు కౌరవుల యెడ ఏహ్యాభావము జ

కటుభావము కలుగవలె పాండవులయెడ దయ, వారి సత్శీలమునెడ గౌరవము ఏర్పడవలెను. అప్పుడు — సభాసదుల, పెద్దల, బంధు బాంధవుల, సామంతుల మనస్సును పాండవుల కడ త్రిప్పఁ గలిగి నప్పఁడింక తక్కిన మనుష్యులు ఆ వైపు మఱలుటలో తడవగునా?

అనంతరము శ్రీ కృష్ణుఁడు వృకోదరుని యడిగినాఁడు. భీముఁడు పలికిన పలుకులు—

"పాండవ కౌరవులు కలిసి పాలు, నీరు, నీరువలె ప్రేమతో నుండ సుయోధనుఁడు దుష్ట చేష్టలతో నింత గావించినాఁడు. అతని నామాటగా నిట్లనుము. "అన్నదమ్ములము మనము ఒరులు మనల తలయెత్తి చూచునట్లు యుద్ధమొనర్ప మనకు తగదు పెద్దల మాట విని ఈ నేలను పంచుకొని యనుభవింతము" అను మనినాఁడు. మేమును కౌరవులును కలిసియుండుట భూజనులకెల్లను హితము. సౌఖ్యకరము" అని పలికినాఁడు. అప్పుఁడు ధర్మజుఁడు శ్రీకృష్ణునితో పలికిన పలుకులు. దూతఅయిన ప్రతివ్యక్తి గుర్తింపఁదగినది. రాయ బారిగా పోఁదగిన వ్యక్తి ఇరుపక్షముల వారిని సంపూర్ణముగా తెలిసికొని, వారి చర్యలు. స్వభావములు నిశితముగా గుర్తించియే ముందుకు పోవలసియుండునని తెలియుచున్నది.

క॥ మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు
నెమ్మి యెఱుఁగు దర్థ సిద్ధి నెఱి యెఱుఁగుదు వా
క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు
పొమ్మెవ్వడ నేను నీకు బుద్ధులు సెప్పన్

అని పంపుచున్నాఁడు,

భార. ఉద్యోగ 3 ఆ. 34 ప

(1) ఇరు పక్షముల వారిని చక్కఁగా తెలిసికొనుట

(2) కార్య సాఫల్య విధానమును నెఱుంగుట

(3) పలుకవలసిన తీరు చక్కఁగా గుర్తించుట - ప్రతి రాయబారికి ముఖ్యము. అట్టి గుణములు శ్రీ కృష్ణునియందు అణువణువున కనిపించుచున్నది.

భీముని యుద్ధోన్ముఖుని చేయదలచినాఁడు శ్రీకృష్ణుడు. అందులకై ఇట్లు పలుకుచున్నాఁడు—

"అగ్గి యింత చల్లఁబడినదా" అని పరిహసించినాఁడు. "ఎన్నడు లేనిది భీముపాల కౌరవులయెడ చల్లదనము గంటి"నని వెక్కిరించినాఁడు.

"నేనును పార్థుఁడు దండిమగలై యుద్ధమునకు పోవుచుంటిమి. పార్థుఁడు పోరఁ దేరునడుప నన్ను గోరినాఁడు. దాని కనురాగమెంది నేనంగీకరించితి. యుద్ధార్థులము మేము నీవు మాకు సాయమొనర్పఁ గలవని ఆసపడవలదా!" అని భీముని యుత్సాహపఱచుచున్నాఁడు. "పిఱికి తనమింత యలవడ నికెవ్వరు గఱపిర"ని అతని పౌరుషముపైఁ దెబ్బ కొట్టుచున్నాఁడు. భీముఁడు శీఘ్రకోపి" ఉద్రేకమునాపుకోఁ జాలనివాఁడు. కనుక అట్టివానిని రెచ్చగొట్టు చున్నాఁడు.

క॥ వెఱపెట్టిదియో యెన్నఁడు
నెఱుఁగని నీయట్టివాని కెవ్వరొకో యీ
పిఱికి తన మింత యలవడఁ
గఱపిన వారనుచు శౌరి కల కల నవ్వెన్.

భా. ఉ. 3-57

ఈ పలుకులలో ప్రతి పదమునందు వ్యంగ్యము ధ్వనించుచున్నది. వెఱపు అనునది ఎటువంటిదో ఎఱుఁగనివాడు భీముఁడు! ఎన్నడును ఎఱుఁగని వాఁడు. అదియు "నీయట్టి వానికి" అని ప్రశ్నించుటలో బాల్యము నుండియు బలప్రదర్శనలో పేరెన్నిక గన్నవాఁడని, రాత్రి పగలు పాండవుల నాపదలనుండి రక్షించుటలో భీతిలేనివాఁడని,

హిడింబాది రాక్షసులను గూడ మట్టు పెట్టఁ జాలినవాఁడు – అని ధ్వనించుచున్నది,

"ఎవ్వరొకో" – ఎంతటి సమర్థులో "ఈ పిఱికితనము" – ఇట్లు – బాల్యమాదిగ శత్రువులైన వారితో భార్యవలువలనూడ్చిన వారితో సంధి గావించుకొని జీవింతుననుు నంతటి పిఱికి తనము "ఇంత యలవడ" గఱపినవారు – అనుచు శౌరి కల కల నవ్వినాఁడఁట! ఆ నవ్వులో వ్యంగమెంత మనోహరముగ గోచరించుచున్నది!

అయినను భీముఁడు చెదరలేదు, చలింపలేదు. "బంటుతనము మాటలకు త్వరపడకుము. పాండునృపాలుని పాలు గైకొనుట చాలు నను ధర్మజుని పలుకుల కడ్డ పడరాదని, ఇట్లు పలికితిని. మిన్నునేల ఏకమైనను ముంజేతులొడి పొవఁదోఁవఁ గలవాఁడన"ని భీముఁడు పలికినాఁడు.

అంతటి ఛలోక్తితోనే "ఈసారికి సంధికే పోయిరమ్మ"ని పంపినాఁడు. శ్రీ కృష్ణుని.

అర్జునుఁడు శ్రీ కృష్ణునితో పలికిన మాటలు—

"ధృతరాష్ట్రుఁడు లోభ దూషితుఁడు, ధాత్రీభాగమును ఈ నేర్చునా! సుతుఁడు దుష్టుఁడు" అని వారి దేష్ట్యము నుగ్గడించినాఁడు. అనంతరము సర్వాంతర్యామి, సర్వ కార్య కరణ దక్షుఁడునగు శ్రీకృష్ణుని మనస్సును తడవుచున్నాఁడు—

"సంధి యేల కలుగునను తలంపు నీకు ముందే కలిగినది" అని శ్రీకృష్ణుని తలంపు పసిగట్టిన అర్జునుఁడు సంధి కలుగదని తెలిసికొన్నాఁడు. వెంటనే

"నీ వొనరింప పూనిన పనికి కీడు పుట్టునా!" అని ప్రశ్నించినాఁడు. ఇచ్చట సంధియేల కలుగునను తలంపు నీకు కలఁదని "నీవొనరింప

పూనిన పనికి కీడుగలదా" అని పలుకుటచే అర్జునునకు ముందు జరుగఁ బోవునదేమో తెలిసిపోయినదని మనము గ్రహింపవచ్చును.

"నీ వొనరింప పూనిన పనులు కావునునట్లు యుండియగును" అని పలుకుటచే - యుద్ధమున తమకు జయము కాదనినట్లున్నను అగునని ధ్వనింపఁ జేయుచున్నాఁడు, ఎందులకన - పాండవుల సేనకు సంఖ్య తక్కువ, అయినను సారథి సరోత్తమ సంసార చక్రసారథి.

కడకు-సంధి విషయమును ప్రస్తావించుచున్నాఁడు "ఒడంబఱచి, వారికి, మాకు పుడమి సగముగా చేసి పొంది పొసఁగి యుండునట్టి మార్గము చేయుట మిక్కిలిమేల"ని "అది గౌరవము, సుఖము చేకూర్చునని" తెలుపుచున్నాఁడు.

అందులకు శ్రీ కృష్ణుఁడు - పౌరుషము - ప్రసన్నమగు దైవము చేతనే ఫలించును. కావున నా యోపినంత సంధికి పురుషకార మొనర్చెదను. మఱి దైవముచేత నెట్లగునో నేనెఱుంగన"ని తెలిపినాఁడు.

ఇచ్చట శ్రీ కృష్ణుఁడు సంధికి పురుషప్రయత్నము చేయుటకు మాత్రము పోవుచున్నాఁడు.

శ్రీ కృష్ణునకు "సంధి" జరుగదని తెలియును, "సంధి" వలదనియు నతని నిశ్చయము.

ఇచ్చట పాండవులకు కూడ ఎవ్వరికిని "సంధి" యనునది ఇష్టము లేదు. భీమునకసలే 'సంధి' యిష్టములేదు. అతనికి దుర్యోధన దుశ్శాసనులను చంపి ప్రతిజ్ఞ నెరవేర్చు కొనవలసి యున్నది. వీరందఱును తమ తమ అభిప్రాయములను మఱుగు పఱచిరి. కాని ఒక్క సహదేవుఁడు మాత్రము యథార్థభావములను వెల్లడించినాఁడు—

"ఈ రాజును ఇతని తమ్ములును తగని మాటలాడుదురు. వానిలో నొక్కటియును కాదనక నీ పూనుచుందువు సుయోధనుఁడు భూమిలో సగమిచ్చువాఁడా? ఇంతలేసి దొరలు ఈ దైన్యమును పొందుదురా? ధర్మజుఁరు వేడుట – కృష్ణుండలుగ బోవుట – ఆధార్త రాష్ట్రుఁడు పాలీక చలమున పెనఁగుట ఇట్లును కూడు తిపగునా" అని ప్రశ్నించుచున్నాఁడు.

"వీరలు ధర్మమార్గమున పోయినను, వారలు దానికియ్యకొనినను అట్టి సంధి పెంపారదు. కయ్యమే ఉచితము" అని నిశ్చయముగ తెలిపినాఁడు.

"మాయలు పన్ను నేర్పింక చెల్లదు. అని సుయోధనునితో పలుకుమ"నినాఁడు. "తుది రాజ్యము సగము గొమ్మ"ని తెలుపు మనినాఁడు.

ద్రౌపది శ్రీ కృష్ణునితో తాను మున్ను కౌరవులతో పడిన పాట్లు విన్నవించు కొనినది.

"తీరున కొడఁబాటు గల్గిన తెలివితేని వారని నిందింపరా? వీరు అయోగ్యులనరా! సిగ్గులేని వారని యాడరె లోకము వారు కేశవా" అని ప్రజల భావనలనుగా తన భావములను వ్యక్తపఱచినది.

కొప్పుముడి వేగముగ విదలించినది. వెండ్రుకలను తాను ఎడమ చేతిలో పూనినది. గోవిందునిముందు బెట్టినది.

"క॥ ఇవి దుస్ససేను వేళ్ళం
దవిలి సగము ద్రెవ్వి పోయి దక్కిన యవి కౌ
రవులకడఁ దీఱు మాటల
యవసరమునఁ దలఁవ వలయు నచ్యుత వీనిన్"

భార. ఉ. 3 116 ప.

అని "సంధి" చేయువలయునను సంకల్పము కలిగినప్పుడు "నీవు సుభద్ర కడునెయ్యము గారవముండలిర్ప సంభావన సేయు నాకు, గలిగిన పరాభవమును గుర్తించుకొనుమని పలికినది. ఇచ్చట ద్రౌపది పలుకులు "సంధి"కి పూర్తిగా విరుద్ధము. సహదేవుడు స్పష్టముగా "సంధి" కథయే లేదనినాడు స్త్రీ సహజమగు పరితాపముతో భర్తల విక్రయమునకు, గాండీవి గాండీవమునకు పని కల్పించవలెనని ప్రార్థించినది "ఇట్లు బన్నములు నడిన ధర్మనందనుడు నేను రాజ రాజు పీనుంగుగన్గొనగాన బడ నుమైతిమేని కృష్ణ" అని రాజ రాజు పీనుగును చూచుటయే తాము పడిన కష్టములకు పశమనమని తెలుపుచున్నది.

అప్పుడు శ్రీ కృష్ణుడు ద్రౌపదితో యథార్థమునిట్లు తెలుపు చున్నాడు.

తే॥ పూని పలికెద వినుము రిపుక్షయంబు
చేసి యుజ్జ్వల పుణ్య లక్ష్మీ సమేతు
లైన పాండు కుమారుల యధిక విభవ
మీవు సూచెదు తడవులేదిది నిజంబు"

భా. ఉద్యో 3 124 ప.

అని కౌరవుల వినాశము నిశ్చయమని తెలిపి – హస్తినాపురిని చేర కొనినాడు.

శ్రీ కృష్ణుడు – హస్తినాపురిని చేరికొనినాడు. ధృతరాష్ట్రుడు పంపిన ఫలముల ననుభవించినట్లు నటించెను. కాని భుజింపలేదు' సంభావించిన వారినందఱిని ఆయ్యె తెఱంగుల సంభావించినాడు.

కుంతి కడకేగినాడు. ఆమెను ఓదార్చిన విధము—

"ఉత్సాహంబున శత్రుకు
లోత్పాదన విధి యొనర్చి యున్నత సామ్రా
జ్యోత్సవము నొందు పుత్రుల
నుత్సుకతం జూతు గాక యూరడు మింకన్"

భా. ఉద్యో-3 206 ప.

అని కౌరవ వినాశమును – పాండవుల విజయమును – యుద్ధము సంభవించుటను – సంధికై వచ్చిన శ్రీ కృష్ణుఁడు తెలుపుచున్నాఁడు.

దుర్యోధనుఁడు శ్రీ కృష్ణుని విందుకు రమ్మని యాహ్వానించినాఁడు.

"దూతలెందును తొలి తొలిని కుడువను కట్టను పూనుకొనరు. వచ్చిన కార్యమును నెరవేర్చుము. పిదప అన్నియు చేయవచ్చును" అని శ్రీ కృష్ణుఁడు నిరాకరించినాఁడు.

దుర్యోధనుఁడు శ్రీ కృష్ణుఁడు తమయింట కుడువ నొల్లకుండుటకు కృష్ణునితో నిట్లను చున్నాడు —

'వలయునన్న పానముల పలుదెఱఁగుల మేమొద గూర్చితిమి. నీవు వానినుపయోగింప కుండుట' బాంధవమునకు నీతికి బాహిరము. కౌరవులకు, పాండవులకు నీవొక్కరూప! అసదృశ ధర్మాచారుఁడవు ఇట్లనుటకు హేతువేమి యని యడిగినాఁడు.

అప్పుడే శ్రీ కృషుఁడు దూతలు ముందుగా కుడువను కట్టను పూనుకొనరు వచ్చిన కార్యమును తీర్చిన అనంతరము అన్ని సౌకర్యముల నొసంగు మనినాఁడు.

అప్పుఁడు దృతరాష్ట్రుఁడు పలికిన పలుకులు వారు 'సంధి కార్యము" నకు సుముఖులుగా లేరని చక్కగా తెలియుచున్నది. "వేగపడుట మేలు కాదు. కార్యము తీరవచ్చు తీరకపోవచ్చు. దాని మార్గము

వేఱు. నీవు ముకుదాౕటఁ కాలు ద్రువ్వనేల!" అని ప్రశ్నించినాఁడు. ఇచ్చట కార్యమునకు తాము సుముఖులమైనట్లుగా లేదు అని తెలియ చేయుచున్నాడు. కావున కార్యముతో భోజనమునకు సంభంధము లేదని వాదించుచున్నాఁడు

అప్పుఁడు శ్రీ కృష్ణుఁడు నిర్భయముగా నొక సత్యము నిట్లు తెలుపుచున్నాఁడు.

పాండవులు నాకు ప్రాణములు . పాండవులతో క్రోధము పెంచు కొన్నావారు మీరు. కనుక నాకు పగవారలు మీరు.

కII పగ వారియింటఁ గుడిచిన
నగుఁ దమ కనుమాన మమృతమైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టగ
దగదొడళుల కెప్పుఁ డెవ్విధము వాటిలోనో.

భార. ఉద్యో-3 255 ప.

తెలిపినాఁడు. పగవారియింట భుజించువాఁడు జాగ్రత్తగా నుఁడవలెను. పగవానికి పెట్టువాఁడును అతి జాగ్రత్తగా పెట్టవలెను. పగవారియింట అమృతమిడినను అనుమానముతో దానిని విషమేమో అని భావించు చుందురు. దీనికితోడు తినిన తర్వాత ఏమి కలిగినను అపనింద తప్పదు. విదురునింటికిఁజని శ్రీ కృష్ణుఁడు భుజించినాఁడు విదురుడు శ్రీకృష్ణునకు నిజమైన భక్తుడుఁ. అతనివలన కౌరవుల అభిప్రాయమును సేకరించినాఁడు విదురుఁడు శ్రీ కృష్ణునకు ఉన్న విషయమును తెలిపినాఁడు

ధార్త రాష్ట్రులందఱును గూడి తమలో నిశ్చయించిన విధానమును తెలిపినాఁడు. "వారు నీ శాసనము నుల్లంఘింపఁ దలఁచినార"ని స్పష్ట పఱచినాఁడు.

"సంధి కానేరద"ని వారి అభిప్రాయమును బయట పెట్టినాఁడు.

ఇట్లు దూతగా వెళ్లినవారు – అక్కడి జనుల అభిప్రాయములు అపుల ముఖమున తెలిసికొని ముందడుగు వేయుట ఎంతయునుచితమగు కార్యము. కనుక శ్రీ కృష్ణునకు పాండవులు సంధి కియ్యకొనరను విషయము స్పష్టముగా తెలిసిపోయినది.

సభ సమావేశమైనది – సభ తీరినది—

శ్రీ కృష్ణుఁడు జలదస్వన గంభీరమగు నెలుపుతో ప్రారంభించి నాఁడు. ధృతరాష్ట్రునితో మొట్ట మొదటి వాక్యములోనే తాను వచ్చిన కార్యము తెలిపి వేసినాఁడు.

"క్షీరోదక గతి పాండవ కౌరవులొడగూడి మనుటమేలు" అని ప్రారంభము. ఇచ్చట పాండవులు క్షీరముతో, కౌరవులు ఉదకముతో పోల్పఁబడిరి. ఇరువురు పాలు – నీళ్లవలె కలిసిపోయిన – పాల సాంగత్యముచే నీటికి గౌరవము కలుగగలదని ధ్వని. అట్లు గావింపఁ జాలిన వాఁడు ధృతరాష్ట్రుఁడు!

అనంతరము వారి వంశ ప్రతిష్ఠ మట్టిలో కలిసిపోవక కాపాడ వలెనని తెలియఁజేయుచున్నాఁడు—

"భరత వంశము మీది, ఆ వంశము పాడి, సత్యములకు ప్రసిద్ధి వహించినది. కరుణ – పొత్తు కలిగి యుండునది. అందును సద్గుణ శ్రేష్ఠులు మీరు, నీ తనయులు–యశోధురంధరులు. ఈ క్రమమును తప్పకుఁడు."

సత్యమును న్యాయమును పరిరక్షింప వలసినదని బోధించినాఁడు. పొత్తు గలిగి బ్రతుకుట మీ వంశమునకు పరిపాటి "అను చరిత్ర తప్పకుండ చూచు బాధ్యత నీది" అని వంశప్రతిష్ఠను తడవినాఁడు.

"అట్టి వంశమునకాధారము నివు, ఇంకెవ్వరి మేలైనను, కీడైనను నీకే చెందును. కావున జనస్తుత్యమగునట్లుగా పొత్తుకలిగి యుండుడ"ని హెచ్చరించినాఁడు.

"ఈ సుయోధనాదులు వంశగౌరమును లెక్కింపరు. ఇది ధర్మము కాదని వెనుకాడరు. మూర్ఖముతో బంధుకోటి మనస్సులను నొప్పింపగా నవగుణముల కుద్యుక్తులగుదురు" అని దుర్యోధనాదుల దుష్టబుద్ధి నెత్తి చూపినాఁడు.

"కౌరవ పాండవులు శాంతితో జీవించుట తగునని – యుద్ధము కలిగిన వంశ నాశనమగునని హెచ్చరించినాఁడు.

"నీకు వలసిన తీర్పంగ నేరవచ్చు. తెఱఁగు నివశములోనిదియ కాన" అని పొత్తు కలుపుట యందతనికిఁ గల ప్రాముఖ్యము నెత్తి చూపినాఁడు.

"నీవీ సమయమున ఉపేక్షించినచో కౌరవ పాండవులకే కాదు. పృధ్వి కంతకును కీడు వాటిల్లునని, జగత్తు నాశమగున"ని వివరించి – అందువలన కలుగు ఫలితములను సూచించినాఁడు.

"పాండవులు సమయమును పాలించి యర్ధ రాజ్యము పొందఁ గలమను కృత నిశ్చయముతో నున్నార"ని వారు గావించిన సమయ నిర్వహణమును గుర్తుకు తెప్పించినాఁడు.

ఇట్లు ధృతరాష్ట్రునకు – "సంధి" గావింపవలసిన కర్తవ్యము – అందాతనికి గల ప్రముఖ స్థానమును – యుద్ధము వలని నష్టములను వివరించి చెప్పి – సభవైపు తిరిగినాఁడు.

"పవిత్రమగు ధర్మము పాపము చేత నశించి పోవుచున్నప్పుడు విమలమగు సత్యము అసత్యముచే నాశముపొందు అవస్థను పొంది నపుఁడు – ఆ వినాశమును తొలగింప గల్గ సామర్థ్యముండియు దక్షు

రేవరైన ఉపేక్ష చేసినచో అది వారికే ముప్పు తెచ్చును" అని దక్షులైన వారిని ధర్మమును కాపాడుటకు తర్జించుచున్నాడు.

తుదకు దైవము ధర్మమునకే జయమును, సత్యమునకే విజయమును చేకూర్పగలడని - తెలిపినాడు.

కౌరవులు సంధి కొడంబడి రాజ్యభాగమొసంగనిచో ధర్మనాశము సంభవించును. జరుగబోవు ధర్మనాశముపేక్షించిన పాపభాజనులు కాగలరని సభాసదులను బెదిరించుచున్నాడు.

తిరిగి ధృతరాష్ట్రునితో వివరించిన తీరు—

"పాండవుల తండ్రి భాగమును వారికిమ్ము! నీ పాలు నీవు పుత్ర, పౌత్ర చయముననుభవింపుడు. సుఖులరై యుండుడు. ఇదియే బంధువులు, మిత్రులు, సుజన సముదాయము మెచ్చు విధానము" అని పలికినాడు.

"నీ పుత్రుని మనసులోని లోభమును మాన్పుమ"నెను. "పాండవులు శాంత సూరులు. భవచ్ఛరణములను కొలువబూనినారు. మీ కది మనమున కప్రియమైన యుద్ధమునకు వచ్చుచున్నార"ని పాండవుల నిశ్చయమును తెలిపినాడు.

అప్పుడక్కడ సమావిష్టులైన మహామునులలో - జామదగ్ని యను మహాముని దంబోద్భవుడను రాజు చరిత్ర నుదహరించు చున్నాడు.

"దంబోద్భవుడను రాజు - నర నారాయణులను యుద్ధమునకు పిలిచినాడు. ఆ నరనారాయణులే- ఈ పార్థ కేశవులు. ఆ దంబోద్భవుడు నరునిచే భంగపడినాడు. కనుక దంబోద్భవునివలె ఉద్ధతి వలదు. "పొందియుండుటమేలు" అని పలికినాడు. కణ్వుడను మహాముని—

గరుత్మంతని వృత్తాంతమును వివర్పించెను. తను ఎదిరిని మది నెఱుంగక నిగ్రహించి మదమెత్తుట తగదు" అని పలికినాడు.

నారద మహర్షి: ఎంతటి బలవంతులైనను — ఎదిరి బల మింకను అధికమైనపుడు కీడ్పడును, ఎంత బలము కలిగినను—నయ మార్గ వృత్తి నిలిచినట్లుగా — గర్వము నిలువదని తెలిపినాఁడు.

గాలవుని వృత్తాంతము వివరించి — నిర్బంధము, దుర్మానము తగదని — కృష్ణుని మాటవిని కౌరవాన్వయమును రక్షింపవలసినదని — బోధించినాఁడు.

దుర్యోధనుఁడు — నారదాది మునుల మాటలు వినక నిరాక రించెను. అప్పుఁడు ధృతరాష్ట్రునితో వేడుకపై దుర్యోధనునితో శ్రీ కృష్ణుడిట్లు పలుకుచున్నాఁడు.

"నీకు తులువ తనము వలదు. అల్పబుద్ధుల వెడ మాటలను వినకుము. పాండిత్య శౌర్య నిత్యులు పాండు సుతులు — వారితోఁ గూడి యుండుట తగును. భీష్మాదులును అందులకు మెత్తురు. శకుని, కర్ణ, దుశ్శాసనుల మంత్రములచే కార్య తంత్రము కాఁజాలదు తోడఁబుట్టువులను నెట్టితివి. పెలలను దుర్బలురను కూడంబెట్టుదువు. ఆ పాండవులు—సత్యము తప్పనివారు, పాడి తప్పనివారు ఒకప్పుడును కోపము వహింపని వారు. వారి బంధుత్వము నేల వలదనుచున్నాను. ఈ యున్న రాజులందఱును పాండుసుతునకొక్క యెత్తు.

సవ్యసాచితో సమానుఁడగు వాఁడు నీ బలమున నొక్కఁడులేఁడు. నీ కీర్త్య గఱపిన వీఱవ్వరు ఖండనమున నిలువఁజాలరు. బహు జన క్షయము వలదు. దొరవు నిప్పు, నీకు కుల నాశకుండను దూఱు తగదు. పాండవులతోఁగూడి బ్రదుకుము"

ఇట్లు దుర్యోధనునకు—బుద్ధులు గఱపువారు మంచి స్నేహితులు, హితులు కారని — పాండవులతో కలిసియుండుటే సర్వ విధముల శ్రేయస్కరమని తెలిపెను.

భీష్మ, ద్రోణులును — కలిసి యుండుటకై బోధించిరి. వంశ నాశము వలదనిరి.

అప్పుడు దుర్యోధనుడు—

"ఆ ధర్మజుండు జూదరి. శాబలునిచేత రాజ్యమును కోల్పోయి నాడు. తన ఇచ్ఛతో జూదమాడెనే కాని — దీనికి కారణము నేనా?" అని ప్రశ్నించినాడు.

"లొంగి సురపతికైనను మ్రొక్కను. నృప ధర్మముపూని యుద్ధ యుద్ధమునందు చచ్చిన—ఇచ్చట కీర్తి, స్వర్గమునందు అధిక్యము కలుగును

ఆ నాడు చిఱుతనము చేత న్యాయము తెలియక అటుపోవ నిచ్చితిని. ఇంకపైన పితామహుండు, జనకుండును—భూమిని సగము పంచి యీయందలంచినను నేనెందులకు సమ్మతించెదను? తొంటి రుచిమఱిగినారు. పాండవులు. ఇప్పుడును రాజ్యమును ఏల జూచు చున్నారు.

ఏమును వారును పంచికొని ఏలుట కలదు. వాడి సూదిమొన ఇంచుక మోపినంత మాత్రమున భూమిని పాండుపుత్రుల కియ్యను. ఎవ్వరైనను సరే! జయము గొని రాజ్యము చేయవలెనని యే నిశ్చ యించితిని." అని నిష్కర్షగా రాజ్య భాగమును "సూది మోపినంత పైన" ఇచ్చుట లేదని చెప్పుచున్నాడు.

అతని పలుకులు విని శ్రీ కృష్ణుడు కుపితుండైనాడు. బాల్య మాదిగా వారు పాండవుల యెడ గావించిన దుష్కృత్యములను పేర్కొనెను. పుత్రునకు హితమును బోధించినది. నీతిని గఱపినది. దుర్యోధనుని చెవికెక్కలేదు.

దుర్యోధనుడంతటితో ఆగలేదు. అతడు తన అనుచరులతో పాటు శ్రీ కృష్ణుని పట్టుకొని చెఱంబెట్టం దలంచినాడు. అప్పుడు శ్రీ కృష్ణుడు విశ్వరూపమును ప్రదర్శించినాడు. దుర్నిరీక్ష్యమగు అతని తేజో రూపమును చూడంగొలదిగాక సకల జనులు నయనములు ముకుళింపంజేసికొని యద్భుత భయానక రసములం జొత్తిల్లిరి.

ఇట్లు "సంధి"— కార్యము విఫలమైనది యుద్ధము తప్పదని తెలిసినది.

శ్రీ కృష్ణుడు పాండవుల కడనుండి రాయబారిగా వచ్చినవాడు. పాండవుల కడ న్యాయము కలదని—వారికే జయము చేకూరవలయునని కాంక్షించువాడు. పాండవులకు రాజ్యభాగము—యుద్ధము గావింపనిదే లభించుట కల్ల!

కనుక—పాండవుల విజయార్థమై మఱొక భేదనీతిని ప్రయోగింప తలపెట్టినాడు.

కర్ణుని తనతో దూరముగా తీసికొనిపోయి అతని జన్మరహస్యమును తెలిపి కుంతీ పుత్రుడని తెలిపినాడు.

పాండవులు తన సోదరులని తెలిసినది. కర్ణునితో—"సామ్రాజ్యాధిపతివి కమ్ము. రమ్ము. పాండవులు నీ సోదరులు. ఛత్రచామరములను పట్టుదురు. ద్రౌపది నిన్నాఱవ భర్తగా గ్రహించును" అని పిలిచినాడు.

కర్ణుడు దుర్యోధనుని ప్రియమిత్రుడని శ్రీకృష్ణునకు తెలియును. కర్ణుని తలనే భారత యుద్ధము నిలిచి యున్నదనియు తెలియును. కర్ణుడులేనిది దుర్యోధనుని పక్షమున అర్జునునితో తులతూగు వారెవ్వరు లేరని తెలియును. కర్ణుడు దుర్యోధనునకై తను, మన, ధనముల నర్పింపగల త్యాగశీలి యనియు తెలియును. మఱి ఈ జన్మ రహస్యమును — యుద్ధము నిశ్చయమైన తర్వాత — సంధికార్యము విఫలమైన తర్వాత శ్రీ కృష్ణుడు కర్ణునకు తెలిపినదెందులకు?

ఇదొక గొప్ప భేదనీతి, కూటనీతి.

ఒకవేళ "కామినీ కాంచనములకు" 'ఐశ్వర్యమునకు" ప్రలోభము చెంది కర్ణుడు పాండవుల కడకు వచ్చెనా దుర్యోధనుడు రెండుచేతులు విఱిగి పోయిన ధనుర్ధారి యగును.

కర్ణుఁడు దుర్యోధనుని వదలి పోయినను అతని మానసమున-- పాండవులకు తనకుఁగల సోదర బంధము జాగృత మగును. అప్పుడు తన కెఱుఁక లేకనే కర్ణుడు వారియెడ ప్రేమ భావమును పెంచుకొన గలఁడు. పూర్వము తనకు వారియెడఁగల ద్వేషప్రమాణము తగ్గిపోవును

అంతపనియు జరిగినది. కనుకనే పాండవుల కడకు రాలేను, రాను -- అని ఖండితముగా శ్రీ కృష్ణునకు చెప్పుచునే శ్రీ కృష్ణునితో ఒక విషయము నర్థించినాఁడు. ఈరహస్యమును పాండవులకు తెలుప వలదని ప్రార్థించినాఁడు.

ఊహా! దూతచాతుర్యము! వాక్చాతుర్య ఫలము! అంతటి పగ, ద్వేషము గలిగి ద్రౌపదిని సభలో మఱొక్కని మగనిగా చేకొనుమని పలికినవాఁడు. అహర్నిశలు పాండుపుత్త్రుల వినాశమునకే దుర్యోధనునితో మంత్రాలోచనలు సలుపువాడు ఎట్లు పలుకుచున్నాడు! ఈ విషయ మెంత పని చేసినదో చూడుడు!

"తే॥ ధర్మతనయుండు తాను నా తమ్ముఁడగుట
యెఱఁగెనేనియు సామ్రాజ్య మేల పూను
నట్టి ధార్మికుఁడాధి పత్యంబు సేయ
వలవదే శాశ్వతంబుగ వసుధ కెల్ల" అని

భా. ఉద్యో-4 44 ప.

ధర్మతనయుని సామ్రాజ్యాధి పత్యమునకై కాంక్షించినాఁడు! అధర్మజుఁడు గావించు రణ యజ్ఞమున -- కురు కుమారులు తాను పశువులై -- వీరస్వర్గము నలంకరించు నవకాశమిమ్మనినాఁడు!

ఔరా! వాక్కునకుగల మహిమ, వాక్కులు గావింపని పనిలేదని పించుచున్నది. చేయదలచిన పని చేసి పోయినాఁడు రాయబారి. కర్ణుఁడు భారత యుద్ధమున కర్ణధారి! కర్ణధారి మనస్సున విషమునింపి మార్గమునుండి మరలింపఁ జూచినాఁడు. యుద్ధమున పాండవులకు

జయము కలుగు మార్గములను వెదకినాడు. మార్గము నిష్కంటక మైనది. యుద్ధమున విజయము పాండవులదనుటకు సందియములేదు!

ఇచ్చట మూఁడు రాయబారములున్నవి. ఒకటి ద్రుపద పురోహితుని రాయబారము—

ఇచ్చట రాయబారి మిక్కిలి పరుషముగా పలికినాఁడు. ధార్త రాష్ట్రుల దుండగములను తెలిపి ధృతరాష్ట్రునకు బుద్ధిసెప్పవలసినదని సభలో పలికినాఁడు,

ఈ రాయబారి కార్యమునకై వెళ్లి—ఎవరి వలన కార్యము సాధింప వలెనో వారిని పరుషములాడినాఁడు, వారిని దండింపుఁడని సభను అడుగుట – ధార్త రాష్ట్రుని దుండగముల నుగ్గడించుట – మిగుల పరుషమైనది. కనుకనే అతనిని భీష్ముఁడు—

"నీ వాక్యము విప్ర స్వా
భావికమై యిట్లు శ్రుతికిఁ బరుషంబైనన్
భావింపఁ గార్యమున యుం
దే విధమున సభకు నింత యిష్టంబగునే!

అని విప్రస్వాభావికమగు పరుష దనమున కార్యము గావింపఁజూచు చుంటివని తెలియఁజేసినాఁడు.

ఇఁక రెండవది – సంజయుని రాయబారము. ఇందు కేవలము చాతుర్య ప్రదర్శన కనిపించుచున్నది. కౌటిల్య మవగత మగుచున్నది.

రాజకీయరంగమున వక్రమార్గమునను సరించి వాక్చాతుర్యమును ప్రదర్శింపఁగోరు మంత్రులకిది మార్గ దర్శకము. ఈ నాటి ఎన్నికల ముందు – కపట ప్రచారములకు, ఉపన్యాస పటిమకు మార్గము ను చూపుచున్నది.

ఇచ్చుట–రాజ్యాంశమునిత్తుము "లేదు" అను రెండు విషయములను మఱుగు పఱచి అపూర్వ వాగ్వై చిత్రిని ప్రదర్శించినాఁడు. కనుకనే ధర్మజుఁడంత కంటెను వ్యంగ్యముగ సమాధానమిచ్చినాఁడు.

"నీవును, ద్రోవదియు, అనుజులును పుత్రచయమును క్షేమముగా నుండుటను "నితాంతస్నేహ పూర్ణచేతోవృత్తితో నరయఁ బుత్తెంచె"నని సంజయుఁడు పలికిన – ధర్మజుఁడందులకు "ఆ రాజు మావెసంగల కారుణ్యము కతమునన నిట్లున్నారము" అని వ్యంగ్యోక్తి విసరును.

"ఇట్లు సుఖంబున సున్నారము" అను పలుకులలో ప్రతిపదము లోను అపూర్వమగు ధ్వని గోచరించుచున్నది—

"ఇట్లు అనునది – మహారాజులై యుండవలసినవారు రాజ సూయాది యాగముల నిర్వర్తించిన శూరాగ్రేసరులు – అడవులలో క్రూరమృగముల సంగడమున దినములు గడిపి – అజ్ఞాత వృత్తిలో పరరాజున కూడిగములు గావించి – ఉండను నెలవు తిన తిండిలేని దీనస్థితియందు — అని ధ్వనించుచున్నది. కనుకనే "సుఖంబున" అని ప్రయోగించినాఁడు. "సుఖంబున నున్నారము" అనునదొక వ్యంగ్యము, అంతటివారు – ఇంతటి స్థితియందు" అని స్ఫురించు చున్నది

ఇట్లు మాటకు మాట – నేర్పుకు నేర్పు – చమత్కారమునకు – చమత్కారము సంజయుని రాయబారపు తీరు.

ఇఁక మూఁడవది శ్రీ కృష్ణుని రాయబారము:—

ఇది సకల దూతలక్షణములుఁగల ఒకానొక మేధాసంపన్నుఁడు— అవతార పురుషుఁడని గౌరవములు బడసినవాఁడు – అలౌకిక వ్యక్తిఁగా మన్ననలందినవాఁడు – ఇరు పక్షములవారి ఆదరమునకు పాత్రుఁడైన వాఁడు—పలుకులో సత్యము, కంఠములో గాంభీర్యము, ప్రజల ముగ్గుల గావింప సమర్థమగు వ్యక్తిత్వ విశేషము – వీనిచే వెలుగొందువాఁడు నడిపిన రాయబారము.

బయలు దేరుటకుముందు తమ పక్షమువారి కడ అందఱి అభిప్రాయముల గ్రహించినాఁడు. "తనది" అను నొక నిర్దిష్టమగు అభిప్రాయమును నిర్ణయించుకొన్నాఁడు. శాంతించిన వారిని రొచ్చగొట్టినాఁడు. దుఃఖించిన వారిని ఓదార్చినాఁడు. బయలుదేరునప్పుఁడు సూర్యోపాస్తి సేసి యగ్నిసమారాధనము గావించినాఁడు. ధరణీసురులకు ప్రణామ పూర్వకముగా ప్రయాణ దాన ప్రముఖ పూజా విశేషంబుల ప్రీతుల గావించినాఁడు. వారల యాశీర్వాదమును బడసినాఁడు. సాత్యకిని రావించి "దుర్యోధనుండు దుష్టాత్మకుండు అతఁడు మన్నించు మానుసులునుం గుటిల బుద్ధులు. కావున చక్రగదాది ఆయుధంబుల రథంబునఁ బెట్టింపవలయున"ని అయుధములతో సంసిద్ధుఁడైనాఁడు

దుర్యోధనుఁడొసంగు నిష్టాన్నమును తిరస్కరించినాఁడు భక్తుఁడగు విదురునింటికిఁ జని అతఁడిచ్చు సత్కారముల గ్రహించుచునె కౌరవుల అభిప్రాయములను సేకరించినాఁడు: ఆ సభలో ప్రతిపక్ష వీరులుండిరి భీష్మాది కురువృద్ధులుండిరి. ద్రోణాది ఆచార్య వర్యులుండిరి. నారదాది మహర్షులుండిరి. సభాసదులు — మంత్రులు — సామంతులు — వీరితో సభ కిటకిట లాడుచున్నది. "వింజ్రాబాకిడిన కరణి" నొప్పినది. ఇచ్చట సంపూర్ణచైతన్యము కృష్ణవిగ్రహములపై మఱలినది. కృష్ణ స్వనముపై మరలినది. ఇంతటి ప్రజా కర్షకులగు రాయబారులున్న—ఆ రాజ్యమెంత ధన్యమైనది! ఆ రాజెంత భాగ్యవంతుఁడు! అయిన నొక విషయము నడుగవచ్చును.

శ్రీ కృష్ణుఁడు "సంధి"కై వెడలినాఁడు కదా! రాయబారము, విఫలము తాలేదా! అని "రాయబారము"— విఫలమైనది నిజమే! కాని సఫలమైనదని చెప్పవలెను. ఎందులకన —

"దూత ఏవహి సంధత్తే
భనత్త్యేవచ సంహతాన్
దూతస్తత్కురుతే కర్మ
భిద్యంతే ఏన వా నవా" మ. 7-66

హత సమర్థుడైన – పొందియున్నవారిని భేదించుటకును భేదముండిన వారిని సంధించుటకును సమర్థుడు.

ఇచ్చట–ఈ రాయబారి–దుష్ట సంహార మొనర్చుటకు కంకణము కట్టుకొన్న రాయబారి సంధి సమకూరదని స్పష్టముగా నిర్ణయించుకొనియే వెడలిన రాయబారి "సారపు ధర్మము – విమల సత్యము చెడిపోవుచుండ ఉపేక్ష చేసిన ఆ దక్షునకు పాపము సంక్రమించునని" తెలిసి ధర్మ సంరక్షణకై వెడలిన రాయబారి! మఱి యా ధర్మ సంరక్షణ యేది అని యడుగవచ్చును.

పాండవుల మాయా జూదమున నోడించి యడవులకు పంపిన పాపులను దండించుటయే!

ఏక వస్త్రయగు భారతస్త్రీని "ఏకవస్త్రవైననేమి, విపస్త్రవైన నేమి" యని సభారంగమున కీడ్చి వలువలూడ్చిన పాపము – కఠిన శిక్షను పొందవలసి యున్నది. అందుకే "రాజ్యాంశమ"ను నెపమున "సంధి" గావింతునని ప్రయత్నించినాడు ఆ సంధి సఫలము కావలెనని ఈ రాయబారికి లేదు. కనుక రాయబారి సఫలుడైనట్లే! అతని రాయబారము సఫలమైనట్లే. అడుగవలసినది నాలుగు పెద్దల యెదుట, మునుల యెదుట అడిగివచ్చినాడు. దూతగా పంపినప్పుడు–సమయస్ఫూర్తితో చెప్పని విషయములను గూడ ఆచరింప వలసియుండును. అందువలన తమ పక్షము వారికి కొంతమేలు చేకూరునట్లు చూడవలసి యుండును.

అట్టిదే శ్రీకృష్ణుడు గావించిన పని – కర్ణ జన్మరహస్యమును తెలిపి ఆశలు చూపి వచ్చుట.

ఈ పని పాండవులు చెప్పి పంపినది కాదు. అయినను అప్పటికది సరియని నలంచి చేసి వచ్చినాడు.

కడకు – శ్రీ కృష్ణుఁడు – నారాయణావతారమే! కనుక తన్ను బంధింపవచ్చు దుష్టులకు విశ్వరూప సందర్శనముచే బంధింపఁ జాలనట్లు గావించినాఁడు.

దూత మానవ మాత్రుఁడైనచో నెట్లు అను ప్రశ్నయుదయించును. అందులకేదో ప్రయత్నము లప్పటికప్పుఁడు చూచుకొనవలెను.

స్వయముగా శ్రీకృష్ణుఁడే తాను దూతగావెళ్ళి గావించిన పనులను ధర్మజునితో నిట్లు తెలుపుచున్నాఁడు. "నా యోపినంత సామవాదము లాడితిని. నారదాది మునులను సుయోధనునకు బుద్ధులు సెప్పనట్లు సేసితిని. ఎంతట వినకున్న-కనుక దెచ్చికొని జంకించియు. భంగించియు ధిక్కరించియు, తృణీకరించియు, చూచితి. కార్యంబు భగ్నంబ గుటొల్లక వెండియు శాంత వచనంబుల పలికితి. అఁడనక్త దుర్జనత చేయంజూచిన నమాను షంబులగు వానిం గొన్ని వెడ మాయలంబన్ని పెకుక్కపోకలం బోయితి. ఎన్ని భంగుల సంధియ కావలయునని చూచితి. అప్పాపాత్ముండు – చలంబుతో గయ్యంబు వేడుచుంగాని యవశ్యంబు రాజ్యంబు పాలిచ్చువాఁడు కాఁడు. కౌరవుల యెడం దండంబు దక్క నొండుపాయంబు లేదు

ఇట్లు రాయబారిగా సంపూర్ణ ప్రయత్నములు గావించి యుద్ధమునకు నిశ్చయము గావించినాఁడు. శ్రీ కృష్ణుఁడు.

తారతమ్యముననుసరించి వాగ్ధోరణి మార్చినాఁడు. ధృతరాష్ట్రునకు మిత్రునివలె "జననాథ! నీ యెఱుఁగని పనులుగలవే" అని హితము గఱపి పెద్దతనము నిలబెట్టినాఁడు. దుర్యోధనాదులకు కొంత పరుషముగా బోధించినాఁడు. ఎవరికెంతవఱకు చెప్పవచ్చునో అంత వఱకు చెప్పినాఁడు. రాయబారిగా ఇప్పటికి భారతమున ఉజ్జ్వల మూర్తిగా వెలుగుచున్నాఁడు.

❖❖❖❖❖❖❖❖❖

కూటనీతి :—

శత్రువునకు శత్రువు తనకు మిత్రుఁడు అనునదొక కూటనీతి.

అర్జునుఁడస్త్ర విద్యా ప్రదర్శనము గావించుచున్నాఁడు పాండవ పక్షము నందా నందోత్సాహములు నిండినవి. దుర్యోధనాదులు నిరాశోపహతులైరి. దీనదశయందుండిరి. అట్టి యెడ క్రీడారంగమున — కర్ణుఁడు ప్రవేశించినాఁడు. సాలప్రాంశువు, నిజోజ్వలత్కవచుఁడైనాఁడు అర్జునునిఁగాంచి — "ఈ రంగభూమి అస్త్ర విశారదులకెల్ల సామాన్యము. ఏరికిఁ జారనగును వీరికి కాదు అను విచారము లేదు" అనెను.

అప్పుఁడు కృపాచార్యుఁడు "నీ జనని జనకులెవరో తెలుపు" మనెను. కర్ణుఁడు తలవంచినాఁడు. దుర్యోధనుఁడప్పుఁడు కృపునితో-

క॥ కులము గలవాఁడు శౌర్యము
గలవాఁడును నధిక సేన గలవాఁడును భూ
తలమున రాజను నామము
వెలసిల్లగఁ దాల్చు—

అనెను. కనుక రాజను నామము ధరించుటకు, క్షత్రియ కులము శౌర్య పరాక్రమము, అధిక సేన ఇవి నియతమగు అర్హతలు.

అప్పుఁడు—దుర్యోధనుఁడు—వివిధ రాజన్యులు, యదువంశజులు చూచుచుండ కర్ణుని అంగ రాజ్యాభిషిక్తుని గావించినాఁడు.

కర్ణుఁడొక్కఁడే తన శత్రువగు అర్జునునకు సరియగు ప్రత్యర్థి అని ఆ క్రీడారంగమున దుర్యోధనుఁడు నిశ్చయించినాఁడు.

అంగరాజ్యాధిపతిని గావించి, "రాజ"ను నామమునకు పాత్రునిఁ గావించి అర్జునునితో ధనుర్విద్యా ప్రదర్శనమునకై పోటిగా పు కొల్పినాఁడు.

ఇట్లిరువురకు కలిగిన మైత్రి.— ఆ మరణాంతము శాశ్వతముగా నుండిపోయినది. దుర్యోధనునికి — ఘోష యాత్రాది ఆపదలో, గోగ్రహణాది ముట్టడులయందును, రహస్య మంత్రాలోచనలయందును చేదోడై నిలిచినాఁడు. కురుక్షేత్ర యుద్ధమున కుడి భుజముగా సహక రించినాఁడు. కడకు పాండుకుమారులు తన తమ్ములని తెలిసినను, శ్రీ కృష్ణుఁడేవచ్చి స్వయముగా పాండవ పక్షమునకు రమ్మని పిలిచినను దుర్యోధనుని సహచర్యమును వీడక —నిలిచి— "దుష్ట చతుష్టయములో" నొక్కఁడై పేరెన్నిక గాంచినాఁడు. ఇట్లు అర్జునుని ప్రత్యర్థిగా వచ్చి దుర్యోధనునకు మిత్రుఁడైనిలిచినాఁడు. కర్ణుఁడు! దుర్యోధనుఁడు శల్యున పొగడి, ఆదరించి తనవైపు త్రిప్పుకొనెను.

ఇదొక కూటిల నీతి—

శ్రీ కృష్ణునితో సమానముగా సారథ్యమున నేర్పరి శల్యుఁడొక్కఁడే! ఈ విషయము నెఱింగినాఁడు దుర్యోధనుఁడు. ఎటులైనను శల్యుని తనవైపు యుద్ధమున త్రిప్పుకొనవలెనని నిశ్చయించినాఁడు శల్యుఁడు పాండు కుమారులకు మేనమామ. యుద్ధ సన్నాహములు జరుగు చుండినవి అప్పుఁడు ధర్మతనయుఁడు శల్యుని కడకు దూతలనంపి రమ్మని యాహ్వానించినాఁడు. శల్యుడు సేనాసహితుఁడై. పుత్ర సమేతముగా పాండవులున్న యెడకు బయలు దేరినాఁడు.

ఇది విని కౌరవపతి మద్రనాథుఁడు చనుదెంచునని దక్షులగు ఆప్తజనులను పంపెను.

వారును — మఱుగున నుండియే — మార్గముల బహు భంగిమల అలంకరించిరి. తియ్యని నీటితోఁగూడిన దీర్ఘికల నిర్మించిరి. ఎటు చూచినను ఏనుగులకు, గుఱ్ఱములకు విశ్రమించుటకై కొట్టములు, సేవకులు విశ్రమించు స్థావరములు — కూరగాయలు — వంటకట్టెలు సమకూరు చుండినవి. ఏనుఁగులకు, గుఱ్ఱములకు — గడ్డి, దాణములు నిగూఢముగా అమరుచుండినవి.

ఇట్టి సమస్త వస్తు సౌభాగ్యముల కొఱకై శల్యుడు సంతుష్టుఁడైనాఁడు. ఇంత చతురముగా తనకు తన సేవకు, బలములకు వలయు వానిని సమకూర్చు వారెవ్వరో యుధిష్ఠిరుని మంత్రులై యుండవలె. "వారిని. తేవ్కొని రండు, అనుగ్రహ దానములు కర్తులువారు" అని శల్యుడు పలికినాఁడు. తోడనే మఱుగున నున్న దుర్యోధనుఁడెదురు పడి నమస్కరించి, తన్నెఱుక పఱచు కొనినాఁడు, "నీ యభీష్టమేమి నెరవేర్తున"ని శల్యుఁడు పలికినప్పుఁడు – దుర్యోధనుఁడు "సత్య సరస్వతివి కమ్మ. పాండవులతో యుద్ధమున నా పక్షమునవలంబించి, వాని సైన్యము నడుపుము ఇదియే నాయభీష్టమ"ని అర్థించినాఁడు.

ఇచ్చిన మాటకు కట్టుబడి, పాండవుల మేనమామ కౌరవుల పక్షమున యుద్ధ మొనర్చినాఁడు. కర్ణునిసారథియై భారత రణమొనర్చినాఁడు.

శ్రీ కృష్ణుఁడు ప్రయోగించిన మఱొక భేదనీతి :

శ్రీ కృష్ణుఁడు రాయబారిగా దుర్యోధనుని కడకేఁగి అచ్చట యభిప్రాయములను కనుగొనినాఁడు

దుర్యోధనుఁడు పాండవులకు భూ భాగమొసంగుటకు నిరాకరించెను. యుద్ధము నిశ్చయమైనది. పాండవులలో–అర్జునునితో సాటివచ్చువాఁడు. కురుసేనలోని కర్ణుఁడొక్కఁడే. కర్ణుఁడెవ్వరో శ్రీ కృష్ణుఁడెఱుంగును

కురు పాండవ బాలుర అస్త్ర విద్యాప్రదర్శన సమయమున కర్ణుఁడు దుర్యోధనుని కలిసినాఁడు. అప్పటినుండి – ఎన్నోవిషాద సంఘటనలు జరిగినవి. ఎప్పుఁడును శ్రీ కృష్ణుఁడు కర్ణునితో అతని జన్మ రహస్యమును తెలుపలేదు.

సంధి పలుకులు విఫలములై శ్రీ కృష్ణుఁడు వెనుతిరుగుచున్నాఁడు. కర్ణుని తనతో దూరముగా తీసికొని పోయినాఁడు.

కర్ణుని జన్మ రహస్యమును తెలిపె, మార్తాండుని వరమున కుంతికి జన్మించిన వాఁడవని తెలియఁజేసినాఁడు.

"ధర్మతనయుఁడాదిగాఁగల నీ తమ్ములందఱును నీ యడుగుల కెఱఁగుదురు. నిన్నగ్రజునిగా సేవింతురు. పుత్ర, మిత్ర బంధుసేనా సమన్వితముగా నిన్ను కొలుతురు. రాజ్యభార వహనమునకు పట్టము కట్టి వెలిఁగిపోదురు. రమ్ము" అని రాజ్యమును ఎఱగా జన్మరహస్యము తెలిపినాఁడు.

"నీవు సామ్రాజ్యమునందభిషిక్తుఁడ వగుదువు తొలుత వెడలు నప్పుడు ఆ మహోత్సవమున యుధిష్ఠిరుఁడు యువరాజై ధవళ చామరములు వీచును. వాయుపుత్రుఁడు సితచ్ఛత్రము పట్టును. సవ్యసాచి స్వయముగా సారథ్యము చేయును" అని మహేంద్ర వైభవము నూరింపఁజేసినాఁడు. "మహీచక్రము నేలుదువు" రమ్మని పిలిచినాఁడు.

"పాంచాల రాజపుత్రియు నిన్నారవ భర్తగా కొలువఁగలద"ని కామినీ కాంచనముల ప్రలోభమున వల వేసినాఁడు.

ఈ నాఁటికి – ఒక పార్టీ నియమములకు, నీతికి స్థిరముగా కట్టు బడని కొందఱు ప్రలోభములకులోనై దినమొక పార్టీలో చేరుచుండుట మనము చూచుచునే యున్నాఁము. కాని, స్థిరచిత్తుఁడు దృఢమైత్రీ పాశబద్ధుఁడునగు కర్ణునిపై ఇట్టి ప్రలోభములు పని చేయులేదు.

ఎన్నో విషమ పరిస్థితులందాతని జన్మ రహస్యమును వడపక – యుద్ధము జరుగఁబోవు సమయమున – తెలియజేయుట – శత్రుపక్షము వారిలో నున్న బలవంతుని, కీలకస్థానము నందుండు వానిని–ప్రలోభము చూపి తమ వైపునకు త్రిప్పుకొనుటకై చేయు కృషి ఇది,

అర్జునునితో సాటిగా పోరఁగలవాఁడు కురువీరులలో కర్ణుఁ డొక్కఁడే!

ఆ కర్ణుని బలమును పూర్తిగా నమ్మి దుర్యోధనుఁడర్జునుని చంపవచ్చునని ఉత్సాహము కలిగి యున్నాఁడు.

ఆ కర్ణుని పాండవుల వైపునకు త్రిప్పుకొనఁజూచుట—దుర్యోధనుని కోఱలు పీకిన పామును చేయుట వంటిది. నీటినుండి మత్స్యమును బయట పడవేయుట వంటిది.

అప్పుడు కర్ణుఁడు శ్రీకృష్ణునితో నిట్లు పలుకుచున్నాఁడు—

"ఆ కురుకులేశ్వరుఁడు — సూతసూనుఁడు వీఁడని నన్నెంచ లేదు. తన తమ్ముల కంటెను, సూనుల కంటెను అధికమగు ప్రేమతో నన్ను చూచుకొనును అట్టి కురుకులేశ్వరుని బాయలేనని" తెలిపినాఁడు.

"నన్ను అర్జునునకు ఎదురని పెద్దగా నమ్మినాఁడు, అతని నమ్మకమును వమ్ముచేసి పాండవుల కలయఁజాలన"ని తెలిపినాఁడు. "అర్జునునితో ఇట్టిసమయమున తలపడక" వారితోనె కలిసి పోయిన ప్రజలు నగరా! నీవతి నిర్మల బుద్ధితో హితముపదేశించితివి అది నామదికి సొరదు అని నిశ్చయముగా పలికినాఁడు, కడకు శ్రీ కృష్ణుఁ డాశించినది జరిగినది.

"ఈ రహస్యమును పాండవులతో తెలుపవలద"ని యర్థించినాఁడు. శ్రీ కృష్ణుని ఆశ నెరవేరినది—

తే॥ ధర్మ తనయుండు తాను నా తమ్ముఁడగుట
యెఱిఁగె నేనియు సామ్రాజ్య మేలపూను
నట్టి ధార్మికుఁడాధి పత్యంబు సేయ
వలవదే శాశ్వతంబుగ వసుధకెల్ల"నని

భార. ఉ. 4-44

ధర్మజునియెడ సోదరభావము జాగృతమై అట్టి ధార్మికుఁడే శాశ్వతముగ వసుధ యేలవలెనని, తన పరాజయమునకును, ధర్మజ పరిపాలనకు— ఆశించినాఁడు. అదియే శ్రీకృష్ణుఁడు కోరినది. అప్పుడు కర్ణుఁడు తన హృదయమును విప్పి చెప్పినాఁడు.

"అనుజులు ఋత్విజులుగా – నీవు ప్రద్రష్టగానుండ ధర్మజుఁడు కురుకుమార పశుబలితో – రణ యజ్ఞమును గావింపఁగలడ"ని రాబోవు రణమును చిత్రించినాఁడు.

"దానన్ కురుక్షేత్రమున మా బోటి వారందుఱును సద్గతిని బడయుదురు గాక" — అని యుద్ధమున కౌరవుల వీరమరణమునే అభిలషించినాఁడు.

ఇట్లి కుటిలనీతితో – కౌరవుల అపజయమునకుఁ బునాది నిశ్చయ మైనది. కర్ణుని అంతరంగమున ఏకొంత ద్వేషము, క్రోధము మిగిలి యుండినను – వానిని కడిగి వేయుటకై మఱికొంత తడవునకు కుంతి రంగమున ప్రవేశించినది.

కర్ణుని కడకు కుంతియే వచ్చి జన్మ రహస్యమును తెలిపినది. పాండవ కౌరవులకు రాజువై రాజ్యము నేలుమని యర్థించినది. "కొడుకు గుఱ్ఱ" యని సంబోధించినది.

కర్ణుఁడు–ఇప్పుఁడు, పాండవులతో కూడిన "నన్నే తెప్పఁగాఁగొని సంగ్రామ మొనరింపఁజూచు కౌరవనాథుని చెడిపోవ విడుచుట తగునా" అని ప్రశ్నించెను.

"తప్పక ఏనవశ్యము నీ కొడుకులతో దుర్యోధనుని పక్షమున పోరుదును. సవ్యసాచిని చంపుదును. లేక అతనితో చత్తును" అని నిశ్చయమును తెలిపినాఁడు.

అప్పుఁడు "తక్కిన నీ అనుజులనైన యుద్ధములో చంపకమ"ని యడిగినది, "అట్ల యవుగాక" అని కర్ణుఁడంగీకరించినాఁడు. ఇది యుద్ధమున చక్కఁగా పనిచేసిన కుటిల నీతి. కర్ణునకు–యుద్ధరంగమున కుంతి తన్నర్థించిన వాక్కులు స్మరణకు వచ్చుచుండినది. యుద్ధ రంగమది:— అందు

కర్ణుని సంరంభమును సైరింపఁజాలక ధర్మజుఁడు – సారథి హతుఁడుకాగా రథమును తోలుకొని పోవుచుండినాఁడుం అతనిని తగిలి పాడివి కర్ణుఁడు హాసభాసితుఁడైనాఁడు. "క్షత్రియ కులమున జన్మించితివి. ఇది ధర్మమని, ఇది యధర్మమని యెఱిగిన వాడవు అట్టినీవు మహారణమున ప్రాణములను కాపాడు కొనుటకై శత్రువులకు తొలఁగి పారిపోవు చుంటివి. నృపనీతి యెఱుఁగవు బ్రాహ్మణాచార వేదివి యాగాధ్యాయనముల బ్రతుకుము. కయ్యము వదలి వేగమపొమ్మ"ని వ్యంగ్యోక్తులతోనే విరమించినాఁడు. కొంతి వచనములు మనము నందుండుటచే అట్టి క్రోధావేశ తరుణము నందును ధర్మజుని వధింప నొల్లక వదలి వేసినాఁడు.

మఱొకపఱి నకులుఁడెదుర్కొనినాఁడు. కర్ణుఁడాతనిని విరథుని చేసి యవమానించి "కుంతి వచనములు సుదృఢవృత్తి చిత్త సంకలితములై యునికిఁజేసి" అతనిని విడిచిపుచ్చినాఁడు.

ఇది శ్రీకృష్ణుఁడు ప్రయోగించిన కూటనీతి ఫలితము చేతికందిన శత్రువును వధింపక వదలునట్లు చేసిన రాజనీతి యది. యుద్ధమునకు పూర్వమే – పాండవులు నికు భ్రాతలని సోదరప్రేమను జ్ఞాతృత మొలకింపజేసి కించిన ఫలితమిది.

కుంతి యభ్యర్థించిన కోరికలను తీర్చుటకై సమయమున బంధింపఁబడిన చేతులవి.

ఈ కూటనీతి కర్ణుని మనమున పాఱుటచే–మిత్రుఁడును తన్ను నమ్మినవాఁడును అగు దుర్యోధనునకు ద్రోహము తనికు తెలియకనేనని చెప్ప వచ్చును.

కర్ణుఁడు పాండవులలో ఒకక్కనిని చంపియుండినను దుర్యోధనునకు జయము తథ్యమే!

ఏ కర్ణుని యండ చూచి, పరాక్రమమును విశ్వసించి, దుర్యోధనుఁడు పాండవుల వధింతునని యాశించెనో — ఆ కర్ణుఁడే పాండవులలో ఇరువురను చేజేతులవదలి దుర్యోధనుని పరాజయమునకు భాగస్వామియైనాఁడు.

ఇట్లు కూటనీతులెన్నో భంగులు ప్రయోగింపబడు చుండినవి. ఫలితము నిచ్చు చుండనవి.

మఱొక కుటిల నీతి

ధృతరాష్ట్రుఁడు — పుత్ర పక్షపాతి. పుత్రుఁడును ఏ లోపములేని రాజకీయ దురంధరుఁడు. యువరాజు కావలసిన లక్షణములు కలవాఁడు. అయినను ధృతరాష్ట్రుఁడు — యుధిష్ఠిరుని యువరాజును గావించినాఁడు. పాండురాజు భ్రాతృ భక్తి అతనిని ప్రేరేపించి యుండ వచ్చును. భీష్మాదుల ఆదరమును కోల్పోదునేమో యని భీతి యొక చోట — ప్రజల అభిమానమునుండి దూరమగుదునేమో యను భయ మొకచోట కనుక తన అంతరంగమునందలి వాంఛకు విరుద్ధముగా యుధిష్ఠిరుని యువరాజు గావించినాఁడు. కథ అడ్డము తిరిగినది. ధృతరాష్ట్రుని అంతరంగము మాత్రము కపటముతో కూడుకొన్నది. ఇచ్చట దురభిమానియగు దుర్యోధనుని అహంకారమునకు తీవ్రమగు ఆఘాతము కలిగినది. సార్వభౌముఁడై సామ్రాజ్యమునేల వలసిన రారాజు — దాయాదుల అధికారమునకు లొంగి యుండవలసిన దేనా! పాండవుల దయాభిక్షముపై ఆధారపడి జీవితము గడుపవలెనా?

ఎవ్వరును లేని అదనుచూచి తండ్రితో తన బాధను వెడల గ్రక్కినాఁడు.

ధృతరాష్ట్రుఁడు పాండవుల బిలిపించి వారణావతమునకు బోయి కొన్ని దినములుండి రండని ఋజువుగ శాసించినట్లు నన్నయ వ్రాసి నాఁడు. కాని మూలమున అట్లులేదు.

ధృతరాష్ట్రుఁడు కూడ — మాయగల వాఁడుగా కన్పట్టును. "వారణావతము చాలసుందరమైన ప్రదేశమని ప్రజలు పొగడుచున్నారు. మీరును దానిని జూడ కుతూహలము ప్రదర్శించుచున్నారని విందును. కావున, ఇష్టమైనచో కొన్ని దినములుండి రావచ్చును అని వారి కోరికపైనే పంపదలచినట్లు పంపినాఁడు — వ్యాస భారతము నందలి ధృతరాష్ట్రుఁడు.

విదురుని — సాహాయ్యమున — పాండవులు లక్కయింటినుండి బయటు పడిరి.

పాండవులు లక్కయింట నాశము కాలేదని, యాజ్ఞ సేనను వివాహమాడి మిత్రబల సమృద్ధితో మెలఁగుచుండిరని చారులవలన దుర్యోధనుఁడు విన్నాఁడు.

యాధవ వృష్ణి భోజులు పాండవ పక్షపాతులు. చేదిపతియను వారినే అనుసరించి యుండును. వీరందఱును తమ అభివృద్ధికై పాండవుల ఉన్నతికే కోరుదురు. వీరందఱును కలియకుండునట్లు భేదింప వలెనని దుర్యోధనుఁడు చింతించినాఁడు.

ఏ కాంతము నందొకసారి — కర్ణ దుర్యోధనులు ధృతరాష్ట్రుని కలిసికొనిరి. వారప్పుడతనితో పలికిన పలుకులు—

"నీకడ రాత్రింబవళ్లు విదురుఁడుండును, అతఁడు పాండవులకు హితుఁడు. కనుక మా మనోరథమును ఎఱిఁగింపఁజాలకున్నవారము. నీవును విదురుని పలుకులను మిక్కలి ఆదరింతువు" అని—

అప్పుఁడు ధృతరాష్ట్రుఁడు తన నిజ భావములను బయట పెట్టించున్నాఁడు.

పలుకులందును, చెయ్వుల యందును పాండవులపై ప్రీతికలిఁగి నట్లుండును. కాని, నా హృదయము నెన్నఁడను విదురున కెఱిఁగింప లేదు. నేనును మీరు తలఁచినట్లుగనే తలఁచుచుందును. పాండవులు

దైవ సంపద గలవారు. వారినేమియును చేయఁజాలమని బాధపడు చున్నాఁడు పాండవుల నేమియును చేయజాలక పోయినందులకు పరితపించు చున్నాఁడు — ధృతరాష్ట్రుఁడు.

అప్పుఁడు కర్ణ దుర్యోధనాదులు — పాండవుల వినాశమునకై — వివిధ భేదోపాయములను ఆలోచించిన విధానము—

(1) పాండవులకు, పాంచాలురకు భేదము కలిగించుటయా!
(2) కౌంతేయ, మాద్రేయులు తమలో విరక్తులగునట్లు గావించుటయా!

(3) అతిలలిత ప్రమదాజనముల నుపయోగించి ద్రౌపది వలన విరక్తిని కలిగించుటయా!

(4) ఏపురకును నొక్కతె భార్య కావున ఆమె పాండవుల వలన విగత స్నేహ యగునట్లు గావించుటయా!

(5) ఉపాంశు ప్రయోగముల భీముని వధియించి తక్కిన వారిని బలహీనుల గావించుటయా— యని వితర్కించిరి. కాని, ఈ భేదోపాయములేవియును పాండవులయెడ పాఱఁజాలవనీ హేతు పరస్సరముగ నిర్ణయమునకు వచ్చిరి.

ఇట్లు కూటనీతి నుపయోగించి శత్రు నిర్మూలనము గావించుటకై పరి పరి విధములు పలువురు ఆప్తులతో ఆలోచనలు జరుపుచుండిరి. నిర్ణయముల గావించుకొనుచుండిరి

కణిక నీతి :—

మిత్రులనుఁగానీ, శత్రువులనుగానీ రాజైనవాఁడు — ఎంత వఱకు నమ్మవచ్చును? అనునది రాజనీతిలో ఒక ముఖ్యభాగము. కార్య వశమున శత్రువుతో మైత్రి చేయవలసి వచ్చినను వారిని గాఢముగా విశ్వసింపరాదని—బృహస్పతిముఖ్యుల మతముగా నుడువఁబడినది.

కణికుఁడు — సౌవీరపతియగు శత్రుంజయునకు నీతి బోధ గావించిన సందర్భమది—

అందలి సారాంశము—

"శత్రువులకు హితులగు వార్తలను చూచినప్పుడు—భూపాలుఁడు వికసించిన ముఖము గలవాఁడై యుండవలె. హృదయమున కత్తెర, నాలుక యందు తీపి గలిగి మనములను పరీక్షించు చుండవలెను. జ్ఞాతులను నమ్మి వారి తోడ్పాటుగాని శత్రువుల రాజ్యముల జయింప వలెను. అజ్ఞాతులను సౌఖ్యసమృద్ధులతో సంతోషింపఁజేయవలెను. ఎవ్వరిని నమ్మరాదు. పామున్న గృహమునందున్నట్లుగ మెలఁకువతో సంచరించుచుండవలెను.

ప్రత్యర్థి బలవంతుఁడైనపుఁడు మూపునయెత్తి మోయుచుండవలెను కాలమనుకూలించిన వెంటనే చట్రాతిపై కుండను పడవైచి నట్లుగ నేర్పుతో కూలద్రోయవలెను.

పానము జూదము, వేట, మానిని—ఇవి భూపతులకు మధురము లగు వినోదస్థానములు. వీనిని తగు విధమున అనుభవింపవలెను. మితితప్పిన ఇవి అపదలు తెచ్చును.

తన కిష్టములేని కార్యమును చేయునని ఖండితముగా రాజు చెప్పరాదు. ఆశలు పుట్టించుచు బాగు చేయుచుండవలెను. కాలము గడచిన కొలది విఘ్నములు పెరుగుచుండును గనుక ఆ కార్యము మఱొక గతి పట్ట వచ్చును.

క॥ విని వినని వాఁడ పోతెం
గని కానని వాఁడ పోలెఁగా వలయు విభుం
డొనరింపఁ దలచిన పని
కనువగు నంతకునభేద్యుఁడై జనుల యెడన్

12-3-273

ఇట్లు కణికుఁడు రాజునకుపదేశించినది కపట మార్గము. దీనిని చాణుక్యనీతిని కుటిలనీతి యని విమర్శింతురు. కాని, రాజైనవాఁడిట్టి మార్గములననుసరింపనిదే రాణింపలేఁడు. ఇది యథార్థ మార్గము. ఇఁక పాండవులు ఆశించిన రాజనీతి.—

అప్పుడు పాండవులరణ్యవాసమున దీనదశయందుండిన సమయమది — దుర్యోధనాదులు పాండవులకు తమ వైభవములను చూపుటకై బయలుదేరినారు. ఆడంబరములతో — వస్తు విశేషములతో — మణిరత్న వైభవములతో — ఘోష యాత్రకై బయలుదేరిరి.

అచ్చట గంధర్వునిచే పరాభూతులైనారు. అంత పౌరులు — అమాత్యులు — బెదరి — యాక్రోశించిరి. ధర్మజుని శరణు వేఁడిరి.

భీముఁడు కాఁగలపని గంధర్వులే చేసిరని యానందించినాఁడు. అప్పుడు ధర్మజుఁడుపదేశించిన రాజనీతి—

"ఏకాన్వయ జాతులైన వారికి అర్థనిమిత్తమై యొక్కొక్క పరిభేదము కలుగవచ్చును. అయినను సహజ స్నేహము తప్పిపోదు. జాతి జనములు తమలో నెట్టివారైననేమి? అన్యుల వలన తమ జాతి వారికి పరాభవము కలిగినపుఁడు తారొకరినొకరు అంగీకరింపవలెను. ఇది లోక నింద్యముకారు. దుర్యోధనుఁడు దుర్వినీతుఁడు. అయినను భార్యాసహితముగా పట్టుబడినాఁడు. దీని నుపేక్షించితిమేని మనకు కుల హానియగును అదియునుగాక—శరణాగత రక్షణము రాజ మాత్రునకు ధర్మము. నీ యట్టి బాహుబలునకిది కర్తవ్యమని చెప్పనేల? లెమ్ము నీ తమ్ములతో రథమెక్కుము. సర్వాయుధములతో సన్నద్ధుఁడవు కమ్ము "సుయోధనుని తప్పింపుము" అనినాఁడు.

క॥ శరణంబని వచ్చిన భీ
కర శత్రువునయిన బ్రీతిఁగావఁగ వలయుం
శరణాపరుల తెఱంగిది
యిరవుగ సరిగావు దీనికే ధర్మంబుల్" అని

భార. అరణ్య 5-413

శరణాగతుడు భయంకర శత్రువైనను అతనిని కాపాడుట సర్వోత్తమ ధర్మమని తెలిపి సోదరుల సిద్ధంబుఱచినాడు. భీమార్జునులు యుద్ధ సన్నద్ధులైరి దుర్యోధనాదుల విడిపించిరి. ఇచ్చట ధర్మజుని—"జాతి సమైక్యతాభావములు" వినవచ్చును. ప్రతి జాతివారు—ఈభావములను ఒంట పట్టించుకొని—సమైక్యతకై పాటు పడవలసిన రాజనీతిన్నది

*********

దండనీతి:

"దండ శ్శాస్తి ప్రజాస్సర్వాః
దండ ఏవాభి రక్షతి
దండస్సుప్తేషు జాగర్తి
దండం ధర్మం విదుర్బుధాః"

మను. 7 22

సమీక్ష్య సధృతస్సమ్యక్స ర్వా రంజయతి ప్రజాః
అసమీక్ష్య ప్రణీతస్తు వినాశయతి సర్వతః మను 7-20

రాజు దండము వలననే ప్రజలను రక్షింపఁగలుగు చున్నాఁడు. అలసులై కర్తవ్య విముఖులై నిదించువారిని రాజదండము మేల్కొలుపు చున్నది. కనుక దండమే ధర్మము. ఆ దండమును వివేకముతో ధరించినచో రాజు ప్రజలను చక్కఁగా రంజింపఁజేయఁగలడు. వివేకము లేక ప్రయోగింపఁబడిన దండము సర్వత్ర నాశము గావింపఁగలదు.

కనుక రాజు ప్రజలను రంజింపఁ జేయఁజాలని నాఁడు అన్వర్థ నామధేయుఁడు కాఁజాలఁడు.

మానవుని జీవితమే లోప భూయిష్ఠము. మానవ సంఘములో ఎవఁడో ఒకఁడు ఇంద్రియలోలుఁడై మఱొకని స్వేచ్ఛకు బాధ కలిగింప

వచ్చును నియమము నుల్లంఘింప వచును. అందుచేత అరాచకము ప్రబలును. కనుక – అతనికి దండన తప్పదు. కానీ దండన నిష్పక్షపాతముగ నుండవలెను. తప్పుచేసిన వానిని శిక్షించుటెట్లు? ఈ శిక్షలకు హద్దుగలదు. శాస్త్రముగలదు. సాక్షులుగలరు. నిర్ణయాధికారులు గలరు.

సామ్నా దానేన భేదేన సమస్తై రథవా పృథక్
విజేతుం ప్రయతే తారన్ నయుద్ధేన కదాచన. మను-7.198

సామ, దాన, భేదోపాయములచే శత్రువులను సర్వదా జయించుటకు ప్రయత్నింపవలెను. యుద్ధముతోగాదు పై చెప్పబడిన మూడు ఉపాయములు – అసంభవమైనప్పుడు – యుద్ధముచేత శత్రువులను జయింపవలెను.

రాజ్యము నందలి ప్రజలందఱును నీతి నియమబద్ధులై యుండవలెను. రాజును పరిశుద్ధ స్వభావుడై యుండవలెను. అప్పుడే రాజ్యమున సుఖశాంతులు వెల్లివిరియగలవు. కాని విభిన్న మనస్తత్త్వములు గల మానవుల సంఘమున ఇది సాధ్యము కాని పని. కనుక దేశవ్యాప్తమగు రాజ్యాధికారము "దండ" రూపమున ప్రత్యక్షమై న్యాయమును చేకూర్చును.

దండనీతి—ఆవశ్యకత :

రాజ్యము అనుసరించు శాసనములను పౌరులెవరైనను అతిక్రమించిన వారిని విచారించి శిక్షించుట చాల అవసరము. లేనిచో రాజ్యాధికారమునకు విధేయత తగ్గి విశృంఖలత్వము పెరిగిపోవును. వ్యక్తియొక్క పూర్తి సంక్షేమము రాజ్యమునకు ముఖ్యబాధ్యత, దండనీతి-సమాజముయొక్క ధారణకు, పోషణకు వికాసమునకు అత్యంతావశ్యకము. లోకమునందలి దుష్టప్రవృత్తుల స్వేచ్ఛా విహారమునకిది అడ్డుకట్ట – సంస్కృతి, నీతి వీనిని [illegible]ంచుట కిది ప్రధాన సాధనము. పరస్పర వైషమ్యము, స్వార్థము మొదలగు హీన ప్రవృత్తులు తాండవమాడుటకు నెలవు మానవ మస్తిష్కము.

"బలముగలవాఁడే నిలువఁగల వాఁడన్నది" జీవశాస్త్ర సిద్ధాంతము. కనుక బలహీనుల రక్షించుటకు దండమవసరము. దుర్మార్గుల శిక్షించుటకు దండనీతి అవసరము. శాంతి పర్వమున — దండనీతి ఆవశ్యకతను గుఱించి ఇట్లు వివరింపఁబడినది.

"అరాజకమున్నను పాపకారమగు స్థితి ప్రపంచమున మఱొకటి లేదు. విచారించువారు లేనప్పుడు అదాసులు దాసులగుదురు. స్త్రీలను బలవంతముగ దుష్టులపహరింతురు. గోబ్రాహ్మణ స్త్రీ వృద్ధులకు రక్ష యుండదు. ఈ అపాయమునుండి ప్రజలను తప్పించుటకే దేవతలు ప్రజా పాలకుని సృష్టించిరి. అరాచకమగు దేశమున పెద్దచేపలు చిన్న చేపలను — భక్షించునట్లు దుర్మార్గుల హీన బలులను నాశమొనర్తురు. కనుక — అట్టి దుష్టుల దుర్మార్గము నరికట్టుటకై దండమవసరము. దండము — వాగ్దండము, ధన దండము, తను వికారము—మొదలుగా అనేక విధములు గలవు.

"సామా దీనాం ఉపాయానాం చతుర్ణామపి పండితాః
సామ దండౌ ప్రశంసంతి నిత్యం రాష్ట్రాభివృద్ధయే"

మను స్మృతి-7అ.

సామ, దాన, భేద, దండోపాయములతో పండితులు సామదండములే రాష్ట్రాభివృద్ధికి ఉత్తమములని ప్రశంసింతురు.

శాంతి పర్వమున యుద్ధము చేయుట ధర్మమా! అను ప్రశ్నలకు ఉత్తరము లభించుచున్నది.

అది ప్రాణి హింస కదా! అని ప్రశ్న. అందులకు యుద్ధము చేయుట ధర్మమని, అది స్వార్థ సమృద్ధికొఱకైనచో అధర్మమని పగ సాధించుకొనుటకైనచో అధర్మమని — కేవలము ధర్మసముద్ధరణమున కైనచో న్యాయమని తెలియుచున్నది.

సామ, దాన, భేద దండములే కాక "ఉపేక్ష" యను పంచమో పాయమొకటి కలదని శుక్రమతము. ముల్లును ముల్లుతో పుచ్చినట్లు శత్రువులు తమలో పోరి నశింప తానుపేక్షా నైపుణ్యము నవలంబింప దగును ధర్మయుద్ధమే శ్రేష్ఠము. విషలిప్తమైన శస్త్రమును అమిత్రునిపై నైనను ప్రయోగింపరాదు.

దండము హింస కాదా అను ప్రశ్నకు అర్జునుఁడు ధర్మజునితో సుదీర్ఘ వివరణ గావించినాఁడు. ఎందరినో బంధుమిత్రులను హింసించి చంపి పాపభాజనుఁడ నయితినని దుఃఖించు ధర్మజుని సంశయనివృత్తి గావించుచు అర్జునుఁడు పలికిన పలుకులు గమనార్హములు—

"రాజు దక్షుఁడై దండనీతిని నిర్వహింపకున్న సన్యాసులు సన్మార్గ వర్తనులగుదురు జనులన్యోన్యము – ధన ధాన్య పశు భూదార హరణములు గావింతురు. ఆ పాపముతా రాజును పొందు నుఅనెను

రుద్రుడు, గోవిందుఁడు. వాసవుఁడు, గుహుఁడును–దుర్వృత్తులను వధించుచున్నారని – యుదహరించెను. దుర్వృత్తులను, ఉన్మార్గ వర్తులను దండితుల గావింతురనినాఁడు అందుచే అధర్మమడఁగునని, ధర్మము అభివృద్ధి చెందఁగలదని తెలిపినాఁడు,

దండముచే అర్థము, కామ్యము అదూష్యములై సిద్ధిని పొందు ననెను. కనుక దండముచే సకలజన శ్రీరక్షణమగునని, ఎట్టివారును హింసలేక జీవింపరని తెలిపినాఁడు.

"హింసలేక మానవుఁడు జీవింపలేఁడు. కాయలు, పండ్లు, నీళ్లు- అన్నింటి యందును సూక్ష్మజీవులు గలవు. మునులును వానిని చంపుదురు. అది హింసకాదా! కందమూలములుత్రవ్వి ఉపజీవన మొనర్తురు. అది హింసకాదా! ఒక ప్రాణికి మఱొక ప్రాణికి బ్రహ్మ భోజనముగా నేర్పఱచినాఁడు. అదియును హింస కదా! "హింస" యని వదలినచో తిండిలేక ప్రాణులు చనిపోవునే!

కనుక హింసలేక ఎవ్వరును జీవింపఁజాలరు. పశుహింస గావించి యాగము చేసిన వానిని వేదములు ధర్మపరుఁడనుట లేదా! కనుక సముచితముగా, న్యాయముగా, ప్రజాశ్రేయము కొఱకు గావించిన హింస హింస కాదు" అని హేతువాద పురస్సరముగా స్థాపించినాఁడు-

"లోక వినాశమున కుద్యతులగు వారికి కఠిన శిక్షలు విధించి దండించుట ప్రజా శాంతి కొఱకే! అని రాజనీతి బోధించుచున్నది. దండనీతిలేని రాజ్యము అంకుశములేని మదగజ విహారము వంటిది." అని యర్జునుఁడు దండనీతిని గుఱించి విశదీకరించినాఁడు.

ద్రౌపదియు ధర్మజునితో విధిదండనీతిని ప్రతిష్ఠించిన విధానమును తెలిపినది. మనుస్మృతి – నిత్యము దండధారియైనప్పుడే రాజునకు జగత్తు భయపడగలదని కనుక సర్వ భూతములను రాజు దండముతోనే సంతుష్టిపఱుప వలెనని తెలుపుచున్నది.

"నిత్యముద్యత దండస్య కృత్స్నముద్విజతే జగత్
తస్మాత్స ర్వాణి భూతాని దండేనైవ ప్రసాదయ"

103. 7-మను

భారతమున కురుక్షేత్ర సంగ్రామము కౌరవ పాండవులకు జరిగిన సంగ్రామము – పదునెనిమిది దినములు జరిగిన సంగ్రామము. పాండవులు–కౌరవుల సమయములన్నింటిని శాంతచిత్తులై నెఱవేర్చినారు

పండ్రెండు వత్సరములరణ్యవాసము గావించిరి. ఒక యేడు అజ్ఞాతవాసము సలిపిరి. సమయము నిర్వర్తించి తమ రాజ్యభాగమునకై దూతను పంపిరి. ఐదూళ్లిచ్చినను చాలునని తెలిపిరి. అయినను సుయోధనుఁడు "వాడిసూదిమొన మోపినంత మాత్రము భూభాగమును పాండవుల కొసంగనని, యుద్ధముననే బలాబలముల నిర్ణయమని, అనంతరమే రాజ్యపాలన" యని నిష్కర్షగా చెప్పినాఁడు. కనుక యుద్ధము నిశ్చయమైనది.

"త్రయాణామప్యుపాయానాం పూర్వోక్తానామసంభవే
తథా యుధ్యేత సంపన్నో విజయేత రిపూన్ యథా"

మను. 7-200

(పై చెప్పఁబడిన) అనఁగా సామ, దాన, భేదములను మూఁడు పాయములు అసంభవములైనప్పుడు శత్రువులపై యుద్ధమునకు పోవలెను. కనుకనే పాండవులు కౌరవులతో యుద్ధమునకు నిశ్చయించినారు.

దండనీతి—ప్రయోగము :

భారతము ప్రాచీనమైనది. అర్థశాస్త్రము తరువాతిది. అర్థశాస్త్రము దండనీతి ప్రయోగమున గహనాతి గహన మార్గము ననుసరించినది. ఇందు – అపనమ్మకము – ప్రతారణము – రాజ తంత్ర మూల సూత్రములై భాసించును.

శాంతి పర్వమున దండనీతి ప్రయోగము చక్కఁగా బోధింపఁబడినది.

రాజు దండమును మెలకువతో ప్రయోగింపవలెను. అత్యంత కఠినుఁడు కారాదు. అతి మృదువును కారాదు. పరీక్షావిశుద్ధి పూర్వకముగ దండము విధింపవలెను" రాజు తన తలంపువెంట తమకించి ప్రజకు నొవ్వగు నట్లుగ చరింపరాదు. ఇచ్చట రాజును గర్భిణితో శాంతనవుఁడు పోల్చినాఁడు. గర్భిణి – గర్భస్థ సంతానము బ్రదుకుటకై అనురూపములగు ఆహారమును కొనునట్లు రాజు ధరణి ప్రజల జీవితమునకై తగునట్లు నడచుకొనవలెను.

సప్తాంగములందు విరోధంబాచరించు వాని నెవ్వనినైనను విడువవలెను.

మిత్రులైన, పుత్రుఁడైనను క్షమింపక దోషులైనచో దండింప వలసినదే!

"దండోహి కోమలో లోకం పరం చేమం చరక్షతి
రాజ్ఞా పుత్రేచ శత్రౌచ యథాదోషం సమం ధృతః"

కౌటిల్యా అర్థ, 3-56 ప.

ు, పుత్రులను సమానముగా దోషానుసారము దండించిన ఆ దండము
జును ఇహ పరముల రక్షించును. ఇందులకుదాహరణముగ నిట్లు
)పినాఁడు.

సగరుఁడు తన కుమారుఁడగు అసమంజసుఁడు పౌర బాలకులను
ధించు చుండెనని త్యజించినాఁడు-

ఉద్దాలకముని తన తనయుఁడు శ్వేత కేతువు విప్రులయెడ
ఖ్యేప చారకుండని యెఱింగి పరిత్యజించినాఁడు.

భూమీశునకు అసహాయత్వము ప్రమాదకరము. అల్పసత్త్వుఁడగు
'జు బలవంతునితో స్పర్ధకు డిగక వేతస వృత్తినవలంబింపవలెను.

"సూర్యుఁడంధకారమును నశింపఁ జేసినట్లు — లోకమునందలి
ల్మషము నెల్లను ధరణిపతి ధర్మాత్మ స్ఫురణమున చెఱచును, అని
ెలిపినాఁడు శాంతనవుఁడు.

కనుక దండము — వర్ణాశ్రమ ధర్మరక్షణకు, నిజమహీమండల
ప్రజలఁ గాచుటకూ, పర మండలమునందలి భూపతుల నణఁచి
కప్పము గొనుటకు, విప్రకులమునుఁ బ్రోచుటకు శరణన్నవారినిఁ
గాచుటకు, దుష్ట శిక్షణకు, శిష్ట రక్షణకు ప్రయోగింపఁబడి రాజుల
కుత్తమగతు లొసంగెడిది.

కురుక్షేత్ర యుద్ధము :—

భారత యుద్ధము కురుక్షేత్రమున జరిగినది. సైన్యము పదునెని
మిది అక్షౌహిణులు. జరిగి నకాలము పదునెనిమిది దినములు.

వివిధ వ్యూహముల సంధానము. శస్త్రాస్త్రముల విఘట్టనములు వీరావేశ విజృంభణములు, ధర్మాధర్మముల సంఘర్షణ — ఆ పదు నెనిమిదిదినములు వినిపించుచున్నవి. ప్రత్యర్థులగు నిరువురు రాజులకు జరిగిన యుద్ధము కాదది. దాయభాగ నిమిత్తముగా అన్నదమ్ముల బిడ్డలకు జరిగిన కయ్యమది.

భారతీయ సమరకళకొక ప్రత్యేకత గలదు. చతురంగ బలములు రథ, గజ, తురగ, పదాతుల సన్నాహము లొకచో కనిపించును. ధానుష్కుల ప్రాబల్యమొక వైపు, వ్యూహరచనా విధానము మఱొక్క చోట — భేరీ భాంకారములు, వీరుల సింహనాదములు మఱొక్కవైపు- దైవ పౌరుష ధర్మాధర్మ చర్చలొకవైపు ఉత్తుంగ తురంగ హేషార వంబు లొక్కచోట యొప్పుచుండినవి.

హుంకారములు, అదల్పులు, జంకెనలు, ధిక్కారణములు, సంస్తుతులు, వీరాంకోక్తులు — ఉద్ధృతములై యొప్పినవి

సంగరమున — దొల్లెడు తలలు, తునిసెడు విల్లులు, ధరకొరగు మేనులు. విఱిగెడు సిడములు పెల్లుబొరగు నెత్తురులు చూపఱులకు భయము కొల్పు చుండినవి.

యుద్ధ వీరులందఱును — సుశిక్షితులు ధనుర్వేద పారీణులు అస్త్ర శస్త్ర కళా కోవిదులు.

దీనికి తోడు ఆ యుద్ధ ఘట్టము నాంధ్రీకరించిన వాఁడు తిక్కన. సోమయాజి, ఇతనికి కాకతీయులనాఁటి యుద్ధ రంగము ప్రత్యక్షాను భవము నర్థఁలిది, కనుకనే ఈ యుద్ధఘట్టము మరింత కనులకు కట్టినట్లు కనిపించుచున్నది.

ఆ మహా భారత యుద్ధమున ;—

యోధులు, మహా యోధులు — ఉన్నారు. అతిరథులు, మహా రథులు — ఉన్నారు. ఉత్తమ గదాయుద్ధ ప్రవీణులున్నారు. ధను ర్వేద పారీణులున్నారు. శస్త్రాస్త్ర కోవిదులున్నారు.

ఇందు – మనసొక వైపు, యుద్ధము మఱొకవైపు కొందఱిది (శల్యుని వంటివారు) తమ వారికై యుద్ధము చేయుట కొందఱిది (త్రిగర్త దేశాధిపతి).

యుద్ధము చేయవలెను. ధర్మవిజయము చేకూర్చవలెను–కనుక విధిలేక యుద్ధము చేయువారున్నారు, (భీష్మ ద్రోణాదులు). బుద్ధి పూర్వకముగా యుద్ధము చేయని వారున్నారు బలరాముడు రుక్మి చేయనని కొన్నిదినములు ప్రతినబూని శస్త్రము ధరింపని వారున్నారు. (కర్ణుడు) చిరకాలము నుండి రగులుచున్న పగను తీర్చుకొనుటకై యుద్ధము కొందఱిది. (దుర్యోధనాదులు) తమకు అన్యాయము జరిగినది కనుక న్యాయమగు దాయ భాగమును కొనుటకు యుద్ధము చేయు వారున్నారు. (ధర్మజాదులు)

ఇందు – దేవతలు, రాక్షసులు, దైవాంశ సంభూతులు, నరులు, నారాయణావతారులు ఉన్నారు.

అప్పటి వీరుల భావములు .—

"ఇంటన్ తెవులున చచ్చుట కంటెను పాపంబు లొండు గలవె" అని యుద్ధమునకు దిగినవారు ఉన్నారు.

"నృపులకు పంట కలను పాలికలనిది దీనిని గంట నిధానంబు గంట కాదే తలంపన్" అని యుత్సాహముతో నుఱుకువారు నుండిరి.

"మాయలు గల శత్రువును మాయాప్రకారము చేతనే చంప వలెను" అని భావించు వారుండిరి.

"ఎట్టులైనను ప్రతిన నెరవేర్చుట నృపుల ధర్మమని" అందులకై ప్రోత్సహించు వారుండిరి.

వీరుల నియమములు :—

"యుద్ధమొనర్చు చుండియు భాషణములకే తగపల్కుచుండంగా అవినయ వృత్తిమై వలవ చాయుధమార్చుట" అనునదొక నియమము.

పడిన వానిని, కైదువు తొలఁగినవానిని, భయముపొందినవానిని, దోర్బలము చెడి తొలగిఁన వానిని — వధింప తగదనునది మఱొక నియమము.

"విరిదల వానిని, విరథుని, ఆయుధంబిడిసన్వానిని శూరులెందును వేయరు" అని కర్ణుని పలుకులు. ఆయినను — విరథుడైన కర్ణుని అర్జునుఁడు వేసినాఁడు.

"నిద్రించిన వానిని వధియించుట యుద్ధధర్మముకాదు" అయినను అశ్వత్థామ నిద్రాసక్తులైన ఉప పాండవులను చంపినాఁడు.

"గదా యుద్ధంబు నాభికి దిగువయగు శరీర భాగంబు నొప్పించుట ధర్మంబు గాదు. అయినను భీముఁడు తన ప్రతిజ్ఞను నెరవేర్చు కొనుటకై దుర్యోధనుని నాభికి దిగువ తొడపై కొట్టి పడవైచినాఁడు.

"ఒక్కని పలువురు చుట్టుముట్టి యుద్ధమొనర్చుట తగదు" అయినను బాలుఁడగు అభిమన్యు నొక్కనిని పలువురు కౌరవులు చుట్టు ముట్టి చంపిరి.

కనుక, యుద్ధ నియమములు, ధర్మములు ఉన్నను వాని నతిక్ర మించుచు పోరాడుట కలదని తెలియుచున్నది.

కొన్ని విశేష ప్రతిజ్ఞలు; —

"జోడు వుచ్చిన వానిని, కైదువు పెట్టిన వానిని, సిడంబుడించిన వానిని, అంగనను, అంగనాపూర్వుని, అంగనాభిధానుని, తలచీర వీడిన వానిని, భ్రాతృహీనుని, అపుత్త్రకుని కని ఏటు పోటు దక్కి సమరంబు సేయ మానుదును" అని భీష్ముని ప్రతిజ్ఞ—

ఆ ప్రతిజ్ఞకు కట్టుబడి అంగనాపూర్వుని గాంచి (శిఖండి) శస్త్రమును విసర్జించినాఁడు — భీష్ముఁడు.

"తునిమెద నెల్లి సైంధవుని, తోయజ మిత్త్రుఁడు గ్రుంకు కుండుమున్న"ని యర్జునుఁడొనర్చిన ప్రతిజ్ఞ.

అతని ప్రతిజ్ఞ నెరవేరుటకు శ్రీకృష్ణుఁడు తన చక్రమంపి అకాల, సంధ్యను కల్పించి యతనిని సఫలుని గావించినాఁడు.

"భీష్ముఁడు కర్ణధారిగా నుండువఱకు శస్త్రంబు పట్టన"ని కర్ణుని ప్రతిజ్ఞ. అతఁడా ప్రతిజ్ఞను నెరవేర్చి — దుర్యోధనునకు యుద్ధము నందండఁగా నుండవలసినది పోయి పాండవ విజయమునకు సహాయ పడినాఁడు.

ఇట్లు తాము గావించిన ప్రతిజ్ఞలను నెరవేర్చుకొన్న వారును గలరు.

యుద్ధమున నుపయోగించుచుండిన పరికరములు. శరీర వేష్టనములు.

ఉష్ణష శిరస్త్రాణ, తనుత్రాణ, కరత్రాణ. శర, శరాసన తూణీ రాది విశేషముల నుపయోగించెడివారు

కోదండ, గదాదండ ,కుంత, క్షురికా. ముసల, ముద్గర తోమర, పరశు, భిందిపాల, ,శూల, కరవాలాదులనే కాదు చాపములను భాస్వత్కాండములను, హేమ చంద్రిక కసద్వర్మంబులను ఉపయోగించెడి వారు. బాణంబులలో పెక్కు విన్నాణంబులను, ధనుర్దండములలో-భిన్న ప్రమాణములనుచూపువారు, వివిధవర్ణ విచిత్ర తనుత్రాణంబులు వారివి. శ్వేత చ్ఛత్ర చామర ధ్వజ పతాకాద్యభి రామములై సంగర కథోల్లాసంబు సేయుచు పెండ్లికిఁబోవునట్లు ల్లాసంబున యుద్ధమున కేగెడివారు.

ధ్వజములు :— శత్రువును దూరమునుండియే అతని ధ్వజ చిహ్నను బట్టియే గుర్తింపవచ్చును. ఒక్కొక్కరొక్కొక్క చిహ్నము గల ధ్వజ మును ధరించెడివారు. భీష్ముఁడు తాళధ్వజుఁడు. అర్జునుఁడు కపి

కేతనుఁడు. అభిమన్యునిది కర్ణికార ధ్వజము. ఇదే విధముగ విభిన్న కేతనములు దూరము నుండియే వ్యక్తులను తెలుపుచుండినవి.

శంఖములు :— యుద్ధ ప్రారంభమున తమ తమ శంఖముల పూరింతురు విశిష్టవ్యక్తి యుద్ధభూమి యందు తెగి పడినపుడును శంఖములు మ్రోగుచుండినవి. కురుక్షేత్ర యుద్ధ ప్రారంభమున—

కృష్ణార్జునులు పాంచజన్య దేవ దత్తంబులను, భీమసేనుఁడు పౌండ్రంబును, యుధిష్ఠిరుఁడు అనంతవిజయమును పూరించిరి. నకుల సహదేవులు — సుఘోష మణి పుష్పకముల పూరించిరి పాంచాల, విరాట సాత్యకి ధృష్టద్యుమ్న శిఖండి ప్రముఖ దండనాయకులును తమ తమ శంఖముల పూరించిరి.

అస్త్రములు :— కేవలము శస్త్రములే గాదు. ఆ యుద్ధమున బ్రహ్మ, ఇంద్ర, వరుణ, వాయు, నాగ, మేఘ, మోహన ప్రజ్ఞాది దివ్యాస్త్రములు ప్రయోగించుచుండెడివారు. మంత్ర పూతములు అస్త్రములు, మంత్రములతో తత్తదధిష్ఠాన దేవతల ప్రార్థించి ప్రయోగించుట అస్త్రము. బ్రహ్మ శిరోనామక, భార్గవ, నారాయణావస్త్రములు — మహాస్త్రములు. అభేద్య మంత్రములతో, అభేద్య కవచములతో సుశిక్షితులగు చుండిరి. నిఖిల నిర్భేదనాస్త్రములను గలవు. సర్వాస్త్ర ఘాతి ప్రత్యస్త్రములు గలవు పలికినంతనే, తలచినంతనే చూచినంతనే-భస్మీ పటల మొనరించు వాగాత్మ చక్షుశ్శక్తి శాపాస్త్రములు గలవారును నుండిరి.

పార్థుఁడు ఈశుని ప్రసన్నుని గావించుకొని పాశుపతమును బడసెను. అగ్నిదేవునిచే దివ్య రథమును, దివ్యాశ్వమును వడసెను. గాండీవ దేవ దత్తంబులు, అక్షయ బాణ తూణీరంబులు వడసెను. అర్జునుఁడు నేర్చిన విద్యలు పలురకములు. భూమి బాణంబున భూప్రవిష్టుఁడగును. భూరి ఘోర శైల బాణంబున శైల రూపము దాల్చును. అదృశ్యాస్త్ర విద్య పేర్మి తాన అదృశ్య దేహుఁడగును.

రాజులు ప్రతిజ్ఞలు గావింతురు. ఘోర పరాభవము సంభవించు నప్పుడు – భరింప జాలక పగతీర్చుకొనుటకై ప్రతిజ్ఞ గావించుట – ఆ ప్రతిజ్ఞను భీకరముగా నెరవేర్చుకొని అనంతరము పరితాపము నొందు టయు, గలదు. భీముడు దుశ్శాసనుని క్రూరముగ చీల్చి నెత్తురు త్రాగినాడు. అందులకై కటకట పడు గాంధారితో స్త్రీ పర్వమున భీముడు "ఏమిభంగినైన పగతీర్పవలసి వచ్చెగాక! అనుజుని రక్తము నానుటకు నేనంత వెఱ్ఱినే! అంత పాత కమ్ముడనా! తల్లియంత నిష్కరుణ మతినా!" యని దోయిలిపట్టి వేతచె సెనాడు. పౌత్ర పౌత్ర మరణముచే కుందిన గాంధారి క్రోధముతో "ఆమ్మహారాజెచట నున్న వాడ"ని ధర్మజుని గుఱించి యడిగినప్పుడు—"ఆ భూపతి కంపిత గాత్రుడై చేతులు జోడించి "నేను పాండవాగ్రజుడను. నీ పుత్త్రుల చంపిన పాపాత్ముడను, క్రూరచిత్తుడను, పరివాదార్హుడను, నన్ను శాపమున, బొలియింపుడ"ని యంజలిఘటించి యవనతుడైనాడు. ఇది యాతని పశ్చాత్తప్త హృదయావేదనను వెల్లడించు చున్నది. పుత్త్ర విహీనయగు జననిగాంచిన కరుణ రసానిష్టములగు పలుకులు. అప్పుడు మఱుమాట లాడక యుద్దేవి దీర్ఘముగా నిట్టూర్చి యూర కుండినది.

కురుక్షేత్రమున – స్త్రీల పరి పరి విధముల పరి దేవనముల విని గాంధారి శ్రీకృష్ణుని చూచి "ఇది యంతయు నీవు చేసిన పని" యని నిందించినది.

"కౌరవులు. పాండవులును ఈసుతో తలపడుచుండ అడ్డుపడవైతివి. సమర్థుడవయ్యును ఉపేక్ష సేసితివి. అందఱిని చంపితివి. అంతయు నాశము చేసితివి. ఈ పాప ఫలమనుభవింపక తీరదు. నిన్ను శాపానల దగ్ధుని గావించుచున్నాను.

నా పాతివ్రత్య తపోబలముచే నీ దాయాదులందఱట్లే యొకరి నొకరు పొడుచుకొని చత్తురు గాక! నేటికి ముప్పదియాఱేండ్ల కిట్లే నీవు దిక్కులేని కుచ్చితపు చావున చత్తువు గాక! మీ వధూ జనములిట్లే ఏడ్తురు గాక! అని శపించినది

ఈ ఘటన — గురు తరమగు కార్యభారము వహించి మధ్యస్థులై కయ్యమున న్యాయము చేకూర్చుటకై పాటుపడువారి గతియిట్లేయగునని సూచించుచున్నది. భగ్నాశులు భగ్నహృదయులు వారినిట్లే శపింప గలరు.

కనుక దాయాదుల కలహముల తీర్చుటకు మధ్యప్రవేశించువారు, న్యాయము కొఱకు ధర్మము కొఱకు పోరాడ సంసిద్ధులైనవారు — అన్నింటికి సంసిద్ధులై యుండవలసినదే!

కురుక్షేత్ర యుద్ధము :—

ఉభయ సేనలు రణ రంగమున సమావేశమైరి. అర్జునుడు కౌరవ పాండవ సైన్య సమూహముల రెండింటిని తేరపారజూచెను. అతనిని విషాదమావరించినది. శత్రు పక్షములో తాను చంపబోవున దెవరిని? వంశవృద్ధుడగు భీష్ముని! ధనుర్విద్యాకుశలుని గావించిన ఆచార్యుని! రక్త బంధువులను! ఆ తలంపు వచ్చినంతనే దుఃఖా క్రాంతుడైనాడు. నేనీ యుద్ధమును చేయజాలనని — గాండీవమును జారవిడిచినాడు. అప్పుడు శ్రీ కృష్ణుడు — "ఈ విషమ పరిస్థితియందే కొఱగాని బేలతనమేల? ఇది మంచి మార్గముకాదు ఉదాత్తయశమును పోగొట్టును. ఇది విషాదావస్థకు, దైన్యమునకు సమయము కాదు. స్థలముకాదు. బంధువులెవరు? శత్రువులెవరు? చచ్చువారెవరు? చంపు వారెవరు? ఆత్మకు చావెక్కడిది? అని హెచ్చరించి కర్తవ్యోన్ముఖుని గావించినాడు. "కర్మణ్యేవాధి కారస్తే" యని నిరాసక్త కర్మను బోధించినాడు.

ఇరువైపుల సైన్యాధిపతులు రణమునకు సంసిద్ధులైరి. గాంధా రేయుడు గాంగేయునితో సేనాధిపత్యము వహింపుమని యడిగినాడు. అప్పుడు గాంగేయుడు పలికిన పలుకులు యథార్థభావములను తెలియజేయు సేనాధిపతులును ఉందురని తెలియుచున్నది.

"నాకు మీరును పాండుసుతులును ఒక్కరూపఁ ఉన్నరూపు పలుకవలయును. నన్ను మార్కొనువారు ఈ జగతిని లేరు. కిరీటి కొక్కనికి నేనోర్వను, అతఁడు నా కంటె ఎక్కువ శరముల నెఱుంగును. కాని, తక్కిన వారినెల్ల వరుసబెట్టి నఱుక గలను.

కాని, పాండు భూపాల పుత్త్రుల గూపఱ చేయుటకు చేయాడదు. వారును నా మీఁద నత్యుదగ్ర బాణములను పఱుపరు. అని పలికి నాఁడు. నిజముగ జరిగినది కూడ అంతియే కాకున్న, అద్వితీయ పరాక్రమ సంపన్నుఁడు. శత్రుజన భీకరుఁడునగు భీష్ముఁడు నిజముగ కృషి సల్పియుండిన — పది దినముల సేనాధిపత్యమున పాండు కుమారులలో నొక్కనిని చంపలేక పోవునా!

అతని యాశయమును తెలిసియును దుర్యోధనుఁడు భీష్మునే సేనాధి పతిని గావించినాఁడు.

ఆ కురుక్షేత్ర యుద్ధమున పాల్గొనని వారిరువురే! బలరాముఁడు, రుక్మి, బలరాముఁడు — తన శిష్యులగు దుర్యోధన భీములు ఒండొరుల చంపఁజాలక, చంపుకొనుట చూడలేక సరస్వతీ తీరమున కేఁగినాఁడు. "రుక్మి" — కిరీటి కడకేఁగి "సమరము చేయ వెఱచితిని పలుకుము" అప్పుడు నీకు తోడ్పడి ఎట్టివారినైన జయింతును, అనెను అందులకు కిరీటి నవ్వి "నేను సమరమునకు వెఱచిత రమ్మని పిలిచినప్పుఁడు వచ్చెదవు గాని వెళ్లుము"ని పంపినాఁడు. రుక్మి — కౌరవ పతిఁని గూడ ఇదే విధముగ ప్రశ్నించినాఁడు. అతని చేతను నిరాకృతుఁ డైనాఁడు.

యుద్ధమున — వీరుల తారతమ్యములను గుర్తించి బిరుదు లొసంగుచుండిరి. ఇవి ఈ నాఁటి (Major Seseral, Golonel) వంటివి. వివిధ శ్రేణుల పట్టములొసంగు చుండిరి

భీష్ముఁడు సేనానాయకుఁడై కౌరవ పక్షము వారిని నిర్ణయించి తీరు — దుర్యోధనుఁడతిరథుఁడు. అతని తమ్ములు సమరథులు. కృతవర్మ అతిరథుడు శల్యుఁడును అతిరథుఁడు. భూరి శ్రవుఁడతిరథుఁడు. సైంధవుఁడు—మహారథుఁడు. కాంభోజరాజు — సుదక్షిణుఁడు సమరథుఁడు. మాహిష్మతీ పతి నీలుఁడు — అర్ధరథుఁడు. త్రిగర్త పతులు — మహారథులు, శకుని — సమరథుడు. లక్షణ కుమారుఁడు సమరథుఁడు. కృపుఁడు — అతి రథోత్తముఁడు. ద్రోణాచార్యుఁడు అతి రథోత్తముఁడు- రాధాసుతుఁడు — అర్ధరథుఁడు. భీముఁడతిరథ శ్రేష్ఠుడు, పాండవుల పక్షమున — యుధిష్ఠిరుడు అతిరథుఁడు కవలిరి సమరథులు. అర్జునుఁడు అన్నింటికి మించినవాఁడు.

సేనాధి పతులు — యుద్ధ రంభమున తమవైపు నుండి పోరాడ భూవల్లభుల నెల్ల పిలిపించి — ఉత్సాహ పఱతురు. తెగువను బోధింతురు. "రాజులకు ఆహవమే స్వర్గ ద్వారము. అందు మహా దారులు పూర్వముండి ఆ మార్గమున వెడలిరి. మీరును ఆ మార్గము నందే పోవలయును, నృపులకు ఇంటియందు తెగులున చచ్చుకంటె పాప మొకటి లేదు. ఈ పాలికలను పంటకలను, దీనిని కనుట నిధానమును గనుట" ఇట్లు పలుకు సేనాధిపతులకు వారు బహు భంగుల బాస యిచ్చుచుండిరి.

యుద్ధ ప్రారంభమున ధర్మజుఁడు కైదువులు, మైమఱువులు ఊడ్చి, ఆయుధమును రథముపై పెట్టినాఁడు. కాలినడకను భీష్మునికడకేఁగినాఁడు. అతనితో నిట్లు పలికినాఁడు—

"అనఘ, నీ కెదురునిల్చి యుద్ధము సేయుచున్నవాఁడను, మున్ను నీ చేత అనుమతి పొందుటకై వచ్చితిని. దీవించి పంపుము" అని యర్థించినాఁడు. భీష్ముఁడతనిని "వైరులను జయింపుము"ని ఆశీర్వదించినాఁడు. అదియే చరితార మెన్నతి.

క్రమముగా — గురు, కృప, శల్యులకు ప్రణామములు గావించి నాఁడు. వారలచే రణమున కనుజ్ఞ వడసినాఁడు.

మమ్ములను—ఇప్పటికైనను కలిసికొని మాతో చేరదలంచి ఎవ్వరైన ఇష్టపడినచో రండు. అని కౌరవుల దిక్కు మొగంబై పిలిచినాఁడు. ధృతరాష్ట్రుని పుత్త్రుఁడు — దుర్యోధనుని సోదరుఁడు యుయుత్సుఁడు అటువైపున కేఁగినాఁడు ఇట్లు అఖరిక్షణము వఱకు తమ వైపునకు వచ్చువారిని ప్రేరేపించుచుండిరి.

గురువులు శత్రు పక్షమునందున్నను వారి ఆశీర్వాదమును పొంది యుద్ధమున కుపక్రమించెడి వారు.

సేన—సంఖ్య :

సేనలు అక్షౌహిణులుగా లెక్కింపఁబడెడివి. "వరరథమొక్కండు, వారణమొక్కండు, తురగముల్ మూఁడును, కాల్బలము ఏవురు" చేరినచో దానిని "పత్తి" యనెడివారు అది త్రిగుణమైన "సేనాముఖము". మూఁడు సేనాముఖములు ఒక "గుల్మము" దాని మూఁడింతలు "గణము". త్రిగుణమైన "గణము" ఒక వాహిని. మూఁడు వాహినులు ఒక "పృతన" మూఁడు పృతనలు ఒక "జమువు" దాని మూఁడింతలు "అనీకిని" అది పదింతలు "అక్షౌహిణి" నామమునఁ బఱగును, ఒక అక్షౌహిణియందు మొత్తము — "రథములు ఇరువది యొక్కవేల ఎనిమిది వందల డెబ్బది, ఏనుగులను అంతియు, వీర భటులు ఒక లక్ష తొమ్మిది వేల మూఁడు వందల ఏబడి. తురగములు ఇరువది యైదువేల అఱువందల పది.

యుద్ధములు — వైవిధ్యము :—

చతురంగ బలములు యుద్ధములో ప్రధానము వ్యూహములు పన్నెడువారు. సంకుల సమరములు జరిగెడివి. ద్వంద్వయుద్ధములు

యుద్ధములోని వైవిధ్యము. అందులో గదా యుద్ధము, మల్లయుద్ధము ముఖ్యము

వ్యూహ రచనలు :—

"వ్యూహము"నగా విశిష్టసైన్య రచనా పద్ధతి. "వ్యూహస్తు" బల విన్యాసః"— అని అమరము.

"వ్యూహ్యతే రచ్యతే ఇతి వ్యూహః" అని వ్యాఖ్య. "ఊహ వితర్కే" "విశేషేణ ఊహ్యతే ఇతివ్యూహః" అని వ్యుత్పత్తులు. విశేషముగా ఆలోచింపఁబడునట్టిది. నిపుణుఁడగు వ్యూహము. సేనా నాయకుఁడు దీర్ఘముగా ఆలోచించి — రచించునట్టిది. చతురంగ బలములును ఆ వ్యూహమున యథాస్థానము నందుండును.

దండము, భోగము, మండలము, అసంహతము — అనునవి వ్యూహ భేదములు.

బలమును అడ్డముగా తీర్చిన అది దండము. చతురంగ బలమును ఒకటి వెనుక ఒకటి నిలిపిన అది భోగము మండలాకారముగ సర్ప శరీరము వలె తీర్చుట మండలము. బలమును వేరు వేరుగా తీర్చుట— అసంహతము.

వ్యూహమునకు వెనుకనుండి చెదరిపోయిన సైనికులను గూర్చు కొని వచ్చు సేనాభాగమునకు "వ్యూహ పార్ష్ణి" యందురు. ఈ"వ్యూహ పార్ష్ణి"నే ప్రత్యాసారమని కూడ అందురు. "భగ్నానాత్మీయాన్ ప్రత్యా సరతీతి ప్రత్యాసారః" ప్రతి గ్రహమను పేరుగల మఱొక భాగము కలదు. ఇందు రాజు—తాను నిభృతుఁడైయుండి తన సైన్యము గాసి చెందక నడిపించుకొని వచ్చును. ఈ "ప్రతి గ్రహము" ప్రధాన వ్యూహమునకు రెండు వందల వింట్ల దూరమున వెనుక భాగము నందుండును. సైన్యము సుశిక్షితమై యుండిన అల్ప సంఖ్యాకముల య్యును — వ్యూహరచన, శిక్షణలేని బహుసంఖ్యాక సైన్యములనుగూడ అవలీలగా జయింపఁగలదు.

మహా భారతమున అనేక వ్యూహములు పేర్కొనఁబడినవి. ఆకారములను, స్వభావములను ఒండొంటితో అవి పోరాడునప్పుడు అవలంబించు సన్నద్ధాకారములను శ్రద్ధతో పరిశీలించి తదనుగుణముగా సేనా సన్నివేశమును చేయుటచేత ఏర్పడినవని తోచును.

వ్యూహ నిర్మాణ ప్రయోజనములు :—

వ్యూహ నిర్మాణమున — అసు రూపములగు మాతృోద్ధనములు కల్పించుట కలదు. గాని అవి యెంతవఱకు సఫలమైయుండెనో చెప్పఁ జాలము. ఈ వ్యూహ నిర్మాణము "సర్వతోభద్రముగ" నొకచోట — "అభేద్యము" చారు భీషణ స్థాపకము"గా నొకచోట — కనిపించును. "ఆరూఢ వీర రస విస్తారముగా మఱొక్కచోట.

ఈ వ్యూహ రచనల ముఖ్యోద్దేశ్యములు పలు విధములు కొన్ని యెడల—శత్రువులపై పరాక్రమించి విజయము పొందుటకు రచింతురు. ఎదురు తాకిడులలో చిక్కు పడకుండుటకై మఱొక్క వ్యూహమును రచింతురు. ఎదుటి వారిని చిక్కువఱచుటకై మఱొక్క వ్యూహమును పన్నుదురు. తమ వారికి సాయపడుటకై మఱికొన్ని వ్యూహముల నిర్మింతురు. ప్రతి పక్షముల వారి సాయమును భంగపఱచుటకై వ్యూహముల రచింతురు.

తమ తమ చతురంగ సేనలను అనువుగా నడుపుటకై ఈ వ్యూహములు రచింపఁబడును. తమ సేనలను అక్షతముగా రక్షించు కొనుటకును వ్యూహములు రచింపఁబడును.

వ్యూహ రచన :— భీష్ముని పది దినముల యుద్ధములలో ఉభయ పక్షముల వారును పన్నిన వ్యూహములు—

మొదటి దినము — కౌరవులు మానుష వ్యూహమును పాండవులు అచల వ్యూహమును పన్నిరి-

రెండవ నాఁడు – పాండవులు మాత్రము క్రౌంచ వ్యూహమును పన్నినారు. మూఁడవ నాఁడు – గరుడ అర్ధేందు వ్యూహములు పన్న బడినవి. నాల్గవనాఁడు – వ్యూహరచన లేదు. ఐదవ నాఁడు – మకర శ్యేన వ్యూహములు రచింపఁబడినవి

ఆఱవ నాఁడు – క్రౌంచ, మకర వ్యూహములు
ఏఁడవ నాఁడు – వజ్రవ్యూహము –
ఎనిమిదవ నాఁడు–కూర్మ శృంగాటక వ్యూహములు
తొమ్మిదవ నాఁడు – కౌరవుల పక్షమున సర్వతోభద్ర

వ్యూహము రచితములు పదవ నాఁడు – వ్యూహరచన లేదు.

ఆ పదు నెనిమిది దినములందు మొత్తము రచింపఁబడిన వ్యూహములు–

మానుష, అచల, క్రౌంచ, గరుడ, అర్ధేందు, మకర, శ్యేనమండల వజ్ర, కూర్మ, శృంగాటక, సర్వతోభద్ర. శకట, మండలార్ధ, చక్ర సూచీముఖ, దుర్జయ–నామకములు.

మానుష–అచల వ్యూహములు. ఒక దానికొకటి తగిన బంధుర వ్యూహములు. గరుడ అర్ధేందు వ్యూహములును ఒకదాని కొకటి తీసిపోనివి.

మకర, శ్యేన వ్యూహములు పెద్ద విశేషములు కలవి కావు. మకర వ్యూహమునకు ప్రతి క్రౌంచవ్యూహము. మండల, భద్ర వ్యూహములు రెండును సమానములే. కూర్మ వ్యూహమునకు శృంగాటక వ్యూహము ప్రతి క్రౌంచవ్యూహమునకు చంచుత్వము భజించినవాఁడు చాల గట్టివాఁడుగా నుండవలయును. భారత యుద్ధమున – వ్యూహములు పన్నుటను స్పష్టముగా తెలిపిరి. కాని వ్యూహములందు కీలకస్థానములందుంటువారు గావించిన విశేష యుద్ధ

కౌశలములనంతఁగా చూపలేదు. వ్యూహ ప్రయోజనముల పైనను అంతగా దృష్టి యిడినట్లు కానరాదు. గరుడ వ్యూహ ప్రయోజనము మాత్రము కొంత చరితార్థమైనది.

ఆపే మనుస్మృతి యందును మను-7

శుక్రనీతి సారమున :

నద్యద్రి వన దుర్గేషు యత్ర యత్ర భయం భవేత్
సేనాపతిస్తత్ర తత్ర గచ్ఛేద్వ్యూహ కృతైర్బలైః 68 శ్లో

యాయత్ వ్యూహేన మహతా మకరేణ పురోభయే
శ్యేనేనోభయ పక్షేణ సూచ్యావా ధీరవక్త్రయా 69 శ్లో

పశ్చాద్భయేతు శకటం పార్శ్వయోర్వజ్ర సంజ్ఞకం
సర్వతః సర్వతో భద్రం చక్రం వ్యాలమథాపివా మను-7 70

మకర వ్యూహము పురో భయమైనది. శ్యేన వ్యూహము రెండు రెక్కలందును భయంకరము, సూచీవ్యూహమునకు బలము దానినోటి యందుండును. వెనుక భయమున్నపుడు — శకట వ్యూహమును పన్నవలెను. అన్నివైపుల భయంకరము — సర్వతో భద్రము, చక్రము వ్యాలము.

కురువృద్ధుఁడు గాంగేయుఁడు, ఆచార్యోత్తముఁడు ద్రోణుఁడు-వ్యూహరచనా జ్ఞానమున గంభీర సాగర సదృశులు, కురు పాండవ సేనలు కురుక్షేత్ర రంగమున చేరినవి.

మొదటి దినమున :— భీష్ముఁడు మానుప వ్యూహమున తన సేనను తీర్చిదిద్దెను. అందు భీష్ముఁడు పడమర మొగంబయి తానును ద్రోణుండును, తాలధ్వజము వేదికా కేతనమును క్రాలుచుండ ముందర నిలిచిరి వలపట కృప అశ్వత్థామలును, దాపట కృతవర్మ మద్రేశ్వరులును, వెనుక బాహ్లిక సోమదత్త భూరిశ్రవసులును, నడుమ కురు కుమార సహితముగా ఆ మహీనాథుఁడును అతని యగ్రభాగమున

"అర్జునుని చంపుదుము, చత్తుము అంతియు కాని యొండు లేద"ని శపథములు పలికి – సంశప్తకులని ప్రఖ్యాతులయిన సుశర్మ మొదలు గాగల పదివేవురు రథిక ముఖ్యులను కలయ ఎడనెడ తక్కిన యోధ వీరులును నిలుచునట్లుగా నియమించి తగునట్లుగా–ఆయా సైన్యములకు ఏనుగులు, ఏనుఁగులకు రథములు. రథములకు తురంగములు, తురంగములకు విండ్లవారు-విండ్లవారికి అర్ధాయుధులు అడ్డమగునట్లు నిలువ నియోగించి మానుష వ్యూహమును సమకట్టెను.

ఇట్టి దృఢ వ్యూహమును కనియు, వినియు నెఱుంగని ఎల్లవారు ఆశ్చర్యమున మునిఁగి ప్రియమందు చుండిరి.

"మానుష వ్యూహము"— భోగమను వ్యూహ భేదములలో చేర్ప దగినదిగా కనఁబడుచున్నది.

శత్రు వినాశమునకై త్రివిధ సైన్యమును – అనఁగా పదాతులను శతఘ్నులను గుఱ్ఱములను అత్యంత శక్తి వంతములుగా ఉప యోగించుటయే "వ్యూహించుట" అన వచ్చును.

భీష్ముని మానుష వ్యూహమునకు ప్రతిగా ధృష్టద్యుమ్నుఁడు "అచల వ్యూహము"ను రచించినాఁడు.

ఈ మొదటి దినపు వ్యూహరచన రాఁబోవు విషయమును సూచించు చున్నది.

కౌరవులు మర్త్యులవలె మృతిఁబొందఁగలరని, పాండవులు ధర్మము కొఱకు న్యాయము కొఱకు చలింపక పర్వతమువలె నిలిచి పోరాడగలరని ధ్వనించు చున్నది.

రెండవ నాడు – పాండవులు క్రౌంచ వ్యూహమును పన్నినారు. క్రౌంచవ్యూహమున–చంచు స్థానము అతి ప్రధానమైనది. ఈ స్థానమును ఫల్గునుడు అధిష్ఠించినాఁడు. కుంతి భోజుఁడు, శైబ్యుఁడు చక్షు

ష్ఠానమున నెలకొనిరి. దశార్ణ, శూరసేన, కిరాత దేశాధీశులు కంఠాకారమును, భీమసేనుఁడు — ధృష్టద్యుమ్నుఁడు — దక్షిణనామ పక్షములను భజించిరి. యుధిష్ఠిరుఁడు వెన్నుఁగా నిలిచెను.

అప్పుఁడు మువ్విధముల మొగ్గరముల మూఁడువైపుల కౌరవులు తలపడిరి. భీష్ముఁడా సమయమున — ఏ దిక్కున తానెయైనాఁడఁట! ఱెక్కలు సించి, కంఠమున రేకులు వాపెనఁట! శిరమ్మువచ్చి, క్రౌంచ చందమగు ఒడ్డనమును తొలఁగఁజేసినాఁడఁట! దిశలు శరకోటిని నింపినాఁడఁట,

ఇది క్రౌంచ వ్యూహ విధానము — ఆ విధానమున కౌరవ పక్షమెదుర్కొనిన తీరు.

తృతీయ దివసమున :— భీష్ముఁడు గరుడ వ్యూహమును పన్నినాఁడు. దానికి ద్రోణ కృతవర్మలు — కన్నులు. భీష్ముఁడు — ముక్కు. దానికి ప్రతిగా పాండవులలో ధృష్ట ద్యుమ్నుఁడు అర్ధేందుని చందమున వ్యూహాము పన్నెను.

ఆ యుద్ధమున — గాంగేయుఁడు ప్రతి యోధులను పేరు పేరున బిలుచును. బాణములచేత దిక్కులు పిక్కటిల్లఁజేయును.

ఎక్కడఁజూచిన తానయై యెఱుఁగు మెఱసిన తెఱంగున, కొఱవి త్రిప్పిన యొప్పున, ఇంద్ర జాలంబు సూపిన చందంబున — తన రథము మెఱయ — శక్తి శౌర్యములు నెఱయ ఎవ్వరికిని నిలువ రింప రాక ఎదిరించెను.

ఒక్కొక్కయెడ పెక్కురూపముల — ఒక్కబాణమునే వేయును పెక్కు బాణములతో ఒక్కఁటిని గూల్చును. పైఁబడిన యోధులను కీలెడలిన జంత్రంబుల బోలె నేలపై, గూలవేయును.

కార్చిచ్చు పొదివిన పోలికను, మాయ గావించిన విధమున మంత్రించి పడవైచినట్లు, విజృంభించి కౌంతేయుల సేనను చెదర

గొట్టుచు – ప్రళయ కాలమున తాండవమొనర్చు ఫాలలోచనువలె – పరాక్రమ నృత్యము సేయుచుండినాఁడు. పోరు సవ్యసాచి యొక యోధాగ్రేసరుఁడలసినట్లు కనిపించిన అందఱును అతనిపైఁబడుదురు. ఇది విభిన్న యుద్ధ భంగిమలు. వ్యూహరచనతో యుద్ధములు చేయుతీరు.

ఒదవ నాఁడు :— భీష్ముఁడు మకర వ్యూహమును, పాండవులు శ్యేన వ్యూహమును మొహరించిరి. అందు ముఖమున భీమసేనుఁడు నిలిచెను. యుద్ధభూమి యందు అస్త్ర శస్త్ర సంఘట్టనమున – వెడలు మంటలు మింటిగెగురు చుండినవి.

రథములు తాఁకి కరులు పడి పొరలు చుండినవి. కరి హస్తాకర్షణములచే రథములు విధ్వస్తములైనవి. తురగ ఖుర పుటములచే పదాతుల గాత్రములు విఘట్టితములైనవి అనర్గ ప్రహారముల చేతను, రక్తధారలచేతను ఘోటకములు సిక్తములైనవి చూపరులు వెక్కసపడుచుండిరి.

వ్యూహములు రెండు విధములు ;—

విక్రమ వ్యూహములు, సంరక్ష వ్యూహములు – (Offensive, defensive.) కూర్మవ్యూహము సంరక్షము, మకరము విక్రమ వ్యూహము.

ఆఱవ దినమున :— పాండవులు మకర వ్యూహమును పన్నిరి. కౌరవులు దాని కెదురుగా క్రౌంచ వ్యూహమును రచించిరి. మకర వ్యూహమున – పార్థ పాంచాల పతులు శిరము.

దీనికి ప్రతి వ్యూహము క్రౌంచమున – భీష్ముఁడు చంచు స్థానమునందు నిలిచినాఁడు. ఇట్లు ఒత్తనలు మాఱొడ్డనలతో యుద్ధము సాగినది.

సప్తమ దినమున :— పాండవులు వజ్ర వ్యూహమును పన్నిరి. కౌరవులు వ్యూహమును పన్నలేదు.

యుద్ధమున – కేతనముల నఱకుట – సారథి రథిక రథ్యాంబుల ప్రాణంబులు తీయుట – ఆతపత్త్ర చామరములు పాడి సేయుట – చాపంబుల రూపఱ సేయుట–వర్మంబుల చీల్చుట – మర్మంబులందు బాణంబుల గ్రుచ్చుట – సర్వాంగముల నొంచుట–తలలు ద్రుంచుట – ఇట్టివి వీర విహారములు.

అష్టమ దివసమున :– కురు పితామహుఁడు కూర్మ వ్యూహమును పన్నెను సునాభుఁడు మొదలగు కౌరవకుమారులు – భీమునిచే చచ్చిరి. అప్పుఁడు సుయోధనుఁడు భీష్ముని కడకుఁ జనిశోక గద్గద కంఠుఁడైనాఁడు ఇట్లని విలపించుచున్నాఁడు.

"అక్కటా! నా సుపుత్త్రుఁడు విజృంభించి నా తమ్ములను చంపఁగా చూచుచుంటివి. నీకు రోష శోకములు లేవా! తోడుపడుట తగదని తలఁచితివా! ఉన్న వారందఱును ఒక్కుమ్మడిని చావవలెనని ఊరకుంటివా" అని తీవ్రముగా పలికినాఁడు. అప్పుఁడు నదీసుతుఁడు–

"ఈ విషయమును ముందే నేనును, ద్రోణుఁడును, విదురుఁడును చెప్పితిమి కదా! పాండవ తనూజులకెదురుగా నిలిచి జయించుట కెవరి వశము! వీర స్వర్గమే ధనముగా పోరుము. నేనును నా యోపినంత తెగి పోరెదను" అని పలికినాఁడు.

ఆ రాత్రి దుర్యోధనుఁడు భీష్ముని పాలకేఁగి "నీవు సేనాపతిత్వము చాలింపుము- కర్ణునికి పట్టము కట్టుమని పలికినాఁడు.

అప్పుఁడును భీష్ముఁడు అర్జునిని గొప్పతనమును పొగడి, "అట్టి జెట్టితో ఇన్ని దినములు పెనఁగితినే! అయినను నీ చేత ఇట్టి వేడి పలుకులు వినవలసి వచ్చెనని" పలికినాఁడు.

ఇచ్చట శత్రువును, పరపక్షమునందున్న వానిని – తన కంటెను గొప్పయని నమ్మి భీష్ముఁడు యుద్ధ మొనర్చినాఁడు. అందువలన

సంపూర్ణమగు ఆత్మ విశ్వాసమును కోలుపోయి పెనఁగిన సేనాధిపతికి జయము లభించుట దూరమే అని తెలియుచున్నది.

నవమ దినమున :— అమరనదీ సుతుఁడు సర్వతోభద్ర వ్యూహమును పన్నినాఁడు. అందు, కృపాచార్య, కృతవర్మ, శల్య, శకుని సుదక్షిణ సైంధవులును. కురు కుమారులును తానును ముందు నిలిచిరి. భీష్ముఁడు — "సేనాయుధ వ్యాపారమును విసర్జించినపుఁడు "నన్ను జయింప గలుగుదురు. జోడు లేనివానిని, ఆయుధము లేనివానిని, ధ్వజము దింపిన వానిని, అంగనను అంగనా పూర్వుని, అంగనాభిధానుని, తలచీర విడిపోయిన వానిని, భ్రాతృహీనుని, అపుత్రకుని గాంచిన యుద్ధము వదలుదును. పుట్టినప్పుఁడు లేక, నడుమ దైవమిచ్చిన పురుషత్వము గలవానితోను శయ్యాముసర్పను" అని ప్రతిజ్ఞ సలిపిన వాఁడు కావున శిఖండి ఎదుర్కొనినపుఁడు గాంగేయుఁడు యుద్ధమునుండి తొలఁగినాఁడు.

అప్పుఁడు కురురాజ సురనదీసూనుని సమీపించెను. "నీవుండగనే మన సైన్యము దైన్యము పొందఁదగునా" అని హెచ్చరికలు చేసినాఁడు, అప్పుఁడు గాంగేయుఁడు—

"ముందు పదివేవురను చంపుదున"ని బాసయిచ్చి యుంటిని. బాస ప్రకారము నీ ఋణమును తీర్చితిని. నేఁటి యుద్ధము చూడ ండవులు నన్నుఁడె, నేను వారినొండె సహుయుఁజేత కలుగును." అని లికి యుద్ధరంగమున విజృంభించి యుద్ధలీలలఁజూపినాఁడు.

భీష్ముఁడెంత భయంకర యుద్ధము చేసినను పాండవులలోనొక్కని గూడ చంపలేదు. చంప నిచ్ఛలేదేమో! మఱియు దుర్యోధనునితో "నీ కిచ్చిన బాస ప్రకారము పదివేవుర చంపితిని, నీ ఋణము తీర్చుకొంటిని అని పలుకుట చూడ — భీష్మునకు సంఖ్యపై గల దృష్టి —

ప్రముఖులపైన లేదనికూడ తెలియుచున్నది. ఇందులకు ముఖ్య కారణము — ధర్మమునకు జయము చేకూర్చవలెనను దీక్షయే! భీష్ముఁడే తలంచిన పాండవులను చంపలేకకాదు. పాండవులు జయించి, ధర్మజుఁడు రాజ్యమేలవలెనను ఆకాంక్ష అతనిని నిట్లు చేయించిన దింతియే!

అప్పుఁడు భీష్ముఁడిట్లు తలంచినాఁడు "ఉత్తమ క్షత్త్రియులను నానిశిత శరముల చంపితివి. ఇఁక ఈ మేనితో పొత్తు మానుదును" అని, బలము తెరల్చుకొనుచు కౌంతేయాగ్రజుని సమీపించినాఁడు.

"పుట్టినది మొదలు క్రూరవృత్తిచే ఎందఱినో చంపితిని. ఈ రాక్షస కృత్యమునింక సలుపఁజాలను. నా హితమును కోరెదరేని శిఖండిని ముందిడుకొని నాపై, బడుఁడు" అని తన వినాశమునకు తానే మార్గమును తెలిపినాఁడు. అంపశయ్య నలంకరించినాఁడు ఇట్లు పగ వారికి తనమరణరహస్యము తెలిపి చనిపోవు సేనాధిపతి అంతర్యమేమి? అని ప్రశ్నవచ్చును. కేవలము పాండవులపై మోహము కాదు. వారి గుణములపై మోహము.

పాండుకుమారులకు వంచన జరిగినదని పరితాపము. ధర్మజుని వంటి శాంతమూర్తి, అధర్మ వినాశకుఁడు, ధర్మపక్షపాతి రాజ్యము చేయవలదా అను ఆశయము. తాను బ్రతికినంతవఱకును కౌరవుల కపజయము అసంభవమను జ్ఞానము — భీష్మునిట్లు చేయించినది.

మహాభారతమున — భీష్ముని జీవితమంతయు త్యాగముతో కూడు కొన్నది. కాని, ఆ త్యాగము సఫలము కాలేదు,

తండ్రి కొఱకు త్యాగము, సింహాసనాధికారము వలదని ప్రతిజ్ఞ, యావజ్జీవము బ్రహ్మచారిగానుండుటకై కఠోర దీక్ష ధర్మ విజయము కొఱకు అస్త్ర త్యాగము! ఒకటేమి? అతని జీవితమే త్యాగమయము.

భీష్మునకు తనది అనునదొక్కటి లేదు. రాజ్యము తనది కాదు. సంతానము తనకు లేదు. అధికారమును పరిత్యజించినాఁడు- మఱి — సేనాపతియైనందులకు? ఉన్నది ఒక్కటే! ధర్మ విజయమునకై ప్రయత్నము చేయుట! ఉప్పుతిన్న ఋణము తీర్చుకొనుటకు!

సత్య సంరక్షణకై ఆత్మార్పణము గావించిన వ్యక్తి భీష్ముఁడు. కనుకనే — కర్ణుని అర్ధ రథుఁడని ఎత్తిచూపి — యుద్ధరంగము నుండి తొలఁగించినాఁడు. పదిదినముల యుద్ధములలో పాండవులలో నొక్కరి నైన చంపలేదు.

పాండవులలో ఏ ఒక్కరు చనిపోయినను — ధర్మజుఁడు మహీ మండలమునకు రాజు కాఁజాలఁడని — భీష్ముఁడెఱుంగును.

కనుక సేనాధిపతియై యుండియు, స్వచ్ఛంద మరణమే వర ముగా గలవాఁడైనను "పాండవులజేయులని" పాండవుల ఆధిక్యము దుర్యోధనునితో మఱి మఱి తెలుపుచునే యుండెను.

కావున — భీష్ముఁడు ధర్మసంస్థాపన కొఱకు పిలఁబడినవాఁడని శక్తివంచన లేక కురు పాండవుల ఐక్యతకై పాటు పడినవాఁడని—అట్లు సంధి కుదరక యుద్ధము సంభవించినపుడు ధర్మ స్థాపనకై అవకాశ మొసంగి పాండవులను చంపక వదలెనని తన మరణమునకు తానే మార్గము చూపి యుద్ధ రంగమునుండి నిష్క్రమించెనని — ధర్మ పక్ష పాతమును చూపి వంశ గౌరవమునకు పాటు పడిన కురుకుల పితా మహుఁడని తెలియుచున్నది.

❀❀❀❀❀❀❀❀❀

ద్రోణుఁడు :—

గుకారోహ్యంధ కారస్స్యాత్
రుకారస్తన్నిరోధకః" అని

అంధకారమును — అజ్ఞానాంధకారమును పాఱద్రోలుటకై యేర్పడిన "గురు" — పీఠమును "ఆచార్య" పీఠమును అధిష్ఠించినవాఁడు ద్రోణాచార్యుడు. ఇతఁడు భరద్వాజుని పుత్రుఁడు,

బ్రాహ్మణుఁడయ్యును — శాంత గుణమును వీడి — సాత్త్విక స్వభావమును వదలి — రజో గుణమును క్షాత్త్ర స్వభావమును అవలంబించిన వాఁడు,

శస్త్రముల నభ్యసించి విలువిద్యనేర్చినాఁడు. క్షత్త్రియ బాలురకు నేర్పించినాఁడు. మంత్రానుష్ఠానమొనర్చి అమోఘ మంత్ర జాలమును పొందినాఁడు. శిష్యులకు పొందించినాఁడు.

దారిద్ర్యముననుభవింపలేక — ఏకైక పుత్త్రుఁడగు అశ్వత్థామ ఆకలిబాధను చూడలేక—చిన్ననాఁటి మిత్త్రుని — ద్రుపద మహారాజును చేరినాఁడు. గోవును యాచించి పరిభవ పాత్రుఁడైనాఁడు. పరాభవము పగగా మాఱినది బ్రాహ్మణుల కోపము తృణాగ్ని సదృశమను మాటను మఱపించినాఁడు జీవితాంతము పగను—క్రోధమును నిలుపుకొన్నాఁడు.

"పగ" తీర్చుకొనుటకై ధృతరాష్ట్రునాశ్రయించినాఁడు. కౌరవ పాండవులకు ధనుర్విద్యాచార్యుఁడైనాఁడు. వారిలో అర్జునుని మహత్తరమగు కౌశలము గలవానిఁగా గుర్తించినాఁడు. అతనిని తన పగ తీర్చుకొనుటకు సాధనముగా నుపయోగింపఁదలఁచు కొన్నాడు అద్వితీయ ప్రతిభాసమన్వితునిగా తీర్చి దిద్దుదునని మాట ఇచ్చినాఁడు. అందులకై ఏ పాపము నెఱుంగని — శిష్యరికము చేయని — భక్తుని — ఏకలవ్యుని దక్షిణాంగుష్ఠమును బలిగా (దక్షిణగా) గ్రహించుటకును వెనుదీయలేదు. అర్జునుఁడు సర్వవిద్యాకుశలుఁడైనాఁడు. "ద్రుపదుని తన పాదములపై

తెచ్చి పడవేయుటయే గురుదక్షిణ" యని కోరినాడు. అర్జునుడంత పనిచేసి గురుదక్షిణ నొసంగినాడు. అంతటితో పగతీరలేదు. జీవితమున చిట్టచివరి వఱకు ఆ ద్వేషాగ్ని రగులుచునే యుండినది. ద్రుపదుని తన చేతులతోనే చంపిన విప్రవరుడితడు.

కురుక్షేత్ర యుద్ధమున – భీష్ముని యనంతరము పట్టాభిషిక్తుడై సేనాధిపతి పీఠము నలంకరించినది ద్రోణాచార్యుడే! ఇతని ఆధిపత్యమున యుద్ధము అయిదు దినములు జరిగినది.

"ఆచార్య పీఠము" నందున్నవాడు "సేనాధిపతి పీఠము"నలంకరించినాడు. "స్వధర్మే నిధనం శ్రేయః" అను శాస్త్ర వాక్యమును పూర్తిగా విస్మరించిన వీరుడితడు.

ఎన్నో ఘట్టములందు భీష్మునితోపాటు కౌరవులకు బుద్ధులు చెప్పినవాడు. హితముపదేశించినవాడు న్యాయ మార్గమును చూపిన వాడు పాండవ పక్షపాతి, అర్జున ప్రియుడు. అయినను పాండవుల కెదురుగా యుద్ధమొనర్పవలసిన స్థితి కంగీకరించినాడు సేనాధిపతియైనాడు. బ్రాహ్మణుని యందలి క్షాత్రము పురకలు వేసినది. పగ తీర్చుకొను సమయమాసన్నమైనది. ఉబ్బిపోయినాడు. దుర్యోధనునితో "ఇంతటి పదవికి నన్ను నిలిపి ఆదరించితివి. వరమొసంగుదు, కోరుమ"ని ప్రతి ఫలమునిచ్చుటకు సిద్ధమైనాడు,

ఇది తన ధర్మముకాదని వెనుకాడలేదు. విప్రుని లక్షణము కాదని వెరవలేదు.

దుర్యోధనుడు–అజాత శత్రుని ప్రాణములతో బంధించి తెచ్చుటయే వరముగా కోరినాడు. అట్లు తెచ్చిన – అతనితో తిరిగి జూదమాడి అరణ్యములకు పంపి యుద్ధమును చాలింతునని తలంచినాడు! ఇట్టి కుటిల బుద్ధికి రోసినను గురువు – అనుగ్రహించినాడు, కాని కార్యరూపమున పెట్టవలసి వచ్చినపుడు అతని శిష్య వాత్సల్యమంగీకరింపలేదు. పాండవ పక్షపాతము గెలిచినది.

రణ రంగమున – ద్రోణుఁడు – బాపఁడైనను – రథముల కూల్చుచు – తేరుల మరల్చుచు – కాల్బలముల బారి మార్చుచు – మారి మసఁగిన విధమున – విజృంభించి వీరాధి వీరుని కృత్యముల సలిపినాఁడు. సత్యజిత్తును చంపెను, విరాటుని బరిమార్చెను. పద్మ వ్యూహమును పన్ని – అభిమన్యు మరణమునకు మార్గమేర్పఱచెను. అయినను సంగరమును నిష్పక్షపాతముగ నొనర్చెనని – చెప్పలేము. అర్జునుఁడెదుర్కొనినపుడు రోషము హర్షముగా మారి ప్రశంసించుట జరిగినది. అర్జునుని గాంచిన క్రోధము వీడి చిరునవ్వులు చిందించి నాఁడు.

ఫల్గునుఁడు ద్రోణాచార్యుని గడచి – బహువిధ యోధుల పరి మార్చెను. వీరవిహారము సలుపుచుండెను. అయినను ఆచార్యుఁ డతనియెడ తీక్ష్ణముగా ప్రవర్తింపలేదని దుర్యోధనుఁడు గుర్తించినాఁడు. కట కట పడినాఁడు.

"నిన్నవలీలఁగ దాఁటి – ప్రజల నేలకుఁ గోలకుఁదెచ్చుచున్న అర్జునుని తలయెత్తియైనను చూడవే" అని ఎత్తిచూపినాఁడు. "మాదెస కప్ప మెలుఁగు పామవైతివ"ని నిందించినాఁడు. "పాండవ పక్షపాతివి" "తేనె పూసిన కత్తివి" అని దూషించినాఁడు. ద్రోణుఁడప్పుఁడు—

"వృద్ధుఁడనగుటఁజేసి నాకు శీఘ్రయానము అశక్యమైనద"ని దాటవేసినాఁడు. సైనాధిపత్యము నంగీకరించునప్పుఁడితనికి వృద్ధాప్యము స్మరణకు రాలేదు కాబోలు?

తన చిన్ననాఁటి పగతుఁడగు ద్రుపదుని చంపునప్పుఁడును గుర్తుకు రాలేదు.

ఫల్గునుని హతమార్పవలసినపుఁడు మాత్రము వృద్ధాప్యము జ్ఞప్తికి వచ్చినది.

ఒకసారి – ధర్మజుని ముఖాముఖి ఎదుర్కొనుటయు సంభవించినది. ధర్మతనయుని రథ్యముల కూల్చెను. ధనువును–కేతువును దునిమెను. ధర్మజుఁడు నిరాయుధుఁడైనాఁడు. ఊర్ధ్వ బాహువైనాఁడు. అప్పుఁడు దుర్యోధనున కొసంగిన వరమును ఫలింపఁజేయు అవకాశ మబ్బినది- చేజిక్కిన శత్రువు యుధిష్ఠిరుఁడు, ఆ సమయమున

క॥ కనుగొని గురుఁడవ్విభునే
యను బొడువను జేతులాడకట పార్శ్వములం
దన చూడ్కి, బడిన హయరథ
మనుజద్విప సముదయముల మడియించెవడిన్

భార. ద్రోణ 245

చేఁజిక్కిన శత్రువును వదలి – వరదానమును విస్మరించి–చేతులాడక-తన చూడ్కికి, బడిన హయరథ మనుజద్విప సముదాయముల శీఘ్రముగా మడియించినాఁడు – ఆ ధనుర్విద్యానిపుణుఁడు!

ఇది యాతని పాండవ పక్షపాతము! ఆగ్రహించెనా తిరుగులేదు. అభిమానము చూపెనా మఱపురాదు.

తన చేతులార ద్రుపదుని చంపి పగ తీర్చుకొనెను. పాంచాల రథికులను చంపెను. ధృష్టద్యుమ్నుని చంపవలెనని యాశించెను. ఇంతలో "అశ్వత్థామ హతుడయ్యె" నని యెదిరి వీరులా క్రోశించిరి. అతనికి చేతులాడుటలేదు.

విశ్వామిత్ర – భరద్వాజ – జమదగ్ని – కాశ్యపాదులు అతని కడ కేతెంచిరి. "వేద వేదాంగ విదుఁడవు, నీకి సంగ్రామము చేయుట ధర్మముకాద"నిరి.

"ఇంతకుముందు చేసితివేని చేసితివి. కాలము సంపూర్ణమైనది. ఉడుగుట మంచిది" అని బోధించి యంతర్ధానమైరి.

ధర్మజుని తనకుమారుని మరణము సత్యమా అని ప్రశ్నించినాఁడు. శ్రీ కృష్ణుఁడు – ధర్మజుని – "ప్రాణ రక్షణ సమయమున అసత్యము పలుకుట దోషముకాదు. పలుకుమ"నినాఁడు. ధర్మజుఁడు–చచ్చిన అశ్వత్థామయను వారణమును మనసునందుంచుకొని "అశ్వత్థమసచ్చె" నని బిగ్గరగా పలికినాఁడు. ద్రోణునకు చేష్టలుడిగినవి. బ్రాహ్మణ భావము – పుత్ర ప్రేమను పెల్లుబికించినది. చేష్టలుడిగినపుడును ధృష్టద్యుమ్నుని చూచుచు ఉండిపోయినాఁడఁట! ఆ చూపులు – ద్వేషముతో కూడిన చూపులు అయ్యో! ఇతనిని చంపకనే యుద్ధము చాలించు చుంటినే యను అసంతృప్తితో నిండిన చూపులు.

"ఓ కర్ణ! ఓ కృప! యుద్ధమున నా చేతనయినంత చేసితిని. మెలకువతో నుండుఁడు" అని పలుకుచు బాణము నుజ్జగించినాఁడఁట! అయినను అతని యోగానుష్ఠానము గొప్పది. "సంభృత యోగనిష్ఠుడై– తనువు విడిచి – తేజోమయాత్ముఁడైనాఁడ"ఁట! ఆ ఆచార్యుఁడు జ్యోతీ రూపమున పరము పదమును పొందినాఁడఁట!

పుట్టుకతో బ్రాహ్మణుఁడయ్యు – క్షత్త్ర ధర్మమననుష్ఠించినవాని జీవిత చరితమిది?

ఇతని వైరమునకు మించిన వైరము ధృష్టద్యుమ్నునిది? ఇరు వైపుల హా హా కారములు చెలరేగుచున్నను – లెక్కింపక ద్రోణుని శవమునే–కేశములఁబట్టినాఁడు. ఖడ్గహతిని శవముమెడ ద్రుంచినాఁడు. ఇట్లు —

మిత్త్రునితో పరాభవము పొంది – పరాభవము పగగా – దీర్ఘ వైరముగా మాఱిన – అవకాశము యుద్ధమున లభించినపుఁడు తానభ్యసించిన విద్యను సాధించిన తీరు, పగ సాధింపఁదలచు కొన్నవారిని చంపినాఁడు. ప్రీతి పాత్రులైన వారిని వదలినాఁడు.

ఇట్లు బ్రాహ్మణ కర్తవ్యము — క్షాత్ర ధర్మముగా మాఱిన గాథ ఇది — ద్రోణుని చరిత్ర ఇది. భారత రాజకీయ చరిత్ర యందు శాశ్వతముగా వెలుఁగు ధ్రువతార వెలుగు ఇది.

పద్మ వ్యూహము :—

పద్మ వ్యూహమును సంఘటించు నపుఁడు — వివిధ దేశముల రాజులు దళములుఁగా, రాజ కుమారులు కేసరములుగా కర్ణిక గాను ఉందురు. కర్ణికా భాగమున ప్రధాన వీరుఁడుండును. అతని చుట్టును వివిధ యోధులుపత్రములై యుందుఱు.

శత్రుపక్షమునుండి యెవరైన సేనాధిపతి నతిక్రమించి లోపలకు బోయినచో ఱేకులు, కేసరములుగా నున్నరాజులు, రాజ కుమారులు తమ తమ బలములతో చుట్టుముట్టుదురు. కర్ణికగా నున్న రాజు మొదలగు వానినెదిరించి పోరుదురు. పై నున్న యోధులలో కొందఱు వానినిఁబొదివి చిక్కించుకొని మట్టు పెట్టుదురు. తక్కిన వారును — పైనుండి చిక్కిన వానికి తోడు రానీయక అడ్డగింతురు

కౌరవులు పన్నిన పద్మ వ్యూహమున అభిమన్యుఁడు. ఇవేరీతిగా ప్రవేశించినాఁడు. చొచ్చి — మహార్ణవమున తిరుగు మందర నగము చందమున ఆ వ్యూహమును త్రిప్పి, పాడుచేసి, రూపుమాపి, వీర విహారమును సలిపినాఁడు, చతుర్విధ బలాబలముల చించి, చెండాడి నాఁడు మేనులు సించి, తలలు చిదిమి, కండలు చెక్కుచు పరుగు పెడినాఁడు. అట్టి స్థితి యందాతనిని చిక్కించుకొని, పైనుండి సహాయము రానీక — జయద్రథాదులును, ద్రోణుఁడును మట్టుపెట్టిరి.

మను. 7 188

యతశ్చ భయమాశంకేత్తతో విస్తార యేద్బలం
పద్మేనచైవ వ్యూహేన నివిశేత సదాస్వయం.

ఏ దిక్కున శత్రుభయమును శంకించునో అచ్చట బలమును విస్తారముగా నుంచవలయును. పద్మవ్యూహము చేత సర్వదా కపట నివేశమును గావించు కొనవలెను.

శకట వ్యూహము ;—

శకటాకారము నందలి వ్యూహము శకట వ్యూహము. భారత యుద్ధమున శకట వ్యూహ నిర్మాణ మతి విచిత్రమైనది. అర్జునుఁడు రవి యస్తమించు లోపల సైంధవుని తల త్రెవ్వ నేసెదనని — ప్రతిజ్ఞ గావించినాడు. ఆప్రతిజ్ఞను భంగము గావించుటకై ద్రోణుఁడీవ్యూహమును పన్నించినాడు. తన్మధ్యము మొదలు కొని — సేనాముఖము దెసకు నిగుడునట్లు సూచీ వ్యూహము గావించెను. సూచీముఖమున కృత వర్మ — సూచీ మూలస్థానముగా నిలిచినాఁడు. పద్మవ్యూహ గర్భమున కృప, అశ్వత్థామ, భూరి శ్రవశ్శల్య కర్ణ వృషసేనులుండిరి.

అసంఖ్యాక చతుర్విధ బలములలో సైంధవుఁడు నిలిచినాఁడు. ద్రోణుఁడు పటు ధనుర్ధారియై నిలిచినాఁడు. మొదట ద్రోణుని, తరువాత వరుసగా ఎందఱో మహాయోధులను అసంఖ్యాక చతురంగ బలములను జయింపనిదే సైంధవుని దెస చూడఁజాలఁడు — దీన అర్జునుని సమయ భంగమగుననియు కౌరవులుత్సాహ మందిరి.

కాని, శ్రీ కృష్ణుఁడు మాయోపాయమును పన్ని, చక్రము నడ్డముగా వైచి, అకాల సంధ్యను నిర్మించినాఁడు. ఆ సంరంభమున సమీపించిన సైంధవుని ఫల్గునుఁడు చంపుటకు అవకాశమును కల్పించెను.

అస్త్ర యుద్ధ వర్ణన :—

కర్ణ పర్వమున కర్ణార్జునులు యుద్ధ మొనర్చుచుండిరి— అందు-పార్థుఁడాగ్నేయాస్త్రమును వేసిన దారుణ మహాగ్ని జ్వాలలు నభస్థలిని వ్యాపించినవి. దానిని కర్ణుఁడు — వారుణాస్త్రమున శాంతము గావించెను.

ఫల్గునుఁడు మేఘబాణము నేసిన – భూనభోంతరములు మేఘావృతములై అంధకార బంధురమైనది. సూతసూనుఁడ నిలాస్త్రమును వేసిన – ఆ క్షణమే తమము విరిసిపోయినది. అర్జునుఁడైంద్ర బాణము వేయఁగా కర్ణుఁడభిమంత్రిత బాణ సమూహముతో దాని యుద్రేకము నణంచినాఁడు.

కిరీటి బ్రహ్మాస్త్రమును వేసిన కర్ణుఁడు దాని సంరంభము నుడిపినాఁడు.

కర్ణుఁడు నాగాస్త్రమును వదలినాఁడు. దాని ధాటికి మంటలు ప్రబలినవి. పద్మనాభుఁడు – కిరీటిని ఆ అస్త్రము బారి నుండి తప్పించుటకై ఐదంగుళములు మాత్రము రథము ధరణిలో క్రుంగునట్లు అదిమినాఁడు. ఆ నాగాస్త్రమపుడు విజయుని చంపక అతని తేజము కుందునట్లుగ కిరీటమును మాత్రము హరించినది.

వనధి వాసులగు నివాత కవచుల నోడించినప్పుడు ఇంద్రుఁడొసఁగిన కిరీటమది. ఢిక్కృతులచేతను చెడని కిరీటమది. అట్టి దానిని కర్ణుఁడు పడద్రోసినాఁడు. కర్ణున కపుఁడు – రణ రంగమున భార్గవాస్త్రము స్ఫురింపలేదు. అది శాపము. అప్పుఁడు బ్రహ్మాస్త్రమును కర్ణుఁడు ప్రయోగించినాఁడు.

పార్థుఁడు దానికెదురుగా ఐంద్రాస్త్రమును ప్రయోగించెను. కర్ణుని బ్రహ్మాస్త్రము ఐంద్రాస్త్రము నపహరించినది. అప్పుఁడు కవ్వడి బ్రహ్మాస్త్రమును ప్రయోగించినాఁడు. అది కర్ణుని బ్రహ్మాస్త్రమును హరించినది విష విస్ఫురితమగు రౌద్ర మంత్ర సహితముగా కర్ణుడు బాణమును సంధించినాఁడు. అప్పుఁడే కర్ణుని రథ చక్రము నేలకు దిగబడినది. చక్రము నెత్తెదను, అందాక నిలువుమ"ని యర్జునుఁ డడిగి నాఁడు.

"నేను భూమిస్థుఁడను – నీవు రథస్థుఁడవు. విరిదల వానిని, విరథుని, ఆయుధము వీడిన వానిని శూరులెందును వేయరు. నీవు మహా శూరుఁడవు. ఉత్తమ కులజుఁడవు. రణ ధర్మ కోవిదుడవు. నీ స్థితికి తగినట్లు ధర్మ యుద్ధమొనరింపుము. ఇది న్యాయము కాదని పలికితిని కాని భయముతో కాద"ని యర్థించినాడు. కర్ణుఁడు.

అప్పుఁడచ్యుతుఁడు కల్పించుకొని యిట్లు పలుకుచున్నాఁడు— "ఏమేమీ! న్యాయమను మాట, ధర్మమను తలంపు నీ మనస్సున ఈ నాఁడు పుట్టినదే!

కొంతియు, కొడుకులను నిద్రించునపుఁడు, లక్కయింటిని కాల్చినపుఁడు ఈ న్యాయమెచ్చటికి పోయినది?

కపటపు జూదమాడితిరి. సభా స్థలమున ద్రుపదాత్మజను ఆరీతిగా భంగ పఱచితిరి అప్పుడీన్యాయము స్ఫురింప లేదా? అడవిక్షి ఘోషయాత్రా నెపమున దాడివెట్టి పాండవులను చంపఁదలంచినపుఁడీ న్యాయ మెక్కడికి పోయినది.

బాలుఁడగు అభిమన్యుని బహురథికుల చేత చంపించితిరి. అప్పుఁడు న్యాయము లేదా? ఇన్ని పాపము లెడల నీ న్యాయమెందు బోయినది? అని

అర్జునుని అస్త్రము వదలుమని పురికొల్పినాఁడు ఆ మహాస్త్రము కర్ణుని శిరమును త్రుంచి నేలపడవేసినది. అప్పుఁడర్జునుఁడు–అచ్యుతుని ప్రేరేపణ లేకుండిన కర్ణుని యభ్యర్థన నాలకించెడు వాఁడేమో! అస్త్రము వదలువాఁడు కాదేమో? అప్పుఁడు కర్ణుని చావు దుర్లభమయ్యెడిదేమో! భారత కథ మఱొక మలుపు తిరిగి యుండెడిది. కనుక శ్రీ కృష్ణుని వంటి సారథి – ప్రేరకుఁడు – పాండవుల కడ లేకుండిన పాండవుల విజయము దుర్లభమయ్యెడిది.

ఈ కర్ణుని జీవితము – విధిహతమైనది. శాపగ్రస్తమైనది. కూట నీతికి బలియైనది. కనుకనే మధ్యందిన మార్తాండ బింబమువలె వెలిఁగిబోవు వీరుఁడు విధివంచితుఁడై నేల కొఱఁగినాఁడు.

కూటనీతికి అతఁడెట్లు బలియైనది – ఇచ్చట పరిశీలింతము.

రాధేయుఁడు తన సేనాపతిత్వమున మకర వ్యూహమును సమ కట్టినాఁడు. అందు తుండమున తాను నిలిచెను. నయనంబుల – శకుని, ఉలూకుఁడు నిలిచిరి.

శిరమున – అశ్వత్థామ, కంఠంబున దుర్యోధనానుజులు ఉద రంబున దుర్యోధనుఁడు నిలిచిరి.

కర్ణునకు సాటిగా పౌరుషముతో దీటుగా పోరవలయునని అర్జునుని రోషమును తట్టి లేపుచున్నాఁడు. శ్రీ కృష్ణుఁడు. "అర్జునా! చతు గృహ దాహమునకు, కపట ద్యూతమునకు సమస్త దుర్నయములకు ఈ కర్ణుఁడే మూలము. ఈ పాపాత్ముఁడే సభలో ద్రౌపదిని "నీకిచ్చట మగలు లేరని, నీపై కూరిమిగల మఱొక్కని వెదకి కొనుమ"ని పలికినవాఁడు.

నేను సంధికి పోయినపుడు – నన్ను పట్టింప ప్రయత్నించిన వాఁడితఁడే కదా! మీ యాపదల కన్నింటికి నితఁడే కారకుఁడు అని పూర్వమతఁడు గావించిన దుష్కృత్యముల పేరుపేరున స్మరింపఁజేసి పురికొల్పినాఁడు.

అంతరంగమునందలి ద్వేషాగ్నిని రగులు కొలిపినాఁడు. పౌరు షమును, అహంకారమును తట్టి లేపినాఁడు. అట్లు ప్రతాపమును రెచ్చగొట్టినప్పుఁడు–శత్రువును, శత్రుపరివారమును ప్రాణములత్యజించి ఎదుర్కొనఁగలఁడు.

అంతటితో ఆగలేదు. "సుభద్ర పట్టిని బలువంచనచే డాసి బలువింటిని త్రుంచినపుఁడే కదా – అందఱునుచేరి యాతనిని వధించి నది" అని పుత్ర మరణమునకు మూలకారకునిగా ఎత్తి చూపినాఁడు.

"అట్టి వానిని గ్రద్ద గమి కాళ్ళతో చుంద మనము చూడవలదా" యని పగను రెచ్చకొట్టుచున్నాఁడు.

"వాఁడుపడిన తక్కిన రాజులు, కౌరవులు నీకొక లెక్కకాద"ని శోకము త్యజించి లోకము నుతించునట్లు సుఖివి కమ"ని యాశీర్వ దించినాఁడు. ఇందులకు తోడు ధర్మజుని పరుషవాక్కులు అగ్నిపై ఆజ్యము పోసినట్లయినది.

ధర్మజుఁడు – కర్ణుని ధాటి కాగ లేక రణ రంగమును వదలి వెడలి పోయినాఁడు. ధర్మజుని – యోగక్షేమమును కనుగొనుటకై యుద్ధము జరుగుచుండఁగా – అర్జునుఁడు ధర్మజుని కడకేఁగినాఁడు. అప్పుఁడు అతఁడు—

"విను! కర్ణునకు ఏ నోడితి ననుట ఎందులకు! నీవును ఓడితివి. అనిలజ మాద్రీ తనయులును ఓడిరి మనతోఁగూడి కృష్ణుఁడును ఓడెను. నీ తెఱఁగు ఇట్టిదని తెలిసియుండిన రణ నిష్ఠకు పూనువాఁడనే కాను కదా! ద్వైత వనమునందు సముదగ్ర భుజ బల దుర్జయుని. రాథేయుని – యుద్ధమున ఎదుర్కొనఁజాలనని ముందే తెలిపియుండిన నేనెట్లీ మార్గమునకు వత్తును? అశక్తుఁడు మహిని వాంఛించునా!" అని యర్జునుని కొట్టవలసిన చోటనే కొట్టినాఁడు.

ఇంత కంటెను దారుణముగా వాగ్బాణములతో తూలనాడినాఁడు.

58 ప. తే. అనివధించెదఁ గర్ణునేనని ప్రతిజ్ఞ

సేసి యిటు దెచ్చి నన్నిట్లు సేసి తింత

కెట్లు నేర్చితి పాడవుగా నెత్తి నేల

దైవ నేర్చితి ననుఁ బగవారి నడుమ" అని ఘోరముగా తూలనాడినాఁడు.

అట్లగ్రజుని వాగ్బాణములకు శ్రీ కృష్ణుని ప్రేరణతోడై అర్జునుని క్రోధము జ్వలించినది. విజృంభించి యుద్ధమొనర్చినాఁడు. కర్ణునకు గల శాపము ఇందులకు తోడైనది, విధి వంచితుఁడు. శాపగ్రస్తుఁడు నేలకొరిగినాఁడు కర్ణుఁడు. కురుపతి ఆశాగగనమున వెలిగి పొవు చుండిన ధ్రువతార నేలకొరిగినది. అర్జునుని జయలక్ష్మి విజయ మాలచే అలంకరించినది. కర్ణుని పర్వము ముగిసినది.

శల్య పర్వము :— శతానీకులు, పార్వతేయులు వీర మరణము నొందిరి. సంశప్తకులు, కాంభోజ శతానీకములు తెగటారినవి యవన, పార్వతేయ మ్లేచ్ఛ బలములు త్రుంగినవి. నలుదిక్కుల మన్నీలు మడసిరి. నరనాయకులు సచ్చిరి. అప్పుఁడు కృపాచార్యుడు దుర్యోధనునితో— "అజాత శత్రునితో సమంచితముగ సంధిచేయుట తగును" అని పలికెను.

"నిష్కారణ వైర్యముతో సమరమును సలిపితివి. కోపము విడువుము. దీర్ఘక్రోధుఁడగు పతికీడు పొందును. తమ బలము అధిక మైనపుఁడు యుద్ధము చేయఁదగును కాని శత్రు బలమెక్కుఁడైనపుఁడు సంధియే కర్తవ్యమని అర్యులు పలుకుదురనినాఁడు

అప్పుఁడు దుర్యోధనుఁడు కృపాచార్యునితో పలికిన పలుకులు— "సమస్త భూమండలము నందలి రాజులు భక్తితో కొలుచు చుండ ధరావలయము నేలు రారాజును నేను, దర్పముతోనేలుచు అనురక్తుల బ్రోచుచు, శత్రుకోటిని నిర్వీర్య మొనర్చుచు అతి ప్రమోదమున నున్న నాకు – ఈ పరిస్థితిలో యుద్ధమే శరణ్యము. కాని ఒకని దయతో లభించిన రాజ్యము. వలద"నినాఁడు.

ఆనాఁడు సురనదీ సూనుఁడు లేఁడు. అస్త్రగురుఁడస్తంగతుఁడై నాఁడు. కర్ణుఁడు వీర స్వర్గము నలంకరించినాడు. పరాక్రమ మహనీయులెందరో మడసిరి. దుశ్శాసనుని చీల్చి వృకోదరుఁడు రక్తము త్రాగినాఁడు. దుర్యోధనుఁడు మాత్రము మిగిలినాఁడు.

అయినను సంధికంగీకరింపలేదు. వీర మరణమునే కాంక్షించెను కాని సంధితో లభించిన దయాభిక్ష నంగీకరింప లేదు.

అట్టి పరిస్థితిలో సేనాధిపతియైనవాఁడు – ధీరుఁడైయుండవలెను. వెరవుతో నిర్వహించవలె. విక్రమ సంపద నతిశయించి యుండవలె. ఒడ్డున మేర్చి పురికొల్పఁగలవాఁడై యుండవలె. తాను మొనతల తిరుగాడవలె. అట్టి ధీరుని సేనాధిపత్యమునకు పేర్కొనుమని అశ్వత్థామ నడిగినాఁడు – "శల్యుఁడే అంతటి మహిమోపేతుఁడు" అని అతనినే రథినీపతిత్వమున కభిషేక మొనర్పుమని తెలిపినాఁడు అశ్వత్థామ.

శల్యుఁడు పాండవుల మేనమామ. వారినికాదని దుర్యోధనుని చేరినవాఁడు చేరవలసి వచ్చినది కనుక చేరినాఁడు. మనసుమాత్రము పాండవుల పక్షమునందే యున్నది. అయినను–దుర్యోధనుని ప్రార్థనపై సేనాపతిగా నభిషిక్తుఁడైనాఁడు.

"గంగా నందనుని పోటును మెచ్చునట్టుగా, గురునికాదని, రాధా తనూజిని కీడాడునట్లు యుద్ధమొనర్చు వాఁడితఁడెవ్వడో యనునట్లు – "ఇట్టి కయ్యమును మున్నెన్నడును కానమ"ను నట్లు – వేయిభంగుల చూపఱులు కీర్తించునట్లుగా – నా ధనుః కళా నిపుణతను చూపెదన"ని విశ్వసింపఁజేసినాఁడు.

ఇది సేనాధిపతి కర్తవ్య పరాయణత మమతను ఛేదించుకొని యుద్ధమొనర్చు తీరు. శత్రుపక్షము నందలి వారెవ్వరో కాదు– సోదరీ పుత్రులు పాత్రులు. అయినను పరిస్థితి ప్రాబల్యమున కౌరవ పక్షమున చెరవలసి వచ్చినది.

కర్ణుని సారథ్యము గావించినపుఁడు – అతనిని నిరుత్సాహపఱచి పాండవుల కొసఁగిన వాగ్దానమును పూర్తిగావించుకొనినాఁడు.

ఇప్పుఁడు తానే సేనాపతిగా కర్తవ్యమును నిర్వహింపవలసి వచ్చి నప్పుఁడు – కర్తవ్య మార్గమునుండి విముఖుఁడు కాలేదు. సోదరి

తనయులపై బాణముల వేయుచుంటినని వెనుకాడలేదు. తన్ను నమ్మిన రాజును వంచింపని సైన్యాధిపత్యమది! మాటకు కట్టుబడి – మమతా బంధమును ఛేదించి యుద్ధమునకు సన్నద్ధుఁడై కర్తవ్యమును నెరవేర్చిన సన్నివేశమది!

అచ్చట పాండవులును – శల్యుని సేనాధిపత్యమును వేగుల వలన విన్నారు. బలా బల నిర్ణయమునకై కృష్ణుని ప్రశ్నించినారు, అప్పుడు శ్రీ కృష్ణుఁడు–

శల్యుని శౌర్య ధైర్యము లత్యధికములని తెలిపెను, అతఁడు బాహు బలమున గాంగేయ, కర్ణ, కుంభజులను మీరు వాఁడని పలికినాఁడు. "కాదేని సముఁడు కావచ్చును. అంతియ కాని తక్కువ కాద"ని పలికినాఁడు.

అతఁడు విజృంభించినచో భీమార్జునులకును చేత కాదని తెలిపినాఁడు.

ధర్మజుఁడొక్కఁడే అతని నెదుర్కొనఁ జాలినవాఁడని తెలిపినాఁడు. "మేనమామ" యనుకృప దక్కి, రాజ ధర్మముననుసరించి విరోధి నామమునణఁప వలసినదని యాదేశించినాఁడు. యుద్ధము ప్రారంభ మయినది. మద్రపతి సర్వతో భద్ర వ్యూహమును పన్నినాఁడు. అందు ముఖమున మద్రపతి కర్ణ పుత్ర ప్రముఖ పరివృతుఁడై నిలిచినాఁడు.

త్రిగర్త సహితుఁడై కృతవర్మ దాఁపట – వెనుక కాంభోజ సహాయుఁడై యశ్వత్థామ – నడుమ కురవీర పరిరక్షితుఁడై – కౌరవేశ్వరుఁడు – అతని ముందు – బహుల చతురంగ బలముతో శకుని ఒక్కుమ్మడిగా విజృంభించిరి.

పాండవులంతకు ముందే – మూఁడు మొగంబులుగా మొహరించిరి శిఖండి, సాత్యకులు – అగ్రేసరులుగా భీమార్జునులు – అగ్రజుని అగ్రభాగమున శోభిల్లి సీతారూప శల్యుని కేతనమును సూచి త్రోచి నడచిరి.

ఇట్లు యుద్ధమున – మమతలు త్యజించి మనసొకచోట–మాటకు కట్టుబడి కర్తవ్యముపై మనసుంచి యుద్ధమొకచోట సేయుచుండిరి.

అక్కడ జరిగిన యుద్ధము తీరు –

"తెగిన తల యొక చేతను, నెత్తుట జొత్తిల్లిన కరవాల మొక చేతను పట్టుకొని, – యట్టులాడినట్లు పెనఁగువారు.

శ. 3-41

"రథంబులు గజంబులు తెగినఁగాని కాలు బలముల సమయించుట పనిగాదని, యందుల కుపక్రమించు చుండువారు–

గజములను పురికొలుపునపుడు —— అవి పై కురుకుచుండఁగా "తుండంబులవిసి, దంతంబుల దునిసి, కుంభంబులు పగిలి ప్రక్కలు చదిసి, వెన్నులు విఱిగి, ఆగజములు పాఱలుచు, నెత్తురులు గ్రక్కుచు-తెరలుచు సుడి వడుచుండ – పోరాడువారునైరి.

ఇట్లు శల్యుఁడు – మాటకు కట్టుఁబడి బంధుపక్షమును వదలి శత్రుపక్షమునచేరి యుద్ధమొనర్చిన సేనాధిపతిగా నిలిచిపోయినాఁడు.

మిత్రులకు, బంధువులకు మాట ఇచ్చిన ప్రకారము కర్ణునకు సారథియై యుద్ధమున నిరుత్సాహపఱచి కార్యము సాధించినాఁడు! సారథ్యమున – శాశ్వతముగా భారత సాహిత్యమున – నిలిచిపోయిన పేరుగలవాఁడైనాఁడు.

ఈ "శల్య సారథ్యము" భారత ప్రజల నాలుకలలో నిత్య జీవిత సంఘటనలో శాశ్వతముగా నిలిచిపోయినది.

❀❀❀❀❀❀❀❀❀

సౌప్తిక పర్వమున :—

న సుప్తం నవిసన్నాహం ననగ్నం ననిరాయుధం
నాయుధ్యమానం పశ్యంతం న పరేణ సమాగతం.

మనుస్మృతి—7, 30 92 శ్లో॥

నిద్రించిన వానిని, సంసిద్ధుఁడు కాని వానిని, నగ్నుని నిరాయుధుని యుద్ధము చేయని వానిని, ఇతరునితో యుద్ధము చేయువానిని, చంపరాద"ని మనుస్మృతి.

కాని ఈ సౌప్తిక పర్వమున అశ్వత్థామ గావించిన అధర్మ యుద్ధము – నిద్రాసక్తులైన పసిబాలుర చంపిన గాథ – ప్రతి పాఠకుని చలింపఁజేయునట్టిది.

శాంతుఁడు కాని విప్రుఁడు – ఇతరులను చెఱిపి తానును చెడునని – తెలియఁజేయుచున్నది.

"భాగ్యహీనత వలన రాజోచిత ధర్మమువనుష్ఠించితిన"ని అశ్వత్థామ తానే తెలుపుకొనుచున్నాఁడు.

"మా జనకుని చంపి శంతుష్టులైన ధృష్టద్యుమ్నుఁడు మొదలగు పాపాత్ముల పాప మార్గమునందే రూపు మాపుదును. దీనంజేసి కీట జన్మము ప్రాప్తించినను లెక్కింపన"ని సివమెత్తి దుస్సాహసము చేసినాఁడు. యుద్ధ ధర్మమునకు విరుద్ధముగ నిదురించు వారిని చంపినాఁడు.

దుర్యోధన ప్రేరితుఁడగు అశ్వత్థామ – ఉలూక చర్యా దర్శనముచే శత్రువధోపాయమును నిశ్చయించినాఁడు.

ఈశ్వర దత్త ఖడ్గముతో పాండవ శిబిరమును ప్రవేశించినాఁడు. యుద్ధ ధర్మమునకు విరుద్ధముగ నిద్రాపరవశుఁలైన ధృష్ట ద్యుమ్నాది ద్రౌపదీ సోదరులను, పుత్రులగు ఉప పాండవులను తక్కిన రాజులను పశువుల నఱికినట్లుగ నఱికినాఁడు.

బాల ఘాతుకుఁడైనాఁడు. యుద్ధ ధర్మము నతిక్రమించినాఁడు. పాప భాజనుఁడైనాఁడు. పాండవులు దూరము నందుండుటచే నీ యకాల మృత్యువు వాతపడలేదు అశ్వత్థామ తాను చేసిన ఘన కార్యములను మరణావస్థలోనున్న దుర్యోధనుని చెవిని పడవేసి పాండవ భీతుఁడై పలాయితుఁడైనాఁడు.

కుమారుల మరణముతో మండి పడిన పాండవులు అశ్వత్థామను కనుగొనిరి అశ్వత్థామ అపాండవమగునట్లు ఇషీకమున బ్రహ్మ శిరో నామకాస్త్రము నభిమంత్రించి విడిచెను. అర్జునుఁడు ఆ అస్త్రమునే కృష్ణుని యుపదేశముచే ప్రత్యస్త్రముగా ప్రయోగించెను.

అగ్నిజ్వాలా భీలములై లోకోపద్రవము సేయుచున్న యయ్యస్త్రముల నుపసంహరింపుఁడని – వ్యాస నారదులయ్యిరువురనుఁ గోరిరి. గురు భక్తుఁడగు అర్జునుఁడుపసంహరించెను.

కాని – అశ్వత్థామ ఉప సంహరింపలేదు.

అశ్వత్థామ నిదురబోవు పాండవులను చంపుటకు సమర్థించుకొనిన శాస్త్రము–

"పగతురను చంపునపుఁడు అన్యాయమని తలంపరాదు. ఎయ్యది దొరకొనిన దాన నుత్సహింపవలయును. అది శాస్త్ర సిద్దము" అది... ఎట్లనిన

"ఎత్తి నప్పుఁడు విడియుచో నిఱకటంపుఁ
దెరువునందు నడపుసెడి తిరుగఁబడిన
యట్టి యెడ నిద్రవోయెడు నవసరమున
శత్రువులఁబెట్టు పైఁ బడి చంపవలయు" అని

సమర్థించు కొనినాఁడు. దీనికి మూలము–

భార. సౌప్తి 1-25 ప

"ప్రస్థానే ప్రవేశేచ ప్రహర్తవ్యం రిపోర్బలం
నిద్రార్తం అర్ధరాత్రేచ తథానష్ట ప్రణాయకం"

భా. 10-1-51

అను నీతి వాక్యములు కలదు. అంగీకృత ధర్ముఁడగు వానికిట్టివి కర్తవ్యములు. అని సమర్థన.

అశ్వత్థామ ఒకవైపు "శాంతుఁడు గాని విప్రుఁడు, తేజస్విగాని రాజును" నిందింపఁబడుదురని–తన యుద్రేకము శాంతి ప్రధానమగు బ్రాహ్మణత్వమునకు విరుద్ధమని – దోషమని భావించుచున్నాఁడు.

"జన సంపూజితమగు వంశమున జనియించి, భాగ్యహీనత వలన రాజోచిత ధర్మమిననుష్ఠించితిని... నడుమ నానిష్ఠను వదలి మహ నీయమగు విప్రధర్మము నాచరించుట నామదికిఁజూడ మేలుగాదని" తాను శాంతిని వహించుటయు తగదని విమర్శించుకొనుచున్నాఁడు.

"దివ్యాస్త్ర కోటిని ధరించి అజిలో మెఱయు తండ్రిని ఒకఁడు వధించెనే! వాఁడు రూపుతో నుండవలెనా! నేనెట్లు తలయెత్తి మెలఁగు దును" అని అంతరంగ విప్లవమునకు లోనఁగుచున్నాఁడు. ఏమఱిన శత్రువుల – దాడిగఁబోయి బెట్టుముట్టేద, శరజాలములచే సత్వరముగ పలువుర చంపుదును. కొందఱ చదుపుదును. పరిఘాహననముచే కొన్ని కంఠముల చిదుముదును, గెలుపొంది ఆద మఱచి నిదురవోవు ఆ బిరుదు మగల పీనుఁగు పెంట గావింపవలెను" అని నిశ్చయించినాఁడు.

"కరి హయ, నర శవముల భగ్న రథంబుల మధ్య ద్రుపద నందనుని గాత్రము పడియుండ చూతునిదే నా పరిభవ పరితాపముప శాంతి వడయ" దని క్రూర కృత్యమునకు నిర్ణయించినాఁడు

ఇట్లు బ్రాహ్మణ, క్షత్రియ స్వభావములు, ధర్మములలో దేనిని అనుసరింప నలెనను – అంతర్యుద్ధమునకులోనై కడకు క్షత్రియ –

ధర్మమును, అందును క్రూర మార్గమున అనుసరించుటకై నిర్ణయించినాఁడు.

కృపాచార్యుఁడు – నిద్రించిన వానిని, ఆయుధములు విడిచిన వానిని, వాహన వైకల్యము నొందిన వానిని – శరణు సొచ్చిన వానిని తలవీడిన వానిని చంపుట ధర్మము గాదని వారించినాఁడు.

అప్పుఁడశ్వత్థామ పలికిన పలుకులు :–

"సమస్త రాజన్యులు చూచుచుండ అస్త్ర సన్న్యాసము గావించిన మజ్జనకుని, పాపమని యైన ఎంచక ధృష్ట ద్యుమ్నుఁడు చంపలేదా! శిఖండి పేరిట కృత్రిమ సమరమున అర్జునుఁడు భీష్ముని చంపలేదా!

రథముర్విని క్రుంగి యనువు దప్పినపుఁడు, నరుఁడు కర్ణుని వేయు లేదా!

పలువురు గూడి కౌరవ నృపాలుని ఒక్కరుని చుట్టుముట్టిరి. విచ్చలవిడిగా పాప కర్మమని శంకలేక – గదతో ఊరువులు నుగ్గుసేయ మరుత్సుతుని ప్రేరేపించిరి. వారు గావించిన అన్యాయమునకు నేనును ప్రతీకారము గావింతునని నిద్రాసక్తుల దయలేక చంపినాఁడు.

ఇట్లు – అశ్వత్థామ పాత్ర క్రూర కర్మమును శంకలేక గావించి–ప్రతి ఫలము ననుభవించిన పాత్ర.

యుద్ధ వైవిధ్యములో గదా యుద్ధమొకటి :

ఇది ద్వంద్వ యుద్ధ భేదము లందొకటి! గదా యుద్ధమున – వల పలించి చుట్టుకొందురు. దాపలించి తిరుగుదురు. ప్రక్క ఎముకలను అగల వ్రేయుట గలదు. శిరస్తాడనములు గావించుట, ఉరముపై లాఘవముతో ఘోరముగా గదాదండమును త్రిప్పివైచుటలు- గదా యుద్ధము నందలివే!

దారుణ ప్రహారమున – ఫాల కర్ణ ప్రదేశమును పగుల్చుట – పార్శ్వ భాగముల నణచుట – వక్షః స్థలమును వేయుట – గదా యుద్ధ ప్రహారములు.

"మాయలు గల పగవారిని మాయా మంత్ర ప్రకారములచే పరి మార్చుట తగున"ని నాభికి దిగువయైన శరీర భాగమును గదా యుద్ధ ధర్మమునకు విరుద్ధముగ తొడలపైఁగొట్టి భీముడు దుర్యోధనుని చంపి నాఁడు. బలరాముఁడిట్టి అధర్మ యుద్ధమునకు కోపించెను.

అప్పుఁడు శ్రీ కృష్ణుఁడను నయించి "రాజులకు ప్రతిజ్ఞ నెఱపుట పరమ ధర్మము. ఈ భీముఁడు సుయోధనుని తొడలు భగ్నము సేయువాఁడనని సభయందు ప్రతిన గావించినవాఁడు మైత్రేయుని శాపము గూడ ఫలింప వలసి యున్నది. కనుక దోషము లేద"ని నవరించినాఁడు.

"అదియునుఁగాక – నిలిచి మార్కొన్నప్పుఁడు నడచునపుఁడును కాదు. పాడవుగా ఎగిరి పైకుఱికినపుఁడు–తన్ను గాచి కొనుట ధర్మము. ప్రతిన నెఱపుటయును ధర్మము. అది కారణముగా – నాభికి దిగువ కొట్టినాఁడు" అని సమర్థించినాఁడు.

పుట్టిన నాటి నుండియు కపటంబున అపకారములు సేయు చున్న వీనిని – కపట ప్రకారమున పడవైచుట – ధర్మహానియై తోపద"ని పలికినాఁడు.

సుభద్రా నందనుని తెగటార్చిన తెఱం గెఱుంగమా అని స్మరింపఁ జేసినాఁడు. ఇట్లు అధర్మ యుద్ధములు జరిగినపుఁడు ప్రజలకు వివ రించి చెప్పుట – సమర్థించు కొనుట – జరిగెడివి,

భీముఁడు గావించిన గదా సమరము ధర్మ విరోధమని లాతి రాజులు మనముల తలంతురని శంకించినాఁడు శ్రీ కృష్ణుఁడు.

"ఈ దురాత్మకుఁడు సతినట్లు పరిభవించె. అయినను తండ్రిపాల గిరి. అతఁడొసంగలేదు. ఈ యుక్కివుఁడిట్టి చావునకు తగును" అని ంతటి దుష్ప్రవర్తనుని అట్లు చంపుట అన్యాయము కాదని సరిదిద్దు 'నుచున్నాఁడు. శ్రీకృష్ణుఁడు.

ుమ దుర్యోధనుల గదా యుద్ధవర్ణన :—

గదా ఘట్టనములు గావింతురు. పదతాడనము లొకసారి, ఒక ఓక్కన పూన్చి మఱొక దిక్కన వేయుట ఒకపరి గావింతురు. మేను ంచించి వ్రేటుల దప్పించు కొందురు. వలపలించి చుట్టు కొందురు. వాపలించి తిరుగుట — వక్షస్థలమును వేయుట — ఫాల, కర్ణ మధ్య ప్రదేశమును పగుల్చుట — వీరి యుద్ధ వైవిధ్యము

శల్యుఁడు — గావించిన గదా యుద్ధము :—

ఒక్కొక్క యెడ గదా యుద్ధములందు మెడకెలంకుల వంటి ప్రదేశములందు ప్రవేశన ఘాతములకు మూర్ఛిల్లుచుండిరి. అట్టి యోధులను గుచ్చి యెత్తిసందడి తొలఁగ రథముపై గొనిపోయి సేద దేర్చు చుందురు

గదా యుద్ధమున — మూర్ఛితుఁడగు శల్యుని కృపాచార్యుఁడు గొనిపోవు తెఱంగిటు వంటిదే!

యుద్ధ వైవిధ్యములో మల్లయుద్ధ మొకటి ;—

భీమసేన జరాసంధులు మల్ల యుద్ధము గావించిరి. అన్యోన్యము- అకర్షణలు, సంకర్షణలు, అప కర్షణములు—సామర్థముతో పెనఁగుటలు

ఒండొరులు పట్టుట విడుచుట, తాఁచుట, త్రోఁచుటలతో పెనఁగిరి.

ఇట్లు ద్వంద్వ యుద్ధములు జరిగెడివి!

వ్యూహములు – సంకుల సమరములు – శస్త్రాస్త్ర వైవిధ్యములు ఆనాటి వీరుల–యుద్ధ కళా వైభవమును తెలుపుచున్నవి. సామమున మొదట ప్రయత్నించువారు. దానము నుపయోగించువారు, భేద నీతిని ప్రయోగించువారు. అప్పటికిని శత్రువు న్యాయ మార్గమున నడువకున్న – యుద్ధము నాశ్రయించువారు.

దండనీతిలో యుద్ధము కడపటి సాధనమునుగా నుపయోగించు కొనువారు!

కనుక దండనీతి – పేదలకు, సాధులకు, వేదములకు తగినది. తాపసులకు, సమస్తాదిత్యులకును – దండమే జీవితమును నిలుపునది భూసురులకు శమ దమాదులు ధర్మమైన రాజులకు – చిత దండ వృత్తిని, ప్రజలను రక్షించుటయే ధర్మము" ద్రౌపది శాంతి ప.

స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మోభయావహః
భగవద్గీత

రాజ్ఞః స్వధర్మః స్వర్గాయ ప్రజాధర్మేణ రక్షితుః
అరక్షితుర్వా క్షేప్తుర్వా మిథ్యా దండ మథ్యోన్యథా
కౌటిల్యుని అర్థ శ్లో 3–57 1అ.

"రాజ్యాంతే నరకం ధ్రువమ్"— అనునదొక నిర్ణయము, "రాజును పాలివాఁడ ఎవ్వరేమి చేసిన ఫలముల యెడన్నృపాల" అని ధృత రాష్ట్రుఁడు ధర్మజునితో ఆశ్రమ వాస పర్వమున తెలుపుచున్నాఁడు. స్వర్గారోహణ పర్వమున ఇంద్రుఁడు ధర్మజునితో–

క॥ విను మొక్కటి సెప్పెద రా
జను వానికి నెల్లఁ దప్ప దవనీశ్వర యె
ట్లును నారక స్థలంబుం
గనుఁగొన వలయు నది వేద కథితము సుమ్మీ

భార, స్వరా. 1-38 ప.

ఈ రాజ్య పాలన యొక కత్తిపై సాము వంటింది. ప్రజలను రంజింపఁజేయువలెను. దుష్టులను దండింపవలెను. శరణన్న వానిని ఘనతర శత్రువైనను కాపాడవలె. సంతత యజ్ఞ యాగాదుల ధన మార్జించి పాత్రులకు దానము చేయవలె. విషయములందనాసక్తుఁడై జీవింపవలె. ఈ కార్యములలో నెందో ఒకచోట రాజు తెలిసియో తెలియకయో ధర్మమున కొంత తప్పు వచ్చును.

అపరాధపు కొలదుల నెఱింగి దండించుట అతని విధి. ప్రభుత్వ యొక విస్తృత స్వరూపము. విశాలమగు పరిపాలనాంగము. రాజు చూచి – గుర్తించు చోటులుః కొన్ని. పరోక్షరూపమువ ప్రజల విషయ ములనెఱుంగుట కొంత. చార చక్షువుగా రాజ్య విషయముల సూచుట కొంత. రాజు సమస్తమును తానే తానై – సర్వత్ర తానే తానై ఈ విరాట్ స్వరూపమును దర్శింపలేఁడు. మానవ స్వభావము లోప భూయిష్ఠము. కనుక – ఏ రంగముననో – ఏ విభాగముననో – స్వార్థ పూరితుఁడు – దురాశాసక్తుఁడు – ఇంద్రియలోలుఁడునగు కార్య కర్త దోషము గావించుచునేయుండును. ప్రజలు గావించిన పాప, పుణ్య ములయెడ చతుర్థాంశమును రాజు పొందునని శాస్త్రములు ఘోషించు చున్నవి. కమక – రాజ్యాంతమున నరకమును పొందుననుట నిశ్చయము.

దండమును ధరించి రాజు–తండ్రి తల్లి, సోదరుఁడు మిత్రుఁడు నను పక్షపాతము విడిచి కుమారునైనను దండవిధికి పాత్రుని గావింప వలసినదే – అతఁడు దోషిగా నిర్ణయింపఁ బడినపుఁడు! కనుక అట్టి సందర్భములందును – మమతకు – బాంధవ్యమునకు – ధర్మముతో ఘర్షణ జరిగి మమత మొగ్గుచూపి – సరియగు దండన విధించుటలో విమార్గమును చూపవచ్చును. అప్పుడును రాజధర్మమును విస్మరించిన దోషము వచ్చును.

రెండు ధర్మములకు ఘర్షణ కలుగు సన్నివేశము జీవితమున సంభవింపవచ్చును. రెండు ధర్మములలో నేది బలవత్తరము –

ముఖ్యము అని యెన్నుకొనుటలో దోషమాచరించి రాజు పాపభాజనుఁడు కావచ్చును

ధర్మజుఁడజాత శత్రువు. జీవితమున ధర్మమునకై తన మనో వాక్కాయముల నర్పించినవాఁడు. అట్టి వానికిని – జీవితమున పలు చోట్ల విషమ స్థితు లెదురైనవి.

ధర్మజుఁడు జూదమున నేర్పరి. శకుని మాయా జూదమున నేర్పరి. శకుని యండగొని – దుర్యోధనాదులు ధర్మజుని జూద మాడుటకు రమ్మని పిలిచిరి. అచ్చట మానసిక ఘర్షణ కెదురైనాఁడు- "జూదమాడుట చక్కఁగా తెలిసియు, పిలిచినపుఁడు పోకుండుట తప్పు" జూదమాడుట సప్తవ్యసనములలో నొకటి. అతిగా శృతిమించిన- అది దుర్వ్యసనమై దోషముగా పరిణమించును. ఒక్కసారి–అహూతుఁ డైనపుడు – వ్యసనముగా మాఱకుండుట అసంభవము కనుక – ఆడుట అధర్మము. ఆడకుండుట అధర్మము. ఈ ద్వివిధ భావము లలో – ఆడుటకే నిశ్చయించినాఁడు. సమస్త సంపదలను కోల్పోయి నాఁడు. రాజ్యమును – సోదరులను కోల్పోయినాఁడు కడకు తన్ను తానొడ్డి – ఓడినాఁడు. ద్రౌపదినికూడా ఒడ్డి – ఓడినాఁడు. సభ యందు – ద్రౌపదీకి సంభవించిన ఘోరపరాభవమునకు మూల కార ణము – ఇతని ఓటమి. తన్ను భక్తితో కొలుచు తమ్ములు – ప్రతాప విభవయుతులు – దుర్యోధనునకు దాసులగుటకు కారణము – ఇతని ఓటమి. ఇంతటి దుఃఖములకు వారిని పాలుచేసి ధర్మజుఁడు తానును విభవ శూన్యుఁడైనాఁడు. శకుని మాయా జూదమునకు రాఁజాలనని పలుకలేని స్థితి – అతనిని అతని బంధువులను ఈ స్థితికి తెప్పించినది. ఇందు మానసిక ఘర్షణచే ధర్మమేవైపు మొగ్గు చూపునో? కనుక రాజైనవానికి రాజ్యాంతమున నరకము, సంఘర్షణలలో తప్పదు.

తన రాజ్యమును – ప్రజలను సన్మార్గమున నడిపింప గలిగినట్టివాఁడు రాజు. దండమును ధరించి ప్రజల నడపింపవలసిన మార్గదర్శి. అట్టిరాజే ఉన్మార్గగామియైనపుఁడు పాప భాజనుఁడగును. సామాన్యుఁడొనర్చినట్టి యపరాధమును రాజైన వాఁడొనరించినచో – సామాన్యుని కంటెను వేయిరెట్లధికముగ రాజు శిక్షనను భవించునని శాస్త్రములు ఘోషించుచున్నవి. కనుక రాజు మిక్కిలి వివేకముతో – విచక్షణ గలిగి ధర్మమును నడుపవలసియున్నది.

నారదుఁడు ధర్మజునితో పలికిన పలుకులు రాజదోషములను వివరముగా తెలుపుచున్నది

రాజు నాస్తికుఁడు కారాదు. అనృతమాడరాదు. ప్రమాదము అలస్యము – అనర్థుల తోసి చింతనము రాజునకు నిషిద్ధము. క్రోధము దీర్ఘసూత్రత–దీర్ఘ చింత రాజునకు తగదు. ఎఱుకగలవారి నెఱుంగమి-రాజదోషము. నిశ్చిత కార్యముల చేయకుండుట రాజునకు తగదు. మంత్రముల రక్షింపకుండుట అతని అయోగ్యత. శుభముల ప్రయోగింపమి అతని–తప్పు. విషయములందు తగులుట రాజలక్షణమునకు చెల్లదు.

రాజింపేదోషము కలిగి యున్నను దోష భాజనుఁడగును,

ధర్మజుఁడు – దూత్యమును వ్యసనముగా ఆడవలసి వచ్చినది. అందువలన ద్రౌపదీ పరాభవము – భీముని ప్రతిజ్ఞ ఉత్తరోత్తరము విస్తరించుచు – కడకు యుద్ధము వఱకు దారితీసినది. సంధికై ప్రయత్నించినను దుర్యోధనుఁడు సూదిమొన మోపినంత రాజ్యాంశము నైనను ఇయ్యననినాఁడు.

యుద్ధము తప్పలేదు. సంగరము రాజులకు ధర్మము. కనుక ధర్మజాదులును సంసిద్ధమైరి. శత్రు పక్షమున నిలిచినవారు – కురు పితామహుఁడు భీష్ముఁడు. అస్త్రగురువు ద్రోణాచార్యుఁడు – దాయా

దులు – బంధు బాంధవులు, సంగ్రామమున ఎందరో మరణించిరి. ఆ యుద్ధమున ఎందరో నిరపరాధులు మరణించిరి. గౌరవనీయులు– మన్ననల పొందదగినవారు – గురువులు – గురుతుల్యులు–హతులైరి. ధర్మజునకు విజయము లభించినను ఆత్మశాంతి లభింపలేదు. ఆతని అంతరాత్మ నిర్వేదము పొందినది తాను గావించిన కార్యమునకు పశ్చాత్తప్తుఁడైనాఁడు.

"బాల్యమునుండియు నుత్సంగమున ఉపలాలించిన వంశశేఖరుని– జరఠసింహుని మరణమునకు కారకుఁడనైతినే" యని దుఃఖించినాఁడు.

"ఈ భీభత్సుని భల్లములు చక్కఁగా శరీరమున నాటినపుడు శిఖండిని చూచుచు బాణముల వేయక నిలిచిపోయినాఁడు. ఆ దృశ్యమును చూచుచుంటినే?" యని వెత చెందినాఁడు

"ఆచార్యుఁడు – జన సంపూజ్యపదార విందుఁడు – ద్రోణుఁడు నన్ను పెద్దగా నమ్మి ఏకైక పుత్రుని విషయము నడిగినాఁడు. చావని వానిని – అశ్వత్థామను – చచ్చెనని బొంకితిని. ఇట్టి గురుద్రోహికి మేదినీభరణము తగునా? యని గురుద్రోహియైతినని వాపోయినాఁడు.

భ్రాతను కర్ణుని చంపించిన భ్రాతృద్రోహిన"ని విలపించినాఁడు. బిరుదు మానిసి యగు ద్రోణుఁడొడ్డిన పద్మవ్యూహమున క్రూరుఁడనై బాలుని – అభిమన్యుని త్రోసితిని – బాల ఘాతుకుఁడనైతి, "ఇట్టి వాని కుర్వీ భరణము తగునా" యని ప్రశ్నించినాఁడు. ఇది పరితాపము. పశ్చాత్తాపము. నిర్వేదము. కనుక భిక్షాన్నముతో జీవితము గడుపుదు ననినాఁడు. ప్రాయోపవేశముతో జీవితమును త్యజింతుననినాఁడు. అతఁడు పొందిన నిర్వేదమును బాపి – శాంతచిత్తుని గావించుటకు పాండవులందఱు పాటు పడిరి. అతఁడు గావించినది ధర్మయుద్ధమే యని నిరూపించిరి నారదాది మునులు శాంతింపఁజేసిరి. శ్రీకృష్ణుఁడు నీతి గఱపినాఁడు. భీష్ముఁడు శరతల్పగతుఁడయ్యు – ఉదాహరణము

లతో పూర్వరాజుల చరితమును తెలిపి – వారు పాప భాజనులుకాలేదని పలికినాఁడు. సంగ్రామము రాజుల ధర్మమని తెలిపెను. సమగ్ర రాజనీతిని బోధించెను. వ్యాసుఁడును అతని మానసము నావరించిన నిర్వేదమును బాపుటకు ప్రయత్నించెను.

రాజైనవానికి అడుగడుగున తీసికొనవలసిన జాగ్రత్తలనంతములు. అతఁడు రాజనీతికి కట్టుబడి కొన్ని పనులు గావించును. పరుషముగ ప్రవర్తించును. కడకు అతని యాత్మ ఒకప్పుఁడు ఘోషించును. ధర్మజుఁడు అజాత శత్రువు. యుద్ధ విముఖుఁడు. అయినను తమ రాజ్యాంశమునకై యతనికి యుద్ధము చేయక తప్పినదికాదు. యుద్ధమున స్వపర వివక్ష యుండదు కనుక బంధు భాంధవులు మరణించిరి యుద్ధానంతరము ధర్మజుఁడు విలపించిన విధానము గనుఁడు–

"బాల్యమున తొడలపై నిడుకొని నన్ను పలాలించినవాఁడు కురు పితామహుఁడు. అట్టి భీష్ముని శరీరమున బీభత్సుని శరములు చక్కఁగా నాటినవి. అతఁడు శిఖండిని చూచుచు బాణములు వేయక ఉండిపోయినాఁడు. ఆ దృశ్యమును కనులార గాంచితినే!

పరశురామునెదుర్కొనిన బల్లిదుఁడు – కాశిరాజ కన్యకలకొఱకు పుడమినెల్ల గెలిచిన బిరుదుమగఁడు. అతఁడాఱడిపడుట తలచుకొన్న దుఃఖము కలుగుచున్నది.

ఈ రాజ్యమల్పకాల భోగ్యము – దీనికై అనల్ప కీర్తిఘనుని – పురుషసింహ కల్పుని – వంశ శేఖరుని త్రుంచితినే!

ఇఁక ఆచార్యుఁడు! జన సంపూజ్యపదార విందుఁడు. పెద్దగా నను నమ్మి – నా సత్య నియమమును విశ్వసించి నందనుని విధము నడిగినాఁడు. చావని వానిని చచ్చిన కుంజరమును మననునందుంచు కొని – యశ్వత్థామ చచ్చెనని బొంకితినే! ఇట్టి గురుద్రోహిని నేను. నాకు

మేదినీ భరణము తగునా? రాజ్యలాభమునకై లోభముతో బొంకులాడి తిని గురుద్రోహినైతిని.

భ్రాతను — కర్ణుని చంపించి యవనీ రాజ్యమేల నిచ్ఛగించు క్రూరుఁడను నాకీ రాజ్యము సుఖము నొసంగఁగలదా? బిరుదు మగఁడగు కుంభజుఁడొడ్డిన వ్యూహమున క్రూరుఁడనై కొడుకును, అభిమన్యుని ద్రోచితినే. ఇట్టివాఁడుర్వి యేల నర్హుడా?" అని విలపించి నాఁడు.

రాజగు వానికి జీవితము కత్తిమీఁద సాము వంటిది. యుద్ధము చేయునవసరము వచ్చినపుఁడు చేయక తప్పదు. శత్రువులే లేని వాఁడు — పదునెనిమిది అక్షౌహిణులు గల కురుక్షేత్ర యుద్ధమును గావించినాఁడు. బంధువులు. ఆచార్యుఁడు వంశ వృద్ధుఁడు సమర రంగమున పడి పోయిరి. కనుకనే యుధిష్ఠిరుఁడు పశ్చాత్తప్తుడైనాఁడు. ప్రాయోప వేశమున శరీరము త్యజించు తలంపు గలుగు చున్నదని వాపోవుచున్నాఁడు అతని దుఃఖమును — మనోవేదనను పోగొట్టుటకై పాండవులు — కృష్ణద్వైపాయనుఁడు పలువిధములగు దుఃఖోప శమనార్థములగు నీతులఁజెప్పిరి.

కృష్ణుఁడు షోడశ రాజుల చరిత్ర వివరించెను యుద్ధము వలన పాపము సంభవించినదని తలంచితివేని — ప్రాయశ్చిత్త మాచరించి పాపములు పోఁగొట్టు కొనుమని యాదేశ మిచ్చెను.

"చచ్చిన నరపతులేలిన జనపదములందు వారి వారి పుత్రులనే రాజులుగా ప్రతిష్ఠింపుమ"ని బోధించినాఁడు.

"కొడుకు లేనిచోట కూతుఁ బ్రతిష్ఠింపుమ"ని తెలిపినాఁడు.

"వలయునేని యశ్వమేధ యాగము నొనరింపుమ"ని నాఁడు. అప్పుఁడు కృష్ణద్వైపాయనుఁడు - కర్మలు - వానికి ప్రాయశ్చిత్తములు- వానిని గురించి తెలిపినాఁడు.

"క॥ దురమునఁ గైదువుఁగొని తను
బొరిగొన నేతెంచు నట్టి పురుషుని వేదాం
త రహస్య వేది నయినను
బొరి గొనినను గెల్బిషంబు వొందదు వత్సా"

భార. శాంతి 1. 295

అని యుద్ధమున కైదువుగొని వచ్చినచో వేద వేదాంగ వేదినైనను చంపవచ్చును. పాపము సంభవింపదని నాఁడు. ప్రాయశ్చిత్త విశేషములను తెలిపినాఁడు "భీష్ముఁడు మరణ శయ్యపైనున్నవాఁడు! అతని తోడను ధర్మ విశేషముల తెలిసి కొనుమనినాఁడు.

ఇట్లు పలువురు–

కిల్బిష నివారణోపాయములను తెలిపిరి. అశ్వమేధాది యజ్ఞములచే పాపము వాయునని బోధించిరి అయినను కడకు - రాజ్య పాలనాంతరము - పాండవులు కొంత కాలము నరకము ననుభవించిరి. ధర్మజుఁడింద్రునితో పాటు నరకమును సందర్శించి వచ్చెను.

ఇట్లీ భారతము – రాజులెంత జాగరూకులై రాజ్యభారము నిర్వ హింపవలెనో బోధించుచున్నది.

"రాజ్య నిర్వహణ"మనునదొక మహత్తర కార్యభారమని తెలుపు చున్నది. కేవలము – అధికారమునకు – భోగముల నుభవించుటకు "రాజ్యాధికారము" కాదని తెలుపుచున్నది. ప్రభుత్వము నెఱపు వాఁడు – తానింతటి పదవియందున్న వాఁడను కదా యని–అహంకార పూరితుఁడు కాకుండ చేయు సాధనమిది.

ఇట్లు "రాజ్యాంతే నరకంధ్రువమ్" అని రాజునకు నరక భయమును చూపి – కర్తవ్యోన్ముఖుని గావించుటకై యేర్పడిన ఉక్తి యిది.

అప్పుడే – రాజైనవాడు – దండమును ధరించినను యముని వలె నిష్పక్షపాతముగా శిక్షింపను ప్రయత్నింపఁ గలడు. తన కోశమును – ప్రజల ఆహ్లాదమునకై వినియోగించి చంద్రుఁడగును. తన ప్రతాప కిరణములను సర్వత్రవెదజల్లి "భీమ–కాంత" గుణములతో ప్రజలను కర్తవ్యోన్ముఖుల గావింపఁగలడు. ఇతఁడు శాంతిసౌఖ్యములకు ప్రేరకకర్తగా పని చేయఁగలఁడు. అప్పుడు తప్పక – లోకపాలాంశ సంభవుఁడని ప్రజామన్ననలఁ బడయఁ గలడు.

ఏ యంశమున అజాగ్రత్త వహించినను–నరకయానము తప్పదు. "రాజును పాలివాఁడ యెవ్వరేమి చేసిన ఫలములయెడ నృపాల" అను పలుకులు చెవులలో మ్రోగుచున్నంతవఱకును – రాజు తానే గాక – తన ప్రజలనుఁగూడ సన్మార్గ ప్రవర్తకులఁ జేయఁగలఁడు. విశ్వ మానవ కల్యాణమునకు బాట వేసినవాఁడగును,



రాజ ధర్మము—నాఁడు—నేఁడు

సర్వే ధర్మాః రాజ ధర్మ ప్రధానాః
సర్వే త్యాగాః రాజ ధర్మేషు దృష్టాః
సర్వా దీక్షా రాజ ధర్మేషు చోక్తాః
సర్వా విద్యా రాజ ధర్మేషు యుక్తాః
సర్వే లోకాః రాజ ధర్మే ప్రవిష్టాః

భారతము శాంతి ప. 63 అధ్యా 27 శ్లో॥

అన్ని ధర్మములు రాజధర్మమే ప్రధానముగా గలవి. రాజధర్మము నందే అన్ని త్యాగములు కనిపించుచున్నవి. సమస్త దీక్షలు రాజ ధర్మమునందే చెప్పఁబడినవి. సర్వ విద్యలు రాజధర్మము నందే ఇమిడియున్నవి. సర్వలోకములు రాజధర్మమునందే ప్రవేశించినవి" అని శాంతి పర్వమున రాజ ధర్మము యొక్క సర్వోత్తమత్వము తెలుపఁబడినది.

ఆనాఁటి – ఈనాఁటి ప్రభుత్వములలో సామ్యమేమైనగలదేమో గమనింపవలసి యున్నది.

రాజులు మారిరి – రాజ్యములు మాఱినవి. దేశ విస్తీర్ణత మారినది. కాలము దొర్లిపోయినది. అయినను భారత దేశమునందలి ప్రభుత్వములో అప్పటికి – ఇప్పటికిని మారని ధర్మములు కొన్ని శాశ్వతముగా ఉండిపోయినవి

ఆనాఁడు రాజును దైవాంశ సంభూతునిగా గౌరవించువారు. ఒకప్పుఁడు జనులకు రక్షకుఁడే లేఁడు. ప్రజలు మిక్కిలి అన్యోన్య ముగా జీవించుచుండిరి! క్రమముగా వారిలో శాంతి సన్నగిల్లినది. వేద విధ్వంసకులై – అకార్యశూరులై ప్రజలు విచ్చల విడిగా విహ రించిరి. బ్రహ్మను వేడి – అరాచకమునుండి రక్షించుకొనుటకు ప్రభువును పొందిరి. అతఁడేమనువు. అతనిని లోక పాలాంశునిగా భావించువారు. "నా విష్ణుః పృథివీపతిః" అని మన్నించిరి.

ప్రజలలో అధిపతి యెడల – ప్రభువునెడల గౌరవ ప్రతిపత్తు లేర్పడవలెననిన తప్పక అతనిని ఏ చంద్రవంశ సంజాతునిగనో – సూర్యాంశ సంభవునిగనో తలంపచేయవలసి యుండెడిది. అతని యాజ్ఞను ప్రజలు శిరసావహింపవలెను. కనుక లోకపాలాంశుఁడని ప్రకటించిరి. రాజరికము వంశపారం పర్యముగా వచ్చుచుండినది. అయినను రాజు నిరంకుశుడుకాఁడు. అతనికి గురుతర బాధ్యతల నిర్వర్తింప వలసియుండెడి- పురుషార్థవేత్త, పురుషకారము చేయఁ గలవాఁడు, మేధావి, ధారణాశక్తిగలవాఁడు. న్యాయోచిత దండము ధరించువాఁడు రాజైయుండవలెను. గుప్తచారులే నేత్రముగా రాజ్యము నందలి ప్రజల నరయువాఁడు – శత్రువు బాలుఁడైనను – వృద్ధుఁడైన చంపఁగల పటుబుద్ధి, కృషి వాణిజ్యముల సంరక్షించువాఁడు. విశిష్ట కాలములందు విశిష్ట దేవతల యాకారములను ధరించువాఁడు అయియుండెను, చారులను చక్షువులుగా ప్రజా స్థితి నవగత మొనర్చు

కొనునపుడతఁడు సూర్యుఁడు దుష్టుల నాశ మొసర్చ మృత్యువు, ధార్మికుల రక్షించుట యందు యముఁడు. అపకారుల సంపదల హరించు యుపకారుల కొసంగునపుఁడు కుబేరుఁడు. ఇట్లు రాజ్యమందంతట తానే తానై బహు భంగిమల, బహు కార్యముల చేయుచు చేయించుచు దండ ధారియై సంచరించువాఁడు – రాజు, "రాజా ప్రకృతి రంజనాత్" అని వ్యుత్పత్తి

మాతా పితా గురుర్గోప్తా వహ్నిర్వైశ్రవణో యమః
సప్త రాజ్ఞో గుణానేతాన్ మను రాహ ప్రజాపతిః

భార. శాంతి 139 అధి 104శ్లో॥

రాజు ప్రజల యెడ కృప గలిగి రక్షించును–గనుక తండ్రి. దీనులను దుఃఖితులను – భాగ్యవంతులను అందఱిని సమాన దృష్టితో చూచువాఁడు గనుక తల్లి. ప్రజలలో – అప్రియులైన వారిని దహించును గనుక అగ్నిదుష్టుల దమనమతని విధి కనుక యముఁడు ప్రియ జనులకు రెండు చేతుల దానమొసంగును గనుక కుబేరుఁడు. ధర్మోపదేశము గావించును గనుక రాజే గురువు. సర్వుల రక్షించువాఁడు గనుక రక్షకుఁడతఁడు.

కనుక ఇంతటి గురుతర బాధ్యతతో రాజు వెలుగుచుండినాఁడు. నేటి రాజ్యము ప్రజా పాలనము. ప్రజలచేత (ప్రజా ప్రతి నిధులచేత) ప్రజల కొఱకు ప్రజలయొక్క రాజ్యమిది. ప్రజలు తమ్ము పాలించు వారిని ఎన్నుకొనుచున్నారు. ఆ నాఁడు ప్రజా తంత్రము కాదు.

అయినను రాజులు ప్రజలకు మిక్కిలి భయపడువారు. ప్రజా రంజనమే తమ కర్తవ్యమని – వారి యభిమానమును చూఱఁగొనుటకై శ్రమపడువారు. దుర్యోధనుని వంటి దురభిమానియు – ధర్మజాదులు ప్రజామన్ననల పొందుచుండుట సహింపలేక - వారిని వారణావతమున కంపినాఁడు. ప్రజలకు వారిని దూరముగావించి తాను వారి మన్ననల పొందను తాపత్రయపడినాఁడు.

ద్రౌపది — శ్రీ కృష్ణుడు రాయబారమునకు పోవునపుడు తాపడిన బన్నముల స్మరించి విలపించినది. "రాజ్యము పాలులేక సంధి కొడం బడిన మమ్ములను మూర్ఖులని ప్రజలు నిందింపరా! వీర సమర్థులు సిగ్గులేనివారు"నని లోకము వారు పలుకరా? యని లోకనిందకు వెఱచి నది. ప్రజాభిప్రాయమానాఁడెంతటి ప్రాముఖ్యము వహించియుండెడిదో ముందే పరిశీలించితిమి. కనుక — ఆ నాఁడు ప్రజాస్వామ్యము కాకున్నను — ప్రజా స్వామ్యమంతగా ప్రజాభిప్రాయములను మన్నించి నది - రాజ వంశము.

రాజు విష్ణ్వంశ సంభూతుఁడే. అయినను అతనిలోక పాలాంశము భూతలమున కొన్ని నియమములకు కట్టుబడినది. తపస్వులకు బ్రాహ్మణ వాక్కులకు కట్టుబడి పాలన గావించువాడు. ఉత్తములగు అమాత్యులు — ప్రధానులు — వీరితో మంత్రాలోచన జరిపి — రాజ్యవిషయముల నిర్ణయించువారు — రాజులు.

విషయమెంతటి ప్రధానమైనను అప్రధానమైనను రాజు సర్వు లతో విచారించి — ఆలోచించి తన నిర్ణయమును గైకొనువాఁడు. రాజు వారి అభిప్రాయములను గ్రహింపవచ్చును. గ్రహింపకను పోవచ్చును దుర్యోధనుఁడు పాండవులు అజ్ఞాతవాస మొనర్చునపుడు భీష్మాదులను, దుశ్శాసనాదులను ఏకత్ర సమావేశపఱచి అభిప్రాయములను సేక రించినాఁడు

రాజ్యాంగ విధానమున నృపుని తరువాత ఆ నాఁడు అమాత్యునిదే ముఖ్య స్థానము.

ప్రభుత్వమున ప్రధాన భాగములు మూఁడు. శాసన నిర్మాణము- కార్యనిర్వహణము — దండనీతి. న్యాయ నిర్వాహకుఁడును ఆ నాఁడు రాజే! మానవ జీవితమును క్రమ బద్ధము చేయు నియమ సంహిత న్యాయము. ఆచారములు - అలిఖిత న్యాయ సంస్థలు.

వేద శాస్త్రములు — లిఖిత న్యాయ సూత్రములు :

"ఏయే పనులు చేయవలెనో ఏవేవి చేయకూడదో వివరించి వాటినతిక్రమించిన వారు శిక్షార్హులని స్పష్టము చేయు సాధారణ నియమములే న్యాయ సూత్రములు" అని సిడ్జ్విక్ వాక్యము.

న్యాయ సూత్రముల కాధారములు — ఆచారములు, మతము, శాస్త్రీయ చర్చలు — తీర్పులు — సమత శాసనములు.

సామాజికాచారములు — ఎప్పుడు ప్రారంభములయినవో చెప్ప లేము. ఒకతరము వారి అభ్యాసములు మఱొక తరము వారి ఆచారములు, ఆచారములు రాజకీయముగా శాసనములు కావు, రాజకీయాధికారము వానిని గుర్తించి అమలు జరిపినపుడు అది న్యాయ శాస్త్రమగును.

నైతిక సూత్రములు కూడా న్యాయములోని భాగములు.

ఆ నాఁడు దండనీతిని రాజే నిర్వహించువాఁడు. ఆ నాఁటి రాజునకు దండనీతి గ్రహించి నిష్పక్షపాత బుద్ధితో తూచి తూచి — ప్రజల దోషమునకు తగనట్లు శిక్షను విధింపవలసి యుండినది.

మాతా పితా చ భ్రాతా చ
భార్యా చైవ పురోహితః
నాఽ దండ్యో విద్యతే రాజ్ఞః
యః స్వధర్మే నతిష్ఠతి

భారతము శాంతి ప.

రాజునకు దండ్యుఁడు కాని వాఁడు లేఁడు. తల్లి — తండ్రి సోదరుఁడు — భార్య — పురోహితుఁడు — ఎవ్వరైనను స్వధర్మము నుండి భ్రష్టుఁడైన దండనార్హుఁడే! రాజు కరుణలేక దండన కర్హుఁడైన వానిని దండింప వలసినదే!

అట్లు – రాజే న్యాయ విభాగమును నిర్వర్తించినను మునులకు–తపస్వులకు బ్రాహ్మణులకు – ప్రజలకు భయపడి దండనీతిని ప్రయోగించువాఁడు. కడకు తాను దోషియైన తన్ను తానే దండించు కొనుటకును వెనుదీయఁడు.

పాండవులైదుగురు ద్రౌపదిని పరిణయమాడినారు. ఒక్క భార్య అయినందున – స్త్రీవలన కలఁతలు రావచ్చునని, కనుక కొన్ని కట్టు బాటులతో మెలఁగుఁడని నారదుడు హెచ్చరించినాఁడు. ఒక్కొక్క రొక్కొక సంవత్సరమామెతో గడుపునట్లును–తక్కిన వారాసమయమున వారి గృహమును చొఱకుండునట్లు నియమము గావించుకొనిరి, ద్రౌపది ధర్మజునింట నున్న సమయమున బ్రాహ్మణుని గోవులను రక్షించుటకై అర్జునునికి వారింట చొఱవలసి వచ్చినది. ఆయుధము లచ్చట నున్నందున తప్పనిసరిగా అచ్చటికి ప్రవేశించినాఁడు. బ్రాహ్మణుని ముచ్చుల బాఱినుండి రక్షించినాఁడు. నియమమునను సరించి – అర్జునునకు ఒకయేడు తీర్థయాత్రలకు పోవలసి వచ్చినది. బ్రాహ్మణ రక్షణకై పోవుటవలన దోషములేదని అన్నలు చెప్పిరి. అయినను – రాజులు-రాజానుజులే తాము గావించుకొనిన నియమముల నుల్లంఘించిన పరిహాసాస్పదులు కారా! అని అర్జునుఁడు తీర్థయాత్రకేగినాఁడు.

కనుక–"నియమోల్లంఘన – శిక్ష" ఇందు రాజు రాజు బంధువు అను వివక్షలేదు. అది ఆ నాఁటి పాలనా విధానము. అంతటి శిక్షణతో పాలనావ్యవస్థ నడచినప్పుడది రాజరికమైన నేమి? ప్రజా స్వామ్యమైన నేమి? న్యాయమునకు భంగము కలుగక – శాసనోల్లంఘన జరుగక – ప్రజారక్షణ గావింపఁబడుచుండెడిది.

ధృతరాష్ట్రునకు – న్యాయముగా పాండవుల రాజ్య భాగమును వారికియ్యవలసి యుండినది. దుర్యోధనాదుల కుతంత్రమునకులోనై ఇయ్యలేదు. ఫలితమును – రణ రంగమున గాంచినాఁడు.

ఆ నాఁటి రాజులు—"స్వధర్మే నిధనం శ్రేయః" అని తమకొత్త్వ ధర్మమునందే జీవితమును గడపుటయో – మరణించుటయో – నిర్ణ యించుకొనువారు.

ఇంతటి యుత్తమ ధర్మమును రాజునందు ప్రతిష్ఠించుటచే "రాజ రికము" వలన ప్రజలు సంతుష్టజీవనమును గడపిరి. శాసననిర్మాణము చేయుపని–మొదటి భాగము కార్యనిర్వహణము గావించుట – రెండవ భాగము న్యాయనిర్ణయము గావించుట – మూఁడవ భాగము.

ఈ మూఁడు శాఖల ద్వారా ప్రభుత్వము నిర్వహింప గలదు. ప్రభుత్వము — రాజ్యము సమాన పదములు కావు ప్రభుత్వము రాజ్యమునకు ప్రతినిధి. ప్రభుత్వము రాజ్య లక్షణములలో నొకటి. ప్రభుత్వము హద్దుమీరి ప్రవర్తించిన రాజ్యము తొలఁగింపను గలదు. రాజ్యము శాశ్వతము. ప్రభుత్వము పరిమితము.

ఆ నాఁటి రాజ్యము – భరతభూమి యందలిది. భారతీయులది. ఈ నాఁటి రాజ్యము వారిదే – కాని ఆ నాఁటి ప్రభుత్వము రాచరికము ఈ నాటి ప్రభుత్వము – ప్రజాస్వామ్యము, రాజ్యములో మార్పులు అసంభవము. ప్రభుత్వములో మార్పు సంభవము.

భారతమునందు – రాజ్యము – సప్తాంగ సమన్వితము. స్వామ్య మాత్య సుహృత్ కోశ రాష్ట్ర దుర్గ బలములే ఆ సప్తాంగములు. ఈనాఁటి ప్రభుత్వమున ప్రధానాంగములు నాలుగు. ప్రజలు–ప్రదేశము – ప్రభుత్వము — సార్వభౌమాధికారము.

ఒక ప్రదేశములో స్థిరపడిన మానవుఁడు — ఆ ప్రదేశమున పౌర సత్వము పొందఁగలడు. ఈ నాఁడును ఆ నాఁడును పౌరసత్వ నియమమొక్కటే కురులు – కాంభోజులు – శూరసేనులు వంటివి.

ఒకే ప్రదేశమునందలి పౌరులలో — సంఘీభావము — దేశాభి మానము — ఉండును. ఈ సంఘీ భావమీనాఁడును గలదు.

ప్రజలను దేశమున క్రమబద్ధ జీవనము గడుపజేయుటకు శాసనములవసరము.

ఆ నాడు — శాసనములను — మునులు — బ్రాహ్మణులు చేయుచుండిరి. ఇచ్చట బ్రాహ్మణులనగా జాతిపరముగా గాక — జ్ఞాన పరముగా గ్రహింపవలెను. బ్రహ్మ జ్ఞానము గలవారు బ్రాహ్మణులుగా భావింపబడువారు. అనగా రాజ్యమునందలి — మేధాసంపన్నులు - ధారణాకుశలురు — ప్రజ్ఞా పారగులు. (High Intellectuals) అట్టి సమూహమే — శాసనములు గావింప సమర్థము. అందును వారు తపస్వులై, స్వార్థరహితులై, సంయములైనపుడా శాసనములు-నిజముగా ప్రజాశ్రేయస్సును — కల్యాణమును ఒనర్పగలవు.

ఆ నాటి శాసనములు :—

"శ్రుతిః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః
సమ్యక్సంకల్పజః కామో ధర్మమూలమిదం స్మృతమ్"

వేదములు, ధర్మ శాస్త్రములు, సత్పురుషుల ఆచారములు అంతఃకరణము, సత్సంకల్పము వలన గలిగిన ఇచ్ఛ — ఇవి ఆ నాటి శాసనములు. ఆ నాడు రాజు ఈ వేద శాస్త్రములను సదాచారములను శాసనములుగా గ్రహించి — మంత్రిమండలి అనుమతిని, ప్రజల అభిప్రాయములను సేకరించి రాజ్యపాలన మొనర్చువాడు

ఈ నాడు శాసనములు — శాసన సభలచే గావింపబడుచున్నవి. ప్రజా ప్రతినిధులు సమావేశమగుదురు. ఒక విషయముపై చర్చలు జరుగును. ప్రతి పక్షములు తమ అభిప్రాయములను తెలుపును అధిక సంఖ్యాకుల మతమును గ్రహింతురు. ప్రజావసరములు శాసనములై వెలువడును.

శాసనముల నిర్మాణము — కార్య నిర్వహణము — న్యాయము ఈ మూడు రాజ్యాంగములు ఒకరి చేతియందే ఉన్నచో — అధికారము

కేంద్రీకృతమై నియంతృత్వమునకు దారితీయగలదని రాజనీతివేత్తలు Aristotle మొదలగువారు గుర్తించిరి. క్రమముగా వికేంద్రీకరణకై పాటు పడిరి. అధికార కేంద్రీకరణ దుష్ఫలితములననేక రాజ్యములు గుర్తించినవి పృథక్కరణము జరిగినది.

భారత దేశమునందును ప్రజా స్వామ్యమున – ఈ అధికార పృథక్కరణము జరిగినది.

ప్రజా ప్రతినిధులతో నిండిన సభ శాసనముల గావించును రాజ్య సభ సమ్మతిని గ్రహించును. (గ్రహింపకున్నను శాసనములు వెలువడును) ప్రజా ప్రతినిధుల అధిక సంఖ్యాకుల సమ్మతితో శాసనము లగును.

మంత్రి మండలి కార్యముల నిర్వహించును. భిన్న భిన్న శాఖల మంత్రుల ఆయా విభాగముల కార్యములను నిర్వహింతురు

ఆ నాఁడు – రాజు కార్యనిర్వహణ గావించువాఁడు.

ఆత్మత్యాగః సర్వభూతాను కంపా
లోక జ్ఞానం పాలనం మోక్షణంచ
విషణ్ణానాం మోక్షణం పీడితానాం
క్షాత్రం ధర్మే విద్యతే పార్థివానామ్
భార· శాంతి 27-64 అధి. శ్లో॥

ఇంద్రియ నిగ్రహముతో ఆత్మత్యాగమున పరిపాలించుట సర్వ భూతములందు అనుకంపఁగలిగి యుండుట – లోకజ్ఞానము వ్యవహరించుట, పాలన మోక్షణలు తెలిసియుండుట – విషణ్ణుల పీడితుల – పీడలను పోగొట్టుట. ఈ ధర్మములు క్షాత్త్ర ధర్మములు.

అట్టి ఆశ్రమ ధర్మముల రక్షించువాఁడు–పాపుల పాపకార్యముల నుండి దూరమొనర్చువాఁడు — దండనీతిని స్వపరవివక్ష లేక

ప్రయోగించువాఁడు - నియమోల్లంఘన గావించిన వారెవరైనను వారిని తగిన శిక్షచే దండించుఁవాడు – రాజైనచో ఆ రాజ్యమునందలి ప్రజల సుఖమునకు – సర్వతో ముఖాభివృద్ధికి కొఱత యెక్కడిది?

కనుక అట్టి పరిపాలన గావించు రాజు చేతులో పరిపాలనాంగములు- కార్యనిర్వహణ విభాగము – దండనీతి (న్యాయ శాస్త్రము) రెండును ఉన్నను – ప్రజలు దుఃఖితులు కాలేదు వంచితులు కాలేదు.

దుర్యోధనుఁడు – పాండవుల యెడ అన్యాయము గావించి యుండవచ్చును గాక! ప్రజలకే అన్యాయము గావింపక ప్రజాసౌఖ్యమే తన ధ్యేయముగా పరి పాలించెననుటకు – ధృతరాష్ట్రుఁడు వనగమన మొనర్చినపుడు ప్రజలు పలికిన పలుకులే సాక్ష్యములు.

అధికార కేంద్రీకరణము వలదు – పృథక్కరణమే ప్రజలకు శ్రేయస్కరమనుట సత్యమే! అందులకై రాజ్యములు కృషి సలుపు చుండుట ముదావహమే! అయినను సంపూర్ణ పృథక్కరణము సాధ్యముకానిపని. పరస్పరము – కొంచెముగనో – గొప్పగనో – పర స్పరమాధార భూతములుగా నుండుట నేటి ప్రజా స్వామ్యమునందును గుర్తించుచున్నాము. ఉదాహరణకు మూడు శాఖలు – ఒకదానిపై నొకటి ఆధారపడియుండుట ఒకదానిపైనొకటి పెత్తనము చలాయించుట తగదు – కూడదు. అయినను – సంపూర్ణ పృథక్కరణము సాధ్యము కాదని నిరూపింపవచ్చును. న్యాయశాఖ – స్వతంత్రమైనది.

ఒక ప్రత్యేక సమస్యపై న్యాయస్థానము తీర్పులిచ్చు సందర్భమున నూతన నిర్ణయముల చేయవచ్చును. వీనిని(Judge Made Laws) న్యాయాధిపతి గావించిన శాసనములు అనవచ్చును కనుక న్యాయశాఖ- శాసనములను చేయుసందర్భములును గలవు.

శాసనసభ — శాసనముల నిర్మించుశాఖ అత్యవసర పరి స్థితులలో – శాసనసభ సమావేశము కానప్పుడు కార్యనిర్వాహకవర్గము

**(Ordinances)** తాత్కాలిక శాసనములను, చేయుచున్నది. అవి శాసనములుగనే కొంతకాలము నిర్వహింపఁబడుచుండును. శాసనసభ సమావేశమైనపుడు అయా **(Ordinances)** తాత్కాలిక శాసనములను శాసనములుగా ఆమోదింతురు అవి తిరస్కరింపబడును వచ్చును. కాని కార్యనిర్వాహక వర్గము శాసనసభలో-తమ పక్షమునకున్న అధిక సంఖ్యా బలముతో ఆ తాత్కాలిక శాసనములను — ఆమోద ముద్రవేసి — శాసనములుగా అంగీకరింపఁ జేయఁగలదు.

ఈ విధముగా శాసన సభ — కార్యనిర్వాహక వర్గమును అదుపులో పెట్టఁగలదు. ప్రజా స్వామ్యములో శాసన సభకు అధికారము లెక్కువ. కార్యనిర్వాహక వర్గము సభకు విధేయము. సభ అనుమతి లేనిది — కార్య నిర్వాహక వర్గము దేశాభ్యుదయ కార్యములకై ధన వ్యయము చేయవీలులేదు. కనుక - కార్యనిర్వాహక వర్గముపై శాసన సభకు పెత్తనమున్నదనికూడా చెప్పవచ్చును. అట్లయ్యు-శాసనములు న్యాయ బద్ధములుఁగనే యుండవలె. ప్రతి పక్షముల విమర్శ నెదుర్కొనును

ఇట్లు - అధికార పృథక్కరణకై ప్రాకులాడుచున్న ఈ నాటి ప్రభుత్వములందును - రాజ్య ప్రధానాంగములు పరస్పరాశ్రయములై వర్తించు సన్నివేశములు పెక్కులు గలవు.

ప్రాథమిక హక్కులు - ప్రజలానాఁడును అనుభవించిరి. ఈ నాఁడును అనుభవించుచున్నారు. వ్యక్తిగత స్వేచ్ఛ ప్రాణ రక్షణ, వ్యక్తి భద్రత, వాక్స్వాతంత్ర్యము, మత స్వాతంత్ర్యము - ఆస్తి - ఇట్టి ప్రాథమిక హక్కులను ఆ నాఁడు - "రాచరికము" నందు ఈ నాఁడు ప్రజాస్వామ్యమునందు ప్రజలనుభవించిరి. అనుభవించుచున్నారు.

ఇట్లెన్ని భంగుల గమనించినను - ఆ నాఁటి రాజరికమునందును శాసనములు గలవు - శాసనముల నతిక్రమించినవారికి శిక్షలు గలవు. ప్రజాభ్యుదయమే - ఆ నాఁటి రాజుల ధ్యేయము.

